# భా వు క సీ మ

( సాహిత్య వ్యాస సంపుటి )

డాక్టర్ కోవెల సుప్రసన్నాచార్య

యు వ భా ర తి
సాహితీ సాంస్కృతిక సంస్థ
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

# భావుకసీమ

(సాహిత్య వ్యాస సంపుటి)

ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య

అధ్యక్షులు, తెలుగుశాఖ

కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్

యువభారతి

సాహితీ సాంస్కృతిక సంస్థ

తిలక్ రోడ్, హైదరాబాదు-500 001.

**BHAAVUKA SEEMA**
Literary criticism by Prof. Kovela Suprasannacharya
Head, Department of Telugu, Kakatiya University,
Warangal – 506 009.
Publihed by YUVABHARATHI, A Literary and
Cultural Organisation, Tilak Road, Hyderabad–500 001.

---



యువభారతి ప్రచురణ సంఖ్య–143

ప్రథమ ముద్రణ : 7 ఫిబ్రవరి 1993

ప్రతులు : వేయి

వెల : 40-00

తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయంతో ముద్రింపబడినది.

ప్రతులకు :

1. **యువభారతి**
   సాహితీ సాంస్కృతిక సంస్థ
   ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
   తిలక్‌రోడ్, హైదరాబాదు–500 001

2. **శ్రీవాణీ ప్రచురణలు**
   3–19, పరిమళ కాలని,
   వడ్డెపల్లి, వరంగల్–506 370

ముద్రణ :

**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్**
1–1–517/బి/1, గాంధీనగర్,
న్యూ బాకారం, హైదరాబాదు–500 380.
ఫోన్ : 611413

# యువభారతి : 'భావుక సీమ'

ఉత్తమ సాహిత్యాన్ని సామాన్య ప్రజలకు సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమాల ద్వారా, ప్రచురణల ద్వారా అందించి సమాజంలో సాహితీ స్పృహను పెంపొందించటం యువభారతి సాహిత్యోద్యమ లక్ష్యం. ఆ ఉద్యమంలో ఇప్పటికి శతాధిక గ్రంథాలను ప్రచురించి, సహస్రాధిక కార్యక్రమాలను నిర్వహించి ఈమధ్యనే రజతోత్సవాలను నిర్వహించుకున్నది మా యువభారతి. రచయితలు సొంత ఖర్చుతో ప్రచురించుకొనే పుస్తకాలను యువభారతి ప్రచురణలుగా వెలువరించే ఒక పథకం సంస్థ చేపట్టింది. యువభారతికి రచయితలకు ఏర్పడ్డ స్నేహబంధానికి ఇది తార్కాణంగా నిలుస్తుంది. ఈ పథకంలో ఇప్పటికే కొందరు తమ రచనలను ప్రచురించారు. ప్రసిద్ధ కవులు, సాహితీ విమర్శకులు అయిన ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యగారు తమ 'భావుకసీమ'ను యువభారతి ప్రచురణగా తీసికొని రావటానికి దయతో అంగీకరించినందుకు మేం సంతోషిస్తున్నాం. వారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం.

తెలుగులో ఈనాడు ప్రసిద్ధ సాహితీ విమర్శకులలో, కవులలో ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులు ఒకరు. దాదాపు నాలుగు దశాబ్దాలకు పైగా వారు కవితలను, విమర్శలను, పరిశోధనలను వెలువరించి ఆధునిక సాహిత్యాన్ని సుసంపన్నం, సుప్రసన్నం చేస్తున్నారు. వారిది ప్రధానంగా దార్శనిక ప్రవృత్తి. సాహిత్యాన్ని తాత్త్విక దృష్టితో వివేచించే పద్ధతిలో డాక్టర్ సుప్రసన్న తమదైన ఒక మార్గాన్ని, శైలినీ నిర్మించుకున్నారు. చేతనావర్త కవులలో మొదటి వారుగా సాహిత్యోద్యమ నాయకత్వం నిర్వహించారు. కవితలో తాత్త్విక, ఆధ్యాత్మిక, అనుభూతి శాఖలకు శక్తిమంతమైన కావ్య ప్రయోగాల నందించారు. పరిశోధనలో వివేచనను, సిద్ధాంత రూపకల్పనను చేయగల కొద్దిమంది సృజనాత్మక పరిశోధకులలో ఒకరుగా పేరుపొందారు. 'భావుక సీమ' భారతీయ పునరుజ్జీవన చైతన్య భూమిక నాధారంగా చేసుకొని వికసించిన తెలుగు సాహిత్య పరిణామ దశలను వివేచనాత్మకంగా వివరించే వ్యాస సంపుటి. ఆధునికాంధ్ర సాహిత్య దర్శనానికి కరదీపిక. దీనిని యువభారతి ప్రచురణగా సహృదయుల కందించటం మాకు కలిగిన ఒక మంచి అవకాశం.

జి.వి. సుబ్రహ్మణ్యం
అధ్యక్షుడు

హైదరాబాదు
7-2-1993

# ఇందులో—



---

* 1985 జనవరి 29-31 తేదీలలో వరంగల్లులో జరిగిన సంగోష్ఠిలో సమర్పింపబడిన వ్యాసం.

# సంక్షుబ్ధ వర్తమానంలో భారతీయ సంస్కృతి

వర్తమాన కాలంలో ఐరోపాలో పారిశ్రామికయుగం గడచి, సాంకేతిక పురోగమనం కొనసాగుతున్నది. ఈ సాంకేతిక పురోగమనం మానవజాతి చరిత్రను సంపూర్ణంగా మార్చివేసింది. దూరాలు చెరిగిపోయాయి. వార్తా ప్రసారం, జ్ఞాన వినిమయమూ అనంతంగా పెరిగిపోయింది. ఒక దేశం ప్రజలు మరో దేశం ప్రజలతో సన్నిహితంగా కలిసిపోవడం, పరస్పర జీవన విధానాల సంగమం కూడా కనిపిస్తున్నది. కొన్ని దశాబ్దాలక్రితం విస్పష్టంగా కానవచ్చిన బాహిరమైన వేషభాషాదుల వైవిధ్యం, ఆహారవిహారాలలో ఉండే ప్రత్యేకత క్రమంగా తగ్గిపోయినట్లుగా గోచరిస్తుంది. ఒక సామాన్య లక్షణం క్రమంగా మానవులందరినీ వారిలోని భేదాన్ని గుర్తించడానికి వీలులేనంతగా దగ్గర దగ్గరగా చేరుస్తూ నాగరికతలను సంగమింపజేస్తూ ఉన్నదా? ఒక పాతిక లేదా యాభై యేళ్ళలో అన్ని నాగరికతల నడిమి అంతర్యం కేవలం గత కాలానికి చెందిందే అయి జీవనంలో సామాన్యం, సాధారణ్యం ఏర్పడ నున్నదా అన్న భావం కలుగుతున్నది.

ఇది ఒక పక్షం. పాశ్చాత్యదేశాలు అమెరికాలకు భిన్నంగా ఆసియా ఆఫ్రికా ఖండాలలో-దక్షిణఅమెరికాలో కొత్తగా ఏర్పడ్డ పారిశ్రామికీకరణం సామ్రాజ్యవాదుల ద్వారా సంక్రమించింది. ఈ సాంకేతిక ప్రగతి స్థానిక ప్రజల వృత్తులను నాశనం చేసి నిరుద్యోగులనుగా జేసింది. నాగరిక జీవనం బలం పెరిగి గ్రామ వ్యవస్థలు నిర్జీవాలు అయ్యాయి. కొన్ని దేశాలలో కొత్త ఫ్యూడల్ వ్యవస్థ పీడకంగా తయారయింది. దారిద్ర్యం, కరువుకాటకాలు, ఆత్మవిశ్వాస రాహిత్యం ఇత్యాది గుణాలు ఈ దేశాలకు సాధారణాంశాలు— అయ్యాయి. పాశ్చాత్యదేశాలు చాలాచోట్ల రాజకీయంగా పాలించడం మానివేసినా వారి సాంస్కృతిక సామ్రాజ్యవాదం కారణంగా ఈ ప్రజలు యింకా ఎన్నో రకాల దోపిడికి గురవుతున్నారు.

ఈ పరిస్థితులకు మన దేశం అపవాదం కాదు. మనదేశంవైపు చూస్తే కొన్ని కొన్ని అంశాలు స్పష్టంగా కానవస్తున్నవి. జనం అంతా అకర్మణ్యత, కుక్షింభరత్వం ప్రధాన లక్షణంగా జీవిస్తున్నారా? అనే సందేహం కలుగుతున్నది. సహస్రాబ్దాల పూర్వం చెప్పబడ్డ ఆదర్శాలు అన్నీ చెల్లాచెదురు కాగా జీవన నిర్మితి పూర్తిగా స్వార్థం చుట్టూ వ్యూహంగా మలుచుకొని జీవిస్తున్న ప్రజలు—ఎక్కడా తేజోమయమైన భవ్యమైన సువర్ణకాంతులు వెదజల్లే ఆకాశం అంచులు కూడా కానరాని ఈవేళ మనం ఎటు పోతున్నాము ఏమి కాబోతున్నాము అనే సందేహం కలుగుతున్నది. ఈ స్థితి సర్వతోవ్యాప్తంగా అనివార్యంగా గోచరిస్తున్నది. కొన్ని కొన్ని జాతులు సంపూర్ణంగా 'తన' తనం నుంచి దూరంగా నెట్టివేయబడుతున్నాయి. ఈ స్థితిలో మన దేశంలోకూడా దాదాపు రెండువందల సంవత్సరాల కాలంలో వచ్చిన మార్పు ఆశ్చర్యం కలిగిస్తున్నది. ఇన్నివేల సంవత్సరాల పురాతన దేశంలో ఈ నిర్దిష్ట కాలఖండంలో జరిగినంత మార్పు పూర్వమెప్పుడూ జరగలేదు. మనం మన మౌలిక మూల్యాలకు బహు దూరంగా వెళ్ళిపోతున్నా మనిపిస్తుంది. ప్రాచీనాంశాలు ఎక్కడైనా నిలిచిఉంటే అవి శిలలలాగా జడములుగా కానవస్తున్నాయి. ఈ సంక్షోభ స్థితిలో మనం ఆత్మావలోకనం చేసుకుంటే కొన్ని ప్రశ్నలు మనకు కలుగుతున్నాయి.

వేదాలు ఉపనిషత్తులు ఇలా చెప్పబడే మన దేశపు ఆదర్శాల శిఖరాలు కేవలం చిలుక పలుకులే అవుతున్నవా? జీవితం లక్ష్యం పూర్తిగా జాతీయ జీవన చైతన్యానికి భిన్నంగా మారిపోయిందా? దీని కిప్పుడు కేంద్ర బిందువు ఏది? మన వేషము, భాష, ఆచార విచారములు, స్త్రీ పురుష సంబంధాలు, వ్యష్టి సమష్టి సంబంధాలు ఇవన్నీ భారతీయ సంస్కృతికి భిన్నంగా మనం రూపొందించుకోబోతున్నామా? ఇవీ ఈనాటి ప్రశ్నలు.

## 2

ఈ ప్రశ్నలకు సమాధానాలు చెప్పబోయేముందు మనం భారతీయ సంస్కృతి యొక్క స్వరూపాన్ని అవగాహన చేసుకోవాలె. సంస్కృతి, నాగరికత ఈ రెండూ మనం వ్యవహరించే శబ్దాలు. దాదాపు ఏకార్థకాలేమో అన్నంత దగ్గరగా మనం వ్యవహరిస్తూ వుంటాము. ఈ రెంటినీ నిర్వచించాలంటే కఠ

దాన్ని భావమనీ, రెండోదాన్ని అభివ్యక్తియనీ వ్యవహరించవచ్చు. భావము గానీ అభివ్యక్తిగానీ మానవ జీవన అనుభవంలోంచి పుట్టుకు వచ్చేవి. భారత దేశంలో సహస్రాబ్దాలుగా సాగిన జీవన మథనంలో నిల్రదొక్కుకున్న తత్వ సంపుటి భావ రూపాన్ని పొందితే, జీవనావసరాలు, భౌగోళిక చారిత్రకావస రాలు, వీటి అన్నింటి అడుగున వ్యక్తి చైతన్యమును నిర్దేశించే భావమూ ఈ మూడింటి ఆధారంగా జాతీయ అభివ్యక్తి ఏర్పడుతుంది. ఈ అభివ్యక్తికి ఆధా రమైన మూటిలోనూ మొదటి రెండు కాలాంతరాలతో పరివర్తన చెందేవి. మూడ వదియైన భావరూపం పరివర్తన చెందదు. కానీ క్రమంగా పరిపూర్ణతవైపుగా ఎదుగుతూ వుంటుంది.

అయితే భావము - ఇది మనో లోకానికి చెందింది - అనుభూతి దీనికి పాదు. ఇది వ్యక్తిగతమైంది కాదు - సమష్టి అనుభూతిలోంచి పుట్టుకు వచ్చేది. ఈ భావం సంస్కార రూపంలో జాతి జనులందరిలో అనుగమిస్తూ వస్తుంది. కొన్ని చోట్ల అది నిద్రితమై ఉండవచ్చును. కొన్ని చోట్ల ఉజ్జ్వలంగా ప్రకా శిస్తూ ఉండవచ్చును. అందువల్లనే ఈ సంస్కారం సాధారణ వేళల్లో అస్తి నాస్తి విచికిత్సకు హేతువై కూడా సంఘర్షణలో తీక్షణంగా ప్రకాశించడం కద్దు. ఈ సంస్కారం ఒక్కోజాతిని ఒక్కోవిధమైన ధోరణిలో తీర్చుకునే అవకాశం కలిగిస్తుంది. ఈ సంస్కార సంపుటిలోని ప్రాణవంతములైన అంశాలు ఎప్పుడైతే మరుగున పడిపోతాయో అప్పుడు ఆ జాతి క్షీణదశ ప్రారంభ మవుతుంది. బాహిరమైన అభివ్యక్తి భావస్థానాన్ని ఆక్రమిస్తుంది. భావ విర హితమూ, లేదా భావవ్యక్తి చేయలేనిదీ అయిన అభివ్యక్తి మౌఢ్యానికి దారి తీస్తుంది.

ఈ అభివ్యక్తి నిరంతర పరివర్తన శీలమైంది. కాల దేశ ప్రాంతాలు దీన్ని పరిణమింపజేస్తూ పోతవి. అభివ్యక్తినే భావమని అనుకున్న వేళలో భావమే నశిస్తున్నదని భ్రాంతి పొందడం జరుగుతుంది. కొన్ని కొన్ని సంద ర్భాలలో జాతి పొందే సంఘర్షణ మౌలికమైన పరివర్తన, పరంపరాచ్ఛేదము ప్రపంచ చరిత్రలో భావరూపాన్ని కూడా పూర్తిగా కోల్పోయిన సన్నివేశాలను పట్టి యిస్తవి.

భారతీయ సంస్కృతి - సంస్కారము దీనికి ఆధారమైన భావ సంపుటి ఏమిటి? ఈ సంపుటి విజాతీయ భావ సంపుటికంటే భిన్నమైనదా? ఆ ప్రత్యేక మైన విశిష్టమైన భావ సంపుటి ఆదినుంచి అవిచ్ఛిన్నంగా కొనసాగుతూ పరివర్ధిత మౌతూ వస్తున్నదా? ఎక్కడో ఒక విచ్ఛేదము, చ్యుతి కలుగలేదా అన్న అంశాలు మనం చర్చించుకోవలసినవి.

భారతీయమైన సంస్కారం యొక్క ప్రాథమికమైన భావ సంపుటిని సంగ్రహంగా ఇలా వివరించుకోవచ్చును :

1. చరాచరమైన ఈసృష్టి అంతా ఒక మహాశక్తి యొక్క వివృత్తిలోంచి వికసించినదే, ఈ వికసించిన ప్రతీ అంశమూ తన మౌలిక స్థితిని లభింపజేసు కోవడమే ఈ సృష్టి లక్ష్యము. ఈ సృష్టిలోని సౌరకుటుంబాలు, నక్షత్రాలు, గ్రహాలు, పృథ్విపైని సమస్త జీవరాశి ఈ లక్ష్యానికి అనుగుణంగానే ప్రవర్తి స్తున్నాయి. ఈ స్వస్థితి పొందడమే ముక్తి. తనలోనే ఉన్న ఆ మహాశక్తి అంశను వివృతి పొందేట్లు చేసి తానే అదిగా-అదే తానుగా పరిణమించడం ఈ క్రమం.

2. ఈ దివ్యజీవన పరిణామానికి మనోమయ జీవనం ప్రధానంగా ఉన్న మానవుడు ప్రధానోపకరణమవుతున్నాడు.

3. పృథ్విపైని జీవనానికీ దివ్యకేంద్రానికీ ఒక అవిచ్ఛిన్నమైన అను సంధానం ఏర్పడింది.

4. జీవనం ఐహికంగా సుఖమయం చేసుకోవడానికి కర్మ అపరి హార్యంగా చేయవలసినదే. అయితే ఈ కర్మ చేస్తూనే దానిఫలమందు సంలీనం కాకుండా అది క్రమంగా చేర్చవలసిన దివ్యపరిణామం వైపుగా మనస్సును లగ్నం చేయడం. ఇది నిష్కామ కర్మ. లేదా ఈశ్వర సమర్పితమైన కర్మ. కర్మ చేస్తూనే దాన్నించి మనస్సును దూరం చేసి దివ్యానుభవం వైపుగా త్రిప్పడం అనేదే తపస్సు అవుతుంది. 'బ్రహ్మనిష్ఠో గృహస్థస్యాత్ తత్త్వజ్ఞాన పరాయణః యద్ యత్కర్మ ప్రకుర్వీత తత్ బ్రహ్మణి సమర్పయేత్.'

5. ఈ జీవనానికి ఋతసత్యములు ఆధారము అవుతున్నవి. ఋతము సృష్టిలోని అనంతస్వరూపాన్ని వ్యాఖ్యానించేది కాగా సత్యము లౌకికమైన అనుభవాన్ని వింగడించి చూసేది. ఈ సత్యఋతముల సమష్టిలో నుంచే ధర్మము ఉద్భవించింది. ధర్మము లోకాన్ని ధరిస్తున్నది. ధర్మానుబంధమైన జీవన సాధన అంటే అర్థకామసేవనము ముక్తిని చేరువకు తెస్తున్నది.

6. సర్వమైన ఈ సృష్టి ఆ మహాశక్తి - లేదా బ్రహ్మము యొక్క విభూతి అవడం వల్ల అంతటా ఆ బ్రహ్మ పదార్థాన్ని చూడగలగడం, దాన్ని నిత్యమూ సాక్షాత్కరించుకోవడం, తనది అన్న దాన్ని సర్వమూ దానికి సమర్పించి తచ్ఛేషముగా మిగిలిన దానిని యజ్ఞఫలముగా భావించి అనుభవించడమూ విహితమైంది.

7. ఈ ప్రకృతి అనిత్యమంటే లేనిదని కాదు. పరిణామశీలమైంది, స్వభావ పరివర్తనం పొందగలదని మాత్రమే అందువల్ల ఈ జగత్తును హేయమని విడువుమనీ చెప్పడం ఈ తత్త్వ సంపుటిలో లేదు. 'పాదోస్యవిశ్వాభూతాని/త్రిపాదస్యామృతం దివి' అన్నప్పుడు బ్రహ్మపదార్థంలో విశ్వమంతా ఒక పాలుగా చెప్పడం జరిగింది.

8. సమాజ వ్యవస్థ నిత్యపరిణామ శీలమైనా దీని కేంద్రంలో బిందువుగా గార్హస్థ్య ధర్మం ప్రవచించిప బడింది. ఈ కేంద్రం చుట్టూ ఆశ్రమాలు, పురుషార్థాలూ పరిభ్రమిస్తున్నది. సమాజంలో ఉత్పాదనకూ, భోగానికీ, వినిమయానికీ, అన్నివర్గాల సమన్వయానికి గృహస్థ జీవనం కేంద్రం అయింది. ఇది స్త్రీ పురుషుల సాహచర్యంవల్ల సిద్ధించేది. సృష్టి అంతా స్త్రీ పుంస యోగమే అయి, ఈ స్త్రీ పురుష వ్యవస్థ దివ్యాదివ్య జీవన సేతువుగా నిలబడవలసి ఉన్నది. వివాహమనే ఈ భావము యొక్క అభివ్యక్తి రూపానికి పునాదిగా ఆకర్షణ, అనురాగము, అనుబద్ధత, ఆరాధన, సమర్పణ, సృష్టియొక్క అనుస్యూతి, అవినాభావము అనే సప్త ధాతువులు నిక్షేపింపబడి ఉన్నాయి.

9. ఈ సృష్టిలో ఒక లయ ఉన్నది. ఆ లయ వల్లనే దీనిలోని సర్వమూ పరిక్రమిస్తూ వున్నది. ఈ లయకు అనుగుణంగా దీనిలోని సామంజస్యం వ్యక్తమౌతూ వుంటుంది. ఈ లయ అవ్యక్తమైంది. ఈ అవ్యక్తమైన

లయను మానవునిలోని సర్జనాత్మక శక్తులు స్పృశిస్తూ వుంటవి. ఈ సర్జనాత్మకమైన శక్తులు అనంతమైన సృష్టిలయతో అనుసంధింపబడ్డప్పుడు సౌందర్యం వ్యక్తమౌతున్నది. ఈ మహా సౌందర్య భావం సాక్షాత్కరించినపుడు ఈ సృష్టి రహస్యం దాని వెనుక ఉన్న తత్త్వమూ ఆవిష్కృతమై భవ్యంగా ఉంటుంది. మన లలిత కళ లన్నిటికీ లక్ష్యం ఈ సృష్టి తత్త్వానుభావమును అనుభవంలోనికి తెచ్చుకోవడమే.

**10.** ఈశ్వరోపాసన వ్యక్తి అనుభవాన్ని అనుసరించి నిర్దేశించుకోవలసింది. ఉపాసకుడు సరూప నిరూప మానసిక యౌగిక మార్గాలలో సాధన చేసుకోవచ్చు. అయినా ధర్మానుబంధమైన జీవనం కూడా ఈశ్వరోపాసనకు మారు రూపమే. ఆ జీవనం విరాడ్రూపమైన ఈశ్వరుణ్ణి సాక్షాత్కరింపజేస్తుంది.

ఈ భావములు భారతీయ సంస్కృతి రూపంగా స్థూలంగా పేర్కొనవచ్చును. ఈ భావాలు ఈ జీవన విధానానికి శాశ్వత మూల్యాలు. ఈ భావాభివ్యక్తిక్రమంలోనే భారతీయ జీవన పద్ధతులు రూపొందుతూ వచ్చాయి. ప్రాచీన కాలం నుంచీ వస్తూవున్న ఈ పద్ధతులు ప్రధానంగా యివి స్వయం సమృద్ధమైన గ్రామీణ వ్యవస్థ వృత్తుల నియమనం చేస్తూ వచ్చిన వర్ణ వ్యవస్థ - వయస్సునుబట్టి మానవుడు తన జీవితాన్ని ఏ విధంగా కొనసాగించుకోవాలో తెలిపే ఆశ్రమ వ్యవస్థ - నాల్గోది. అత్యంత ప్రధానమైంది. పురుషార్థాలను తెలిపే క్రమము.

ధర్మార్థ కామమోక్షరూపమైన పురుషార్థ నిర్దేశము జీవనానికి లక్ష్య నిర్దేశం చేసింది. ఈ ధర్మము వ్యక్తికీ కుటుంబానికి, గ్రామానికి దేశానికి విశ్వానికి ఉండవలసిన అనుబంధాన్ని నిర్దేశించేది. వ్యక్తి సుఖాన్ని ధర్మం ఎప్పుడూ వ్యతిరేకించలేదు. అయినా సుఖాన్ని మాత్రమే లక్ష్యంగా నిర్దేశించలేదు. వ్యక్తి క్రమంగా మమకారాన్ని విస్తరిస్తూ సర్వజగత్తునూ తనదిగా తానుగా భావించే స్థితికి - వసుధైక కుటుంబ భావనకి ఎదగటం. అప్పుడు క్రమంగా తన అహంభావం కూడా విశ్వ చైతన్యంతో అభిన్నంగా రూపొందించుకోవలసి ఉంది. సంకుచితమైన అహంకార మమకారాల పరిధుల నుంచి విముక్తుడై విశ్వాత్మతో సన్నిహితంగా ఎదిగిన వ్యక్తి ఆచరణలో ధర్మం

రూపొందింది. 'రామో విగ్రహవాన్ ధర్మః' అన్నా 'యుధిష్ఠిరో ధర్మమయో మహాతరుః' అన్నా ఇదే తాత్పర్యం. అర్థకామానుభవంలో ఈ ధర్మ నిర్దేశం జగత్ జీవనాన్ని దుఃఖ రహితం చేసేందుకు తోడ్పడుతుంది 'కామయే దుఃఖ తప్తానాం ప్రాణినా మార్తి నాశనం' అంటే ఇదే అర్థం. ధర్మం లోకప్రవృత్తిని నిర్దేశిస్తుంది. పరమార్థం పేరున ఎక్కడికో పారిపోవడం నేర్పదు. ఈ ప్రవృత్తి అహంతా పరిధి నుండి విముక్తమైనప్పుడు నివృత్తి అవుతున్నది. అర్థకామాల మార్గంలో ఈ ధర్మ రథం పరమార్థాన్ని చేరుస్తుంది. విరోధాభాసాలుగా ఉన్న ప్రవృత్తుల నివృత్తుల కలయిక యిక్కడ ఉన్న ప్రత్యేకత.

ఆశ్రమ వ్యవస్థకూడా జ్ఞాన సముపార్జమూ, సుఖ జీవన నిష్ఠ, సమాజ సేవా ప్రవృత్తి 'స్వ'భావంనుంచి నివృత్తి పొంది సమాజ జీవనంలో ఐక్యం కావడం ఇవీ లక్ష్యాలు. రఘువంశంలో కాళిదాసు ఈ ఆశ్రమ వ్యవస్థ మహా రాజులలోకూడా ఉన్నట్లు చూపించాడు. సేవా ప్రవృత్తి, 'స్వ'భావ నివృత్తి, ఐశ్వర్యమూ, ప్రతాపము, అధికారము సమృద్ధిగా ఉన్నచోట సాధ్యమే అయితే మిగిలిన చోట్లకూడా సులభ సాధ్యమవుతుంది.

ఇంతకాలం తరువాతకూడా భారతీయ సంస్కారం రూపొందించుకున్న ఈ పురుషార్థ స్వరూపమూ, ఆశ్రమ వ్యవస్థా తాత్త్వికంగా సజీవంగానే ఉన్నవి. అయితే ఆధునిక కాలంలోని పారిశ్రామికీకరణం, పట్టణాలు పెరిగిపోవడం, గ్రామవృత్తులు నశించడం, సాంకేతికంగా వచ్చిన మార్పులు ఇవన్నీ స్వయం సంపూర్ణమైన గ్రామ వ్యవస్థను దెబ్బ తీశాయి. ఇవాళ్టి గ్రామాలు ఆధునిక జీవనకల్లోలానికి ప్రతిబింబాలుగా ప్రతి చిన్న అవసరానికీ పట్టణం మీద ఆధార పడే స్థితిని పొందాయి. స్వయం వృత్తులు పోయి వ్యక్తి క్రమంగా ప్రభుత్వం మీదనో, పరిశ్రమల మీదనో సంపూర్ణంగా ఆధారపడే స్థితికి వచ్చాడు. దాంతో వృత్తులు పోయాయి. వర్ణవ్యవస్థ భగ్నం అయింది. ఈ వ్యవస్థకు ప్రత్యామ్నాయంగా మరో వ్యవస్థ రూపొందలేదు.

వర్తమాన సంక్షోభం అంతా ఈ అవ్యవస్థలోనుంచి కానవస్తున్నది. అయితే ఈ అవ్యవస్థ సంస్కృతి యొక్క మూలతత్త్వాలను స్పృశించడం లేదు కాబట్టి తాత్త్వికంగా వాటికి క్షతి కలుగలేదు.

సాధారణంగా భావరూపం ఐన సంస్కారం- అభివ్యక్తి రూపమైన వ్యవస్థ- ఏ జాతిజీవనానికైనా రెండు ముఖాలు. ఒకటి అంతర్ముఖము. రెండోది బాహిరము. భావరూప సంస్కారం బలం మీద అభివ్యక్తి రూపుదిద్దుకునేచోట భావం కాలానుగుణంగా మరో రూపాన్ని ధరిస్తూ వర్తమానంలోని సంక్షోభాలను విజయవంతంగా ఎదుర్కోగలుగుతుంది. ఏ జాతి జీవనంలో భావముఖం బల హీనమై వ్యవస్థ ప్రధానంగా ఉంటుందో అక్కడ సంక్షోభం వస్తే కాలాను గుణంగా ఆ వ్యవస్థ పునారచన చేసుకొని సజీవంగా నిలిచి ఉండటం అంత సులభం కాదు.

భారతీయ సంస్కారం ఇన్ని సంక్లిష్ట సన్నివేశాలను, ఘర్షణలను ఎదుర్కొని కూడా అవిచ్ఛిన్నంగా కొనసాగడానికి కారణం ఈ భావ ముఖం బలంగా ఉండటం, బాహిరమైన వ్యవస్థా ముఖము నిత్యపరివర్తన శీలము కావడమూ. అందువల్లనే సమాజాన్నంతా నిర్దిష్టంగా ఒక అంశానికి కట్టివేసే ఏ వ్యవస్థా మన చరిత్రలో ఇంతవరకు కొనసాగలేదు. స్మృతి రూపంగా జీవన క్రమాన్ని నిర్దేశించే వ్యవస్థ ఏర్పరుస్తూ వచ్చినా ఆ స్మృతి కాలానుగుణంగా మారుతూ వచ్చింది. దానిలో ఏర్పడ్డ వికృతులు తొలగింపబడుతూ వచ్చాయి. కాల చైతన్యం భారతీయ వ్యవస్థా నిర్మాణంలో ప్రధాన పాత్ర వహించిందని చెప్పాలి.

షోడశకర్మలు, గురుశిష్య పద్ధతి, కుటుంబవ్యవస్థ, అతిథిసత్కారము, ఈశ్వరోపాసనామార్గాలు ఇవన్నీ కాలక్రమాన పరిణమిస్తూ వస్తూ వున్నవి. ఆసేతుహిమాచలం చూస్తే వేషభాషలలో, ఆచారవ్యవహారాలలో కానవచ్చే వైవిధ్యాన్ని గమనిస్తే బలమైన ఈ భావముఖం లేకపోతే ఈ దేశం ఎన్ని జాతులుగా విడిపోయి ఉండేదో అనిపిస్తుంది.

భారతీయ సంస్కృతిలోని ఏ అంశమూ ఆధునిక విజ్ఞాన శాస్త్రంతో ఘర్షణ పడలేదు. ఈ సృష్టి వెనుక ఉన్న తత్వాన్ని అందుకునే లక్ష్యంతో ప్రాచీనులు దర్శించిన అంశాలను ఇంకా విజ్ఞాన శాస్త్రం అన్వేషిస్తూ వున్నది. అతిమనోవిజ్ఞాన శాస్త్రం ఆధునిక భావాలను సంపూర్ణంగా పరివర్తింప జేస్తూ వున్నది భౌతిక పరిధులను అతిక్రమించి విశ్వరహస్యాలను అందుకో యత్నిస్తున్నది.

గ్రహముల కదలిక వాటికి ఆయాస్థానాలలో ఉన్నప్పుడు పృథ్వీమీద ఉన్న జీవులపై తమ ప్రాబల్యాన్ని ప్రసరింపజేయడం - ఆయాక్షణాలలో చేసే పనుల యొక్క సాఫల్య వైఫల్యాలు నిరూపించే శాస్త్రం క్రమంగా అనుభవ ప్రయోగం మీద ఆమోదాన్ని పొందుతూ వున్నది. ప్రకృతిని భారతీయ వ్యవస్థ ఎప్పుడూ ఆరాధిస్తూ వున్నది. దాని అంతస్తత్వాన్ని సాక్షాత్కరించుకునే ప్రయత్నం చేస్తూ వున్నది. పర్వతాలు, నదులు, పంచభూతాలు, చెట్లు, జంతువులు అన్నీ దేవతామయంగా భావన చేయడంలోనే ఆతడు పొందిన దివ్యత్వ దర్శనం మనకు స్పష్టమవుతుంది.

భారతీయ వ్యవస్థలో అనంతకాలంనుంచీ ఈ మూల్యాలను పరిరక్షిస్తూ క్షతి కలుగకుండా కాపాడుతూ వచ్చిన ఒక ఆర్ష పరంపర ఉన్నది. ఈ పరంపరలోని వ్యక్తి తనను తన వ్యక్తిత్వాన్ని సమష్టికి సమర్పణ చేసినవాడు. తన ఐహిక జీవనాన్ని తృణ ప్రాయంగా వదలివేసి మానవ జీవన తత్త్వాన్ని అధ్యయనం చేస్తూ తాత్త్వికులుగా సృష్టి లయను సాక్షాత్కరింప జేసుకుని కవులుగా, శిల్పులుగా, గాయకులుగా ఏ హిమాలయాలలోనో ఏకాంతంగా సృష్టి రహస్యాన్ని అంతర్దృష్టితో దర్శించి మహర్షులుగా కానవచ్చే వారు. ఈ పరంపర సంస్కృతిలోని శాశ్వత మూల్యాలను పరిరక్షిస్తూ తాత్కాలిక వ్యవస్థను మార్పుచెందిస్తూ ఉంటుంది. ఈ ఋషి పరంపర ఒక్కోచోట, ఒక్కోకాలంలో, ఒక్కోవిధంగా సాక్షాత్కరించవచ్చును. ప్రాచీన వ్యవస్థ అపవ్యాఖ్యకు గురైనప్పుడు, ప్రాచీన విద్యలు లుప్తమైనప్పుడు, నూతన పరిస్థితులకు అనుగుణంగా వ్యవస్థ రూపొందించికోవలసి వచ్చినపుడు, కొత్త అన్వయం అవసరమైనపుడు ఈ ఋషి పరంపర దేశంలో ఉద్భవిస్తూ ఉంటుంది.

భారతీయ సంస్కారం నిర్మించుకున్న అమూల్య వ్యవస్థలలో యజ్ఞం ఒకటి. ఇది వ్యక్తి తన్నుతాను సమాజరూపమైన - సమష్టిరూపమైన చైతన్యానికి అర్పించుకోవడానికి ఏర్పడ్డ సాంకేతిక ప్రక్రియ. దీనికి కేంద్రం అగ్ని. పంచభూతాలలో నడిమిదైన అగ్ని, పంచకోశాలలో నడిమిదైన మనోమయకోశానికి ప్రతీక. అగ్నియందు స్వాహాకారం చేసే ప్రతీ అంశాన్నీ 'ఇది నాది కాదు' అని చెప్పుతూ అర్పించడం భౌతిక, ప్రాణిక శక్తులన్నింటినీ సమష్టి మనస్సుకు అర్పించడం. విజ్ఞానమయ ఆనందమయ లోకాలు దైవములు అన్నమయ,

ప్రాణమయ లోకాలు మర్త్యములు. ఈ రెంటికీ అనుసంధాన నిశ్రేణిక అగ్ని. అందుకే అగ్ని పురోహితుడుగా మర్త్య లోకం చేసే అర్పణలు దేవలోకానికి అందించేవాడుగా ఋగ్వేదం కీర్తిస్తూ వుంది.

ఈ యజ్ఞప్రక్రియ కూడా రూపంలో మార్పు పొందుతూ వున్నది. భావ రూపంలో అనేక రూపాల్లో కానవస్తున్నది.

భారతీయ సంస్కృతీ మూల్యాలు సంకుచితమైన ఏకాల పరిధికో, దేశ పరిధికో నియతమైనవికావు ఈ మూల్యాలన్నీ సృష్టిలోని వైవిధ్యంలో ఏక త్వాన్ని దర్శిస్తున్నవి. అన్నమయ కోశంనుంచి ఆనందమయ కోశందాకా అన్ని పరిధులలోనూ దివ్య చైతన్యాన్ని దర్శిస్తున్నవి.

మధ్య మధ్యలో ఏర్పడుతూవున్న వికారాలు పైపై పరివేషాలకు సంబం ధించినవి. భావమును రూపు కట్టించేసరికి దాని తత్త్వంలో కొంత మార్పు రావడం తప్పనిసరి. ఇంకా ఆ రూపము పరిణమిస్తూ పోతూ వున్నప్పుడు, విజాతీయ ఘర్షణలు పెరిగినపుడు ఈ రూపంలో ఎన్నో వికృతులు ప్రవే శించడం కద్దు. వర్ణ వ్యవస్థలోంచి వికృత రూపంలో వచ్చిన కుల వ్యవస్థ, అస్పృశ్యత మానవుల్లో ఉచ్చనీచ భేదాలు, వికృతమైన వివాహ వ్యవస్థ దైవ భావానికి కట్టుకొన్న రూపాలవల్ల ఏర్పడ్డ వికార ప్రవృత్తులు. ఇవన్నీ మన సమా జంలో వచ్చినఅంశాలే, అయితే అంతర్గతమైనభావ చైతన్యం వీటిని నియమిస్తూ వచ్చింది. గత శతాబ్దంలో వచ్చిన భారతీయ పునరుజ్జీవనోద్యమం సమాజం లోని ఈ వికారాలన్నింటినీ మూలమట్టంగా కుదిపివేసింది భారతీయ సంస్కృతి వివాహవ్యవస్థ అన్వయం చేయబడి పునః వ్యాఖ్యానించబడ్డవి. ఆధునిక కాల ఘర్షణకు అనుగుణంగా జాతి జీవన క్రమాన్ని పునా రచించే ప్రయత్నం ప్రారంభమయింది. ప్రాచీన వ్యవస్థలోని ఆశ్రమ పద్ధతినీ, పురుషార్థక్రమాన్నీ నిలబెట్టుకుంటూ ఈ నూతన నిర్మాణం జరుగుతున్నది.

(**20-6-1982** అధ్యయన వేదిక, జాతీయ సాహిత్యపరిషత్, వరంగల్.)

# భారత పునరుజ్జీవనోద్యమం

నా జాతి పూర్వ ప్రథా జీవరహితమై
　　శక్తినాడుల యందు చచ్చిపోయి
నా మాతృభూమి తేజో మహశ్ఛ్యుతిని
　　బ్రహ్మక్షత్ర తేజంబు మంటగలిపి
నా మాతృభాష నానా దుష్టభాషల
　　ఔద్ధత్యమును తల నవధరించి
నా తల్లి నేల నేనాటి వాచారముల్
　　పైమెఱుంగులు చూచి భ్రమసిపోయి

ఏమి మిగిలిన దీనాటి కిట్లు పొంగు
లొలయు పర్వానదీ గభీరోదకముల
దైన్యగర్భ చారిత్రముల్ దక్క భిన్న
గిరిశిఖరదుర్గ పరదీన గీతిదక్క.

పునరుజ్జీవనదశలోని భారతదేశ చైతన్యం పొందిన వేదన పై పద్యంలో వ్యక్తమౌతున్నది. నేల గరచేటట్లు అణచివేసే హేతురాహిత్యము, బానిసతనం వల్ల కలిగిన మన దేశం తన వ్యక్తిత్వంలోని అంతర్నిగూఢ సత్యం తోడి అనుబంధాన్ని కోల్పోయింది. సమాజ వ్యవహారంలో రాజకీయాలలో మత, కళారంగాలలో మనం అసృజనాత్మకమైన అభ్యాసస్థానంలోకి పతనోన్ముఖమైన పరంపరలోకి ప్రవేశించి మానవతా లక్షణాన ప్రవర్తించలేని స్థితికి వచ్చాము' అన్నాడు రవీంద్రులు. ఈ రెండు అభిప్రాయాలూ పునరుజ్జీవన ఉద్యమం వెనకఉన్న సామాజిక సాంస్కృతిక భావస్థితిని వ్యక్తం చేస్తూ ఉన్నవి. అయితే ఈ స్థితిలోనూ కుంచించుకుపోయిన ఈ దేశం తనలోని జీవశక్తిని లోలోతుల్లో పొదువుకొని అజ్ఞాతంగానైనా రక్షించుకొన్నది. పునరుజ్జీవన ఉద్యమక్రమాన్ని అధ్యయనం చేస్తే ఈ జీవజ్వాల ఎలా ఉజ్జ్వలంగా వెలిగిందీ జాతిని ఎలా మేల్కొలిపిందీ మనకు అవగాహన అవుతుంది. **Even Wentz 'through-**

out the orient is concerned the Premathean fire never allowed to die out.'

భారత పునరుజ్జీవన ఉద్యమం ప్రధానంగా మూడు దశల్లో సాగింది. ఒకటి—స్వన్యూనతా భావంతో పాశ్చాత్య సంస్కృతీ సభ్యతలను అనుసరించడం లేదా పాశ్చాత్య సభ్యతాంశాలన్నింటినీ అలాగే తిరస్కరించడం, రెండు—తన సంప్రదాయం వెలుగు కనిపెట్టి దానిని ఆధునిక చైతన్యంతో అన్వయించి వ్యాఖ్యానించడం, మూడు—దేశానికి అన్ని రంగాలతోనూ పారతంత్ర్యాన్ని తొలగించే స్వాతంత్ర్య ఉద్యమం కొనసాగించడం. ఈ మూడు దశలు విడి విడిగా కానవచ్చినా కాలాన్ని బట్టి సరిహద్దు రేఖలు గీసి ఇదమిత్థంగా నిర్ణయించే వీలులేదు. అయితే తొలిఊపులోనే మూడు దశల మూలరూపమూ కానవస్తుంది. అయితే క్రమక్రమంగా తర్వాతి దశలు వికసించడం తొలిదశ వెనుకడుగు వేయడం మనకు స్ఫుటంగా గోచరిస్తుంది.

పునరుజ్జీవనదశ మొత్తం ఒకసారి పరిశీలిస్తే తాత్త్విక ఉద్యమాలే ప్రధానంగా కానవస్తవి. ఈ తాత్త్విక ఉద్యమాలు ఒకదానికి ఒకటి పరిపూరకాలుగా పరంపరగా కొనసాగుతూ వస్తూ వున్నవి. ఈ ఉద్యమాలు భారతీయ జీవనంలోని అన్ని అంశాలను కాలానుగుణంగా పరివర్తితం చేయడానికి పూనుకున్నవి. మధ్య యుగాలలో దురాక్రమణలో కుంచించుకుపోయిన భారతీయ జీవనం పాశ్చాత్య సంస్కృతి తోడి సంపూర్ణ ఘర్షణతో కొత్త సంఘర్షణను ఎదుర్కొనవలసివచ్చింది. ఈ ఘర్షణ జీవన మూలాంశాలను ప్రశ్నించింది. పాత విలువలు అన్నీ పేకముక్కలలాగా పడిపోయి కొత్త విలువల విధానం (Value System) ఏర్పడ్డది. భారతీయ జీవనం ఈ విధానాన్ని ఏర్పరచుకొన్నప్పుడు సనాతనమైన జాతినిష్ఠమైన మూలాలను మళ్ళీ అనుసంధించుకొన్నది

ఈ స్థితికి కారణమైన ఉద్యమాలు ప్రధానంగా ఇవి. 1. బ్రహ్మ సమాజం, 2. ఆర్య సమాజం, 3. ప్రార్థనా సమాజం, 4. దివ్యజ్ఞాన సమాజం, 5. రామకృష్ణ వివేకానందుల ఉద్యమం, 6. తిలక్ కర్మయోగము, 7. శ్రీ అరవిందుల దివ్యజీవన పరిణామవాదం, 8. మహాత్ముని సత్యాగ్రహం, 9. మానవేంద్రనాథరాయ్ నవ్యమానవవాదం, 10. జిడ్డు కృష్ణమూర్తి సర్వతోముఖ

స్వేచ్ఛావాదం, 11. హెడ్గేవార్, సావర్కార్ మొదలైన వారి హిందూరాష్ట్ర వాదం. 12. దీనదయాళ్ ఉపాధ్యాయ ఏకాత్మ మానవతావాదం.

ఈ ఉద్యమాలన్నీ అత్యంతము విభిన్నములు కాకపోవచ్చును. అత్యంతము పారంపరికములో, సంఘటితములో కాకపోవచ్చును. అయితే ఈ పన్నెండు ఉద్యమాల ఆటు పోటులలో భారతీయ పునరుజ్జీవన ధార కొనసాగుతున్నది. ఈ ఉద్యమం ఎప్పుడూ సమాజం యొక్క ప్రధాన ప్రవాహం మీదనే ప్రభావం వేసింది. దాన్ని తీర్చిదిద్దటమే లక్ష్యంగా కొనసాగింది. ఈ ప్రవాహంలో భాగంగా భావించని వారెవరికీ దీని వెలుగులు సోకలేదు.

పై ఉద్యమాలలో తిలక్ గాంధీల ఉద్యమాలు తప్ప మిగిలినవన్నీ మధ్యతరగతి మానవుణ్ణి ఆశ్రయించినవే. సంస్కరణోద్యమం ప్రధానంగా హిందూ సంఘంలోని దురాచారాల్ని రూపుమాపడమే లక్ష్యంగా ప్రవర్తించింది. ఈ ఉద్యమాలన్నీ ఏదో మత సంప్రదాయాలకు పరిమితమైనవి కావు. సామాజిక ఆర్థిక రంగాలవే కాక మానవ జీవనంలో అన్ని పార్శ్వాలనూ స్పృశించి జీవన లక్ష్యాన్ని నిర్దేశించడానికి ఉద్దేశించినవే.

1928 లో బ్రహ్మసభ తరువాతి సమాజం స్థాపింపబడటానికి ముందే పునరుజ్జీవనోద్యమ బీజాలు కానవస్తున్నవి. హెన్రీ లూయిస్ వివియన్ డిరోజియో అనే యువకుడు (half portugese) కలకత్తా హిందూ కాలేజీలో 1926 లో ప్రవేశించి (18 సంవత్సరాలు నిండని వయస్సులో) మూడేళ్ళే పనిచేసినా విద్యార్థులలో దేశభక్తి బీజాలు నాటడం జరిగింది. అతని కవితల్లో ఒక కవిత ఇది:

My country, In rhe days of glory past
A beautous halo circled round thy brow

And worshipped as a diety thou was
Where is that glory, where that reverence now.

ఈ విధమైన దేశభక్తి భావం సనాతనమైంది. పృథ్వీసూక్తం దగ్గర నుంచీ పరంపరగా వస్తూ వున్నది. ఈ భావం ఆధారంగా చేసుకొని తరువాత వచ్చిన రచన వందేమాతరం. అయితే వందేమాతరం భారతదేశపు ఆధ్యాత్మిక, సాంస్కృతిక, భౌతిక రూపాలను ఒకేసారి సాక్షాత్కరింప జేసింది. భూత భవిష్యత్ కాలాలను, చరిత్రను, సంస్కృతిని, కళలను, వాస్తవస్వప్నాలను దేశమాతృరూపంలో సాక్షాత్కరింపజేసిన వందేమాతర గీతం (1907 లో తెలుగులో కృష్ణాపత్రికలో ప్రచురితమైన పద్యం) పునరుజ్జీవన ఉద్యమంలో మంత్ర మకుటంగా విరాజిల్లింది.

మన దేశంలో జాతీయదృష్టి అతిప్రాచీనమైంది. అధర్వవేదంలో -

'జనంబిభ్రతీ బహుధా వివాచసం,
నానాధర్మాణాం పృథివీ యథేకసమ్,
సహస్రం ధారా ద్రవిణస్య కురుహాం
ధృవేవ ధేను రనప స్ఫురన్తీ'

అని ఈ నా మాతృభూమి అనేక భాషలు నానా ఉపాసనా మార్గాలు కలిగిన 'ఈ జనులందరికీ సమానంగా నివాసం కల్పిస్తున్నది అని చెప్పింది. ప్రాచీన సాహిత్యమంతా ఆసేతు హిమాచలాన్ని ఒకటిగానే భావించింది. విష్ణు పురాణం' అత్రాపి భారతం శ్రేష్ఠం జంబూద్వీపే' అని పేర్కొంటున్నది. రామాయణంలో ఈ మాతృభూమి మీద ఉన్న మమకారం శ్రీరామచంద్రుని ముఖం నుండి వాల్మీకి 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అని పలికిస్తాడు. ఈ దేశ జనులను వేదాలు, రామాయణ మహాభారతాలూ, పురాణాలు, క్షేత్రాలు, నదులు పర్వతాలు ఏకం చేశాయి. రాజకీయంగా ఎన్ని రాజ్యాలు ఉన్నా సాంస్కృతికంగా ఉన్న ఐక్యత ఈ జాతి జాతీయతకు పునాది.

ఈ పునాది మీదనే ఆధునిక కాలంలోని తాత్త్విక ఉద్యమాలన్నీ ప్రవర్తించాయి. రామ్‌మోహన్‌రాయ్ ప్రారంభించిన ఆధునిక భావోద్యమం నేల నాల్గంచులా ప్రవహించింది. ఆయన ఆధారంగా స్వీకరించిన వేదోపనిషత్తులు అందరికీ ప్రాణస్థానీయాలు. ఈ పునాది మీద నిర్మించడం వల్లనే రామమోహనుని ఉద్యమం శాఖోపశాఖలుగ విస్తరిల్లింది. కేశవచంద్రుని నాటికి

ఈ ఉద్యమం తాను తెచ్చిన పరిణామాలతో సహా ప్రధాన హిందూ ధార్మిక వాహినిలో సంలీనమవుతూ వచ్చింది.

బ్రహ్మ సమాజం తెచ్చిన మార్పులు ప్రధానంగా విగ్రహోపాసన విషయంలో తాత్త్వికంగా దాని వెనుకనున్న ఈశ్వర చైతన్యానికి ప్రాధాన్యత కల్పించడం, స్త్రీ జనానికి సమాజంలో ఉన్నతమైన స్థానం - ఉచితమైనది కల్పించడం. అప్పుడు కదలిన ఈ రథం హిందూ సమాజంలోని అన్ని అంశాలను పునఃపరిశీలించి పునరున్మీలితం చేసి నిలువ బెట్టింది. నిర్జీవమైన అంశాలను ఏరిపారవేసింది.

బ్రహ్మ సమాజం వెనువెంటనే వచ్చిన ఉద్యమం ఆర్య సమాజం. ఆర్య సమాజం వేదప్రామాణ్యాన్ని గ్రహిస్తూనే ఆధునికాంశాలన్నింటికీ ప్రాధాన్యం యిచ్చింది. దురాచారాలను అంత తీవ్రంగానూ ఎదిరించింది. కులభేద నిరాసం, అస్పృశ్యతా నివారణ, విగ్రహారాధనకు వ్యతిరేకత, పౌరాణికాచారాల తిరస్కారం, స్త్రీవిద్య ఇత్యాదులను బ్రహ్మసమాజం కంటె తీవ్రంగా ప్రచారం చేసి, ఈ భావోద్యమాన్ని అతివేగంగా ముందుకు నడిపించింది. అయితే పాశ్చాత్య విద్యావ్యామోహాన్ని సంస్కృతి పారతంత్ర్యాన్ని నొక్కి చెప్పడం ఆర్య సమాజం తెచ్చిన కొత్త పార్శ్వం. ఆర్యసమాజ ఉద్యమంలో పునరాన యనం (Revival) ఎప్పుడూ లేదు. **Back to vedas** అన్నా ఆ వేదం దయానందుని భాష్యాన్ని అనుసరించిన ఈనాటి అర్థాన్ని చెప్పే వేదం. అందు చేత ఆర్య సమాజం భారతీయులలో ఆత్మ నూన్యతా భావాన్ని తొలగించి ఆత్మ విశ్వాసాన్ని కలిగించిన ఘట్టం.

ఈ ఘట్టంలోనే శ్రీరామకృష్ణ వివేకానందుల ఉద్యమాలు ఒకవైపు, దివ్యజ్ఞాన సమాజ ఉద్యమం రెండోవైపూ వచ్చాయి. శ్రీరామకృష్ణులలో భారతీయ పునరుజ్జీవనం సంపూర్ణ ఆవిష్కారాన్ని పొందింది. సనాతన భారతీయ మూల్యాలన్నీ ఆయనలో రూపుకట్టాయి. ఆర్యసమాజ బ్రహ్మసమాజాలు తాత్కాలిక తరణోద్యమాలైతే శ్రీరామకృష్ణుల నిశ్శబ్ద ఉద్యమం సనాతనమూ, అనంతకాలికమూ అయింది. భారతీయ జీవనంలోని **eternal values** ని ఆయన పునరుజ్జీవింపజేసినారు. వేదం దగ్గర నుంచి తనదాకా వచ్చిన సర్వ

మైన వారసత్వమూ ఆయన వ్యాఖ్యానంతో వసం - ఋతు శోభను పొందింది. ఆయన దర్శనంలో భారతీయ జీవన మూల్యాలు విశ్వమానవ ఐక్యతా దర్శనాన్ని వెల్లడించాయి. ఈ చైతన్యం వివేకానందుని వల్ల విశ్వమత సభలో భారతదేశాత్మను ప్రత్యక్షీకరించింది. వివేకానందుని బోధలు ప్రాక్ పశ్చిమాలకూ, భౌతికాధ్యాత్మికాలకూ, వాస్తవ స్వప్నాలకూ, కర్మ జ్ఞానాలకూ నడుమ ఉన్న అగాధాన్ని తొలగించి ఒక సేతువు నిర్మించాయి.

జగదనిత్య భావనా నైరంతర్యంలో అవిద్యలో పడిన జాతికి ఈ జగత్తూ ఈశ్వర విభూతియే అన్న అంశం సాక్షాత్కరించింది. ఆధునిక భారతీయ తాత్త్వికోద్యమాలతో ప్రారంభమైన అంశం ఇది. బ్రహ్మ సత్యం జగన్మిథ్యా అనికాదు. 'సర్వంఖల్విదం బ్రహ్మ'. ఈ భావం మతం అంటే ఒక నిరర్థకమైన కర్మకలాపంగా కాక ఈశ్వర రూపమైన జగదర్చనా భావంగా వ్యాఖ్యాతమైంది వివేకానందుని రాకతో సన్యాసం సేవాభూమిక అయించె. పూర్వోత్తర మీమాంసలకూ, శ్రుతీతిహాస పురాణాలకూ, నానా స్మృతులకూ నడుమ తానవచ్చే వైరుధ్యం అన్వితమైంది. నిర్జీవమైన గతాన్ని విడిచిన విలువైన పారంపర్య సంస్కారం సంప్రదాయమైంది. హిందూధర్మం విశ్వజనీనతను సంతరించుకొన్నది.

సరిగ్గా ఈ కాలంలోనే దివ్యజ్ఞాన సమాజం ఆవిర్భవించింది. సనాతన ధర్మంలోని అనేకాంశాలను చర్చించి ప్రపంచ ధర్మాలతో తులదూచి ఉత్తమమైనవిగా, అనవద్యములుగా నిరూపించడం జరిగింది. ఈ సమాజ స్థాపకులైన మేడమ్ ఆల్కాట్, అనీబిసెంట్‌లు పాశ్చాత్యులు కావడం, వారి నుండి మనకు ఈ ప్రశంస లభించడం భారతీయుల ఆత్మ విశ్వాసానికి కారణమైంది. పూర్వోద్యమాలు స్పృశించని యోగతంత్ర సాధనలు, వాటి యదార్థ లక్షణాన్ని అనుభవపూర్వకంగా నిరూపించే వీరి ప్రయత్నం పునరుత్థానంలో మరొక పార్శ్వం చేర్చింది. ఈ దిశలోనే జాన్‌వుడ్రాఫ్ మొదలైన పాశ్చాత్యులు తంత్ర శాస్త్రాన్ని అధ్యయనం చేయడం, దూష్యములుగా భావింపబడే ప్రతీకల యంత్రముల ముద్రల రహస్యార్థాలను వ్యాఖ్యానించడం కూడా వెనువెంటనే జరిగింది.

వివేకానందుల విస్తృతమైన ప్రభావం దేశాన్ని ఆవరించిన దశలో కలిగిన పరిణామంలో దేశం స్వతంత్రాన్ని కోరింది. ఈ స్వాతంత్ర్యం సాంస్కృతికమైంది. రాజకీయమైంది, ఆర్థికమైంది, ఆధ్యాత్మికమైంది. ఈ సంపూర్ణ స్వరాజ్య ప్రకటన తిలక్ ముఖంలో అభివ్యక్తమైంది. తిలక్ ప్రజల నాడిని తెలుసుకొన్న నాయకుడు. నిర్జీవమైన రూపాలలో ప్రాచీనమైన తత్వాన్ని పునః ప్రతిష్ఠించడం ఎరిగినవాడు. ధైర్యమూ ఆత్మత్యాగమూ తన దేశానికి నూతన చైతన్యం కలిగించే నూతనాంశాలుగా స్వీకరించాడు. మన జీవితమూ మన ధర్మమూ స్వరాజ్యం లేకపోతే వ్యర్థములే అని ఆయన భావించాడు. స్వరాజ్యం మనం కోరడం అది మన భవిష్యత్తుకు పునాది కావడం వల్ల మాత్రమేకాని అది శిఖరం మాత్రం కాదు. స్వరాజ్యం మనకు ధర్మం కూడా. అది భారతదేశానికి జన్మహక్కు అని ఆయన ప్రవచించాడు.

తిలక్ ప్రవచనంతో పునరుజ్జీవనోద్యమం స్వాతంత్ర్య సమరరూపం పొందింది. తిలక్ భావించిన ఆధునిక స్వరాజ్య భావన జాతి ఆదర్శరాజ్య వ్యవస్థయైన ధర్మరాజ్యంగా రూపు కట్టింది. అందుకే ఆయనకు గణపతి ఉత్సవాలు ప్రజల సమీకరణకు దోహదమయ్యాయి. ఆంగ్లవిద్యావాసితులై సామాన్య ప్రజలకు దూరంగా ఉంటూ సంస్కారాలను ప్రబోధించడం ఆయనకు నచ్చలేదు. స్వదేశీ ఉద్యమం, జాతీయవిద్య, రాజకీయ సమరం మూడూ ఒకటిగా సాగించే ప్రణాళిక అప్పుడు రూపొందింది.

ఈ దశలో తిలక్‌తోబాటు ఈ పరిణామ వేగాన్ని అందుకోలేనివారంతా మితవాదులూ, తిరోగమనవాదులూ అయ్యారు. ఆంగ్లేయ రాజ్యం ఈ దేశానికి విచిత్రమైన దోపిడీ వ్యవస్థను తెచ్చిపెట్టిందనీ, మౌలికంగా ఉన్న గ్రామీణ వ్యవస్థ నాశనం అయిందనీ, వృత్తులు నశించి దారిద్ర్యం పెరిగి పట్టణీకరణ అపూర్వమైన దారిద్ర్యాన్ని సమకూర్చిందనీ వాళ్ళు గ్రహించలేదు. ఆధునిక విజ్ఞాన సాధనాలు ఆంగ్లేయ విద్య మొదలైనవి వ్యతిరేక ముఖంగా చేసిన మేలును వాళ్ళు వరప్రసాదంగా భావించారు. మనం మన దేశాన్ని పరిపాలించలేమని, ఆ స్థితి వచ్చేదాకా స్వరాజ్యోద్యమం తగదనీ భావించారు. వీరేశలింగం

నుంచి గురజాడదాకా అందరూ తెలుగుదేశంలోనూ ఈ భావధోరణిలో పెరిగినవారే. అందుకే గురజాడ గానీ వీరేశలింగం గానీ స్వాతంత్ర్య ఉద్యమానికి అనుగుణంగా ఎవుడూ గొంతెత్తిన దాఖలాలు కానరావు. 'అంగిలేయుల ధర్మరాజ్యం వర్ధిల్లుగాత' అని భావించినవారే. ఈ ఘట్టంలోనే అనుకోకుండా తెలుగులో ప్రతాపరుద్రీయం అనే నాటకం వచ్చింది. దీనిలో ప్రతీకాత్మకంగా స్వాతంత్ర్యోద్యమం ప్రతిఫలించింది.

తిలక్ ఈ దశలో దేశాన్ని నడిపించేందుకు రచించినదే కర్మయోగము. భగవద్గీతపై ఆయన చేసిన వ్యాఖ్యానం అత్యంతమూ ఆధునికం. వేదాంతము పేర కర్మవిదూరమైన లక్షణాన్ని ఆయన తిరస్కరించి, వేదాంత లక్ష్యం నిత్య కర్మశీలంగా ప్రవపంచించాడు.

బ్రహ్మ సమాజ సంప్రదాయంలో నుంచి వచ్చిన రవీంద్రుడు భారతీయ భావాకాశంలో ఈ దశలోనే ప్రవేశించాడు. రవీంద్రుడు 'మానవాత్మ న్యాయం నుంచి ప్రేమవైపు, క్రమశిక్షణ నుంచి విముక్తివైపు, నైతిక భూమిక నుండి ఆధ్యాత్మికతవైపు ప్రయాణిస్తున్న'దని పేర్కొన్నాడు. రవీంద్రుడు జగత్తును సౌందర్యమయంగా భావించాడు. ఆయన భావించిన స్వరాజ్యంలో మనస్సు భయరహితమైంది. సంకుచిత కార్యాలతో విభక్తం కానిది. సత్యం లోలోతుల లోంచి వచ్చే భాష కలది, పరిపూర్ణతకోసం నిరంతరం శ్రమించేదీ, మౌఢ్యంలో ఇంకిపోని ప్రేమ ప్రవాహం కలది, భావం కర్మగా పరిణమింప జేసేది. అలాంటి స్వేచ్ఛాయుతమైన స్వర్గ రాజ్యాన్ని ఆయన అభిలషించడం జరిగింది. ఈశ్వరుణ్ణి రాళ్ళు కొట్టే వాళ్ళలో నాగలి పట్టే వాళ్ళలో ఆయన దర్శించాడు. 'సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని దృశ్యతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః'అన్న గీతావాక్యం ఇక్కడ అనుసంధింపబడుతూ వున్నది. రామమోహనుని దగ్గర నుండి రవీంద్రుని వరకు గమనించినా మన పునరుజ్జీవనంలోని ఏ దశలోనూ సంకుచితంగా దేశాభిమానం పేర పర దేశాలను ద్వేషించే, తిరస్కరించే దశకు మనం చేరలేదని మనం గ్రహించవలసి ఉంది.

బి. సి. పాల్, తిలక్‌లతో స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నవాడు అరవింద ఘోష్. అతడు స్వాతంత్ర్య సమరంలో చేరినప్పటినుంచి దానికి ఒక

ఆధ్యాత్మికాంశం జోడింపబడ్డది. దేశం ఉపాస్యదైవంగా ప్రకటించడం జరిగింది. బంకించంద్రుని వందేమాతరం దేశీయులకు ఒక మహా మంత్రం అయింది. విముక్తి పోరాటంలో అది ఉద్యమ చైతన్యాన్ని నిలబెట్టింది.

1905 లో ఆయన తన భార్య మృణాళినీదేవికి వ్రాసిన ఉత్తరంలో ఇలా అన్నాడు: 'ఇతరులు దేశాన్ని నిర్జీవ పదార్థంగా తలపోసి మైదానాలు, పొలాలు, అడవులు కొండలు నదులూ ఇదే దేశమనుకుంటారు. నేను దేశాన్ని మాతృమూర్తిగా ఆరాధించి పూజిస్తాను.' ఈ పతిత జాతిని జ్ఞాన శక్తితో ఉద్ధరించగలనని ఆయన అక్కడ పేర్కొన్నాడు. ఇదే కాలంలో భవానీ మందిర మనే రహస్య పత్రం ఆయన రచించాడు. ఈ పత్రం మరొక వందేమాతర గీతం. దీనిలో ఇలా అంటాడు: 'జాతి అంటే ఏమిటి? కోట్ల ప్రజల సమష్టి శక్తియే జాతి. మాతృభూమి అంటే ఒక భూఖండం కాదు. ఒక రూపకాలంకారం కాదు. అది ఒక మహత్తర శక్తి.' వందేమాతరం పత్రికలో మరొక చోట 'ప్రాచీనమైన శాశ్వతమైన భారతీయ స్వభావమును ఈనాటి సాంఘిక వ్యవస్థలు ప్రకటితం చేయలేకపోతున్నవి. వాటి బంధాలలో చిక్కిన జాతి స్వరాజ్యం సంపాదించుకోలేదు. కాబట్టి ఒక మహత్తర సామాజిక విప్లవం తప్పనిసరిగా రావాలి. పాతవై పోయిన జీర్ణ వస్త్రములు వదలివేసి భరతమాత నూతన వస్త్రములతో శోభలు వెదజల్లాలి. తన ఆత్మశక్తిని ఆవిష్కరించ డానికి అనుగుణంగా స్వరూపమును దిద్దుకోవాలి.' ఈ లక్ష్యంతో అరవిందుడు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నాడు. ఆనాటి యువకులకు సుభాష్‌చంద్ర బోస్ చెప్పినట్లు ఆయన ఆరాధ్య పురుషుడుగా పరిగణన పొందాడు. అయితే అలీపూర్ బాంబ్ కేసు తర్వాత విడుదలైన అరవిందుడు అంతరాత్మ ప్రబోధంతో రాజకీయరంగం నుంచి నిష్క్రమించి, ఇంతకన్నా ఉన్నతమైన సాధన ద్వారా విశ్వమానవాళికి నూతన దివ్య లోకాన్ని ఆవిష్కరించే తపస్సు కోసం పాండిచ్చేరి చేరాడు. దాంతో శ్రీ అరవిందుల సాధనా మార్గంలో దివ్యజీవన పరిణామతత్త్వం ఆవిష్కృతమైంది. ఋగ్వేదంలో సుసూక్ష్మంగా నిగూఢంగా ఉన్న ఈ తత్త్వం మళ్ళీ శ్రీ అరవిందుల దర్శనంతో సంపూర్ణ ప్రకాశం పొందింది.

శ్రీ అరవిందుల తత్త్వం దివ్యజీవన పరిణామ సిద్ధాంతంలో నూతనంగా విశ్వదర్శనం ఆవిర్భవించింది. భౌతిక, ప్రాణ, మనోమయ భూమికల నతిక్రమించి విజ్ఞానమయచేతన ఆవిష్కరింపబడి, పృథ్వి దుఃఖరహితమూ ఆనందమయము అయిన దశకు చేరుకోవడానికి ఆయన సాధనామార్గం ద్వారా నిరూపించారు. శ్రీ అరవిందుల దర్శనంలో జాతీయ అంతర్జాతీయ దృక్పథాలు సంగమించాయి. శాంకరాద్వైతం నూతన అన్వయంతో ఆధునిక రూపాన్ని సంతరించుకొన్నది. ఆశ్రమంలో ఉన్నా శ్రీ అరవిందులు చివరవరకూ భారత జాతికి పురోగమన మార్గాన్ని నిర్దేశిస్తూ వచ్చారు.

తిలక్ రంగంమీద నుంచి నిష్క్రమించే వేళకు గాంధీజీ ప్రవేశించాడు. అయితే, గాంధీజీ పోరాటాన్ని ప్రధానంగా మూడు రంగాలలో సాగించాడు. అవి రాజకీయ, సామాజిక, ఆర్థిక రంగాలు. స్వాతంత్ర్యం కోసం సత్యాగ్రహ ఉద్యమాదులు, సామాజిక రంగంలో కులభేద నిరాసము, అస్పృశ్యతానివారణ, ప్రాథమిక విద్య, మద్యపాన నిషేధము మొదలైనవి. ఆర్థిక రంగంలో దేశీ పరిశ్రమలు, గ్రామ స్వరాజ్యము, ఖాదీ మొదలైనవి. అయితే ఈ కార్యక్రమానికి ఆయన ఆధారంగా స్వీకరించిన అంశాలు సత్యము అహింస అభయము ప్రేమ క్షమ మొదలైన సనాతన మూల్యాలు. ఆయన జీవన సరళి రాజకీయ రంగంలో ఒక నూతన ఋషిని సాక్షాత్కరింపజేసింది.

సత్యాగ్రహోద్యమము ప్రపంచ విముక్తి ఉద్యమాలలో నూతన సమర సాధనంగా రూపొందింది. అంతకు పూర్వం దేశ జీవనంలో పునరుజ్జీవనధారలో ఇంతగా సామాన్య ప్రజల సంప్రవృత్తి కలుగలేదు. గాంధీజీ అవలంబించిన అతి సామాన్య విధానాలు భావనకూ ఆచరణకూ మధ్య ఉన్న అంతరాన్ని చెరిపివేశాయి.

గాంధీజీ ఆర్థిక రంగంలో సంస్కరణలు కూడా తన రాజకీయ కార్యక్రమంలో భాగంగా చేసి దాన్నొక సమన్వితమైన అంశంగా రూపొందించాడు. అందువల్ల దేనికదిగా సాగుతూ వస్తున్న ఆలోచనలు ఆయన రాకతో ఒక త్రాటికి వచ్చాయి.

గాంధీజీ ఉద్యమంలో దైవభావం కూడా ఒక భాగమే అయింది. ఈ దైవం సత్యస్వరూపమైంది. భారతీయ జీవనం ఎట్లా దేనికదిగా విడదీయరాని అంశంగా ఉంటుందో ఆయన కార్యరంగంలో గ్రహించి రూపొందించడం జరిగింది. గాంధీజీ ప్రతిపాదించిన సత్యాగ్రహ సిద్ధాంతం సర్వమానవులలో ఉన్న దైవత్వం ఆధారంగా గ్రహించినది. ఎదుటి వ్యక్తిలోని దైవాన్ని మేల్కొల్పి తాను సాగించే సత్య- ధర్మ-ఉద్యమాన్ని ముందుకు తీసుకొని పోవడం ఈ ఉద్యమ లక్ష్యం అయింది. ఈ భూమిక మీదనే ఆయన హింసా రాహిత్యాన్ని కూడా తన ఉద్యమంలో భాగంగా చేయడం జరిగింది. అహింస-నిర్వైర భావం నుంచీ, ఆత్మీయతా భావంనుంచీ, క్షమాగుణం నుంచీ పుడుతున్నది. ఇది అసమర్థుడి చేతకానితనం కాదు.

గాంధీజీ ఉద్యమం సాగుతూ ఉన్న దశలోనే విముక్తి ఉద్యమాలు ప్రపంచంలో ప్రధానంగా కొనసాగుతూ వచ్చాయి. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించి తరువాత దానితో విభేదించి, తనకు తానుగా నవ్యమానవవాద సిద్ధాంత ప్రవర్తకుడుగా రూపొందినవాడు మానవేంద్రనాథ రాయ్. అతడు మార్క్సియ తత్త్వంలోని అంతర్గత లోపాలను తొలి రోజుల్లోనే గుర్తించిన తాత్త్వికుడు. విప్లవ దశలో రాజ్యాధికారాన్ని సంపాదించటం దాన్ని బలపరచుకోవడం విషయంలో రష్యన్ రాజ్యవ్యవస్థను M N. రాయ్ విమర్శించాడు. ఒకచోట మార్క్సిజాన్ని మానవ జాతి జాతక చక్రంలాగా భావించగూడదని స్పష్టంగా పేర్కొన్నాడు. మార్క్సిజం యూరపును విప్లవీకరించలేకపోవడాన్ని కూడా ఆయన విమర్శించాడు. ప్రజాస్వామిక విలువలకు వ్యక్తి స్వేచ్ఛా వికాసానికి రాయ్ అత్యంత ప్రాధాన్యతనిచ్చాడు. మార్క్సిస్టు తత్త్వాన్ని తననాటి కనుగుణంగా పునర్నిర్మించవలసిన అవసరాన్ని గుర్తించాడు.

మానవ జీవన వికాసంలో కేవల భౌతికవాదం పరిపూర్ణతను తేలేదనినైతిక మూల్యాల ప్రాధాన్యం గుర్తించవలసిన అవసరాన్ని ఆయన నొక్కి చెప్పాడు. క్రమంగా రాయ్ జాతీయ ఉద్యమాల ప్రాధాన్యాన్ని గుర్తించడమే కాకుండా జాతీయ కాంగ్రెస్ పార్టీలో కూడా కొంతకాలం చేరాడు. 1946 లో జాతీయ పునరుజ్జీవ సంస్థ నొకదానిని ఆయన నెలకొల్పాడు. ఈ సంస్థ ప్రధానంగా ప్రాచీన భారతీయ ఆలోచనలోని అనుకూల పార్శ్వాన్ని రక్షించడం, దాని

ద్వారా సాంస్కృతిక బౌద్ధిక విస్ఫోటము కలిగించడం, భారతీయ సంప్రదాయం లోని శాశ్వతాంశాలను కనుగొనడం, భవిష్యత్తుకు అవసరమైన ప్రేరణాంశాలను గ్రహించడం, ఆధునిక విజ్ఞానం వెలుగులో ప్రాచీన మూల్యాలను మళ్ళీ అంచనా వేయడం మొ॥ అంశాలు ప్రధానంగా ఉన్నై. చివరి రోజుల్లో ఆయన ఇద్దరు వైష్ణవ స్వాములతో సంభాషించినట్లు, హిందూ సంప్రదాయ ఆచారాలను గూర్చి అభిమాన పురస్సరంగా మాట్లాడినట్లు, అనేక శతాబ్దాలుగా వ్యక్తంకాని చైతన్యాంశం ఒక వ్యక్తిలోనో, సమాజంలోనో అవిష్కారం పొందడాన్ని గూర్చి ఆయన ఆలోచించినట్లుగా (Atavistic Soul) తెలుస్తున్నది.

కమ్యూనిస్టు ప్రవాహం నుండి బయటపడిన రాయ్ ఔపనిషదికమైన ఆలోచనలకు చాలావరకు సన్నిహితంగా రాగా, రెండో వైపు దివ్యజ్ఞాన సమాజం నుండి విడివడి స్వతంత్రాలోచనతో సంస్థలనూ, సంప్రదాయాలనూ నిర్దిష్టమైన ఆలోచనా ధోరణులనూ, కట్టుబడులను (Commitments) కాదనీ వ్యక్తి స్వేచ్ఛను స్వతంత్రంగా ఎదగవలసిన అవసరాన్ని తన లక్ష్యానికి తానే దారి వేసుకోవలసిన అవసరాన్ని ప్రకటించిన ఆధునిక భారతీయ తత్త్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి. జీవితంలోని అనేక పార్శ్వాల మధ్య వైరుధ్యాన్ని పరిహరించవలసిన అవసరాన్ని ఆయన నొక్కి చెప్పారు. ప్రేమ రాహిత్యము, స్వేచ్ఛారాహిత్యము బంధీకృతమైన మనఃస్థితి క్రౌర్యానికి, అసూయకు, ద్వేషానికి, ఇతరములైన కళ్యాణేతర గుణాలకు కారణమనీ ఆయన పేర్కొన్నాడు. తన మనస్సులో గిరిగీసుకున్న చిన్నకోణం (Little corner of the mind) నుండి బయట పడవలసిన అవసరాన్ని ఆయన సూచించాడు.

అన్ని మూఢ విశ్వాసాలకు వ్యతిరేకంగా ఆయన జీవితమంతా పోరాడాడు. మనిషి ప్రజ్ఞ (awareness) ద్వారా వికసించవలసిన అవసరం చెప్పి వ్యక్తికి అన్ని రకాల పరిమితులనుండి అతని విముక్తికి ప్రాధాన్యం ఇచ్చాడు. మతస్పర్శలేని ఔపనిషదమైన చింతనకు ఆయన అత్యంత సన్నిహితంగా వచ్చాడు. 'ఈశావాస్య మిదగ్ం సర్వమ్' అన్న దానికి ఆయన ప్రబోధం ఆధునిక భాష్య వ్యాఖ్యానం.

భారతదేశంలో గాంధీజీ ప్రారంభించిన ఉద్యమంలో హిందూ ముస్లిం సమైక్యతవంటి అంశాలు సమగ్రజాతి నిర్మాణానికి ప్రాతిపదికను వేసినా తత్కాలీయములైన రాజకీయాచరణలోని తప్పుడు నిర్ణయాలు సంతృప్తికరణ వంటి అంశాలు ద్విజాతి సిద్ధాంతాన్ని బలంగా ముందుకు తోసుకువచ్చాయి. దీని ఫలితంగా దేశం స్వాతంత్ర్యప్రాప్తితోబాటు ఛిన్నాభిన్నమైంది. జాతి అంతా పరాజయభావంతో కుంచించుకుపోయింది. అంతవరకు మార్గదర్శకుడుగా ఉన్న జాతిపిత రంగంనుంచి తొలగించబడ్డాడు.

స్వాతంత్ర్యం తరువాత దేశంలో పునాదులులేని దేశీయ చింతనలో పునాదులులేని కమ్యూనిస్టు ఉద్యమం అంతకు పూర్వంలాగానే వాస్తవ పరిస్థితులను అర్థం చేసుకోకుండా తప్పుడు అంచనాలను వేసుకోవడం, తప్పులు చేయడం చేస్తూ వచ్చింది. బయటి దేశాల నుండి నోట్లో కరచుకున్న పగ్గాలను విడిపించుకోలేక మూర్ఖంగా ఎన్నో ముక్కలు చెక్కలై దేశంలోని బలహీనతలను తన కనుకూలంగా మలచుకునే ప్రయత్నం చేసింది.

అనుకోకుండా దేశం బాధ్యత మీదపడ్డ అధిక సంఖ్యాకవర్గం ఒకసారి తేరుకొని ఆకాలపు ఒత్తిడులకు పరిమితులకు తట్టుకొని మత సంబంధం లేని ప్రజాస్వామ్య రాజకీయ వ్యవస్థను తన జాతీయ చైతన్య పరంపర కనుగుణంగా నిలబెట్టింది. ఈ సందర్భంలో వివేకానందుని తాత్త్విక చింతనను వర్తమాన పరిస్థితులకాధారంగా డా॥ హెడ్గేవార్, సావర్కార్, గోళ్వాల్కర్ ప్రభృతులు వ్యాఖ్యానించారు.

భారతీయ చింతనకు ఆదునిక పరిస్థితులలో స్పష్టమైన దర్శనాన్ని అందించిన మహాపురుషుడు దీనదయాళ్ ఉపాధ్యాయ. దీనదయాళ్ ప్రతిపాదించిన సిద్ధాంతము ఏకాత్మ మానవతావాదం. శ్రీ అరవిందుల సమన్వితదృక్పథం (Integral Approach) ఈయన అన్వేషణకు మూలస్థానం. దీనదయాళ్ దృష్టితో జీవితం ఏకాకారమైంది. జీవితంలోని అన్ని అంశాలకూ ఒక అవినాభావ సంబంధం ఉంది. ఈ అంశాల్లో వైరుధ్యాలను తొలగించి సమన్విత దృష్టిలో చూచినపుడే జీవనలక్ష్యం సిద్ధిస్తుంది. శరీరం మనస్సు బుద్ధి ఆత్మ వీటికి సమన్వయం అవసరం. అట్లాగే పరస్పర విరుద్ధంగా కనిపించే

ద్వంద్వాలు సమన్వయించినపుడే పూర్ణదృష్టి ఏర్పడుతుంది. వ్యక్తి శ్రేయస్సు ప్రేయస్సు రెండూ లభిస్తవి. ఈ రెంటిని స్వీకరించేటపుడు ధర్మం ఆధార మవుతుంది. పరిత్యజించేటపుడు మోక్షం లక్ష్యమవుతుంది. ధర్మం నుండి మోక్షందాకా ఉన్న నాలుగు పురుషార్థాలూ ఏకాత్మకాలే, అనుస్యూతి కలిగినవే. ప్రతి విలువ ప్రతి సూత్రం ధర్మానికి లోబడి ఉండాలని ఆయన అభిప్రాయం.

దీనదయాళ్ దృష్టిలో ధర్మం జాతి ఆత్మకు కేంద్ర స్థానం. ధర్మం లేకపోతే జాతి లేదు. ఆయన జాతి చైతన్యానికి చితి అని పేరు పెట్టారు. ఇది జాతి ప్రేరణ జీవశక్తి. జాతిలోని ఈ చితిని మేల్కొల్పితే అది విరాడ్రూ పంగా ఆవిష్కారం పొందుతుంది. ఆయన జాతీయవాద దృష్టి అంతర్జాతీయ దృష్టికి విశ్వ చైతన్యంలోని ఏకాత్మ భావాన్ని పొందే దృష్టికి ప్రాథమికమైన సోపానం. దీన్ దయాళ్ ప్రతిపాదించిన ధర్మం మత పరిమితులకు అతీత మైంది. శ్రేయస్సు ప్రధానంగా ప్రేయస్సును నిర్ణయించేది.

ఈ విధంగా ఈ శతాబ్దంలోని భారతీయ పునరుజ్జీవన ఉద్యమంలోని మత తాత్త్వికోద్యమాలు నిరంతర అన్వేషణలో ఆదిమకాల జ్యోతిస్సునుండి ప్రేరణ పొందిన దీపమాలలాగా ఒక ప్రవక్తనుండి వేరొక ప్రవక్తవరకు పరి పూరకమైన అన్వేషణతో కొనసాగుతూ వచ్చినవి. ఈ చైతన్య ప్రవాహం పరి పూర్ణ లక్ష్యం చేరేదాకా సాగిపోతుందని తెలియవస్తున్నది.

# కవిత్వము : సృజనమూలాలు

సాహిత్యం మానవుని అనుభవాల సమగ్రక్షేత్రాన్ని ఆవరించి ఉంటుంది. అందువల్ల మానవుని అనుభవంలోకి అందే ఏ అంశమూ సాహిత్య రంగ ప్రవేశానికి నిషిద్ధం కాదు. భావనాలోకం, వాస్తవలోకం ఈ రెండూ మానవుని వ్యవహారానికి ఉద్దిష్టమైన రెండు పార్శ్వాలు. వాస్తవలోకంలో బుద్ధివిశ్లేషణవల్ల పుట్టే శాస్త్రాలు - సామాజిక పదార్థ విజ్ఞాన సంబంధాలు కాగా, సృజనాత్మక భావనాలోకం నుంచి ఉత్పన్నమవుతున్నవి. జీవనంలోని ఈ రెండు పార్శ్వాలు ఎంత బలమైనవీ అంటే - అవి పరస్పర సంబద్ధాలు మాత్రమేగాక ఘర్షణకు లోనయ్యేవి కూడా. అయితే మానవుడి జీవితం రెంటి కలయిక సమష్టిలోనుంచే నిర్దిష్టం అవుతున్నది. మానవుడి సృజనాత్మక శక్తులన్నీ ఈ మనోమయ భూమిక నుంచే నిష్పన్నం అవుతున్నవి.

పాట పాడినా, పద్యం కట్టినా, బొమ్మ గీచినా, విగ్రహం చెక్కినా ఒక పరవశమైన వేళలో దాని మూలం ఉంటున్నది. ఆ పారవశ్య క్షేత్రం నుంచి అంకురించి ఈ సృజనశక్తి వ్యక్త జగత్తులో రూపుదిద్దుకొంటున్నది. అవ్యక్తమూ వ్యక్తమూ - జ్ఞాతమూ అజ్ఞాతమూ - అనుభవమూ ఆలోచనా- ఇవి సంగమించి కళారూపం ఆవిష్కృతమవుతున్నది.

ఈనాడు మనశ్శాస్త్రం అవచేతనను ఆవిష్కరించేవరకు - సాహిత్య కళా విమర్శలు హేతువునకే ప్రాధాన్యం ఇచ్చాయి. అవచేతన, సుప్తచేతన - ఇలా ఒక్కొక్క అంశమూ కళా సృజనలోని హేతురాహిత్యానికి దారి చూపాయి. యూంగ్‌వంటి మహాపురుషుడు సమష్టి అవచేతనను చెప్పడంతో వ్యక్తి సృజనలో తెలియకుండానే జాతి సంతరించుకునే పురాగాథలప్రాగ్రూపాల వర్గచిహ్నాల (టోటెమ్) ప్రాధాన్యం వెలికి వచ్చింది.

వ్యక్తమయే కళా రూపాన్ని విశ్లేషిస్తూపోతే - అది ఒక పద్యం అనుకుందాం - దాని వెనుక వెనుక కనిపించే అంశాలివి. అర్థం తాత్పర్యం మొద

లైన బాహ్యాంశాలు. ఈ భావం ఈ విధంగానే రూపు కట్టడం ఎలా జరిగింది? దీనిలో వచ్చిన శబ్ద సంఘటన ఏ దశలో ఏర్పడింది? ఈ శబ్దం ఈ ఛందో రూపాన్ని ఏ దశలో తీర్చిదిద్దుకున్నది? ఈ శబ్ద చిత్రాలు భావ చిత్రాలు ఏ భావకోశం నుంచి ప్రత్యక్షకు వచ్చి రచయిత యిక్కడ ప్రవేశపెట్టాడు? ఈ శబ్దార్థ సమష్టి వెనుకాల స్ఫురించేది ఒక లయ - దాని తత్త్వం ఏమిటి? ఇలా ప్రశ్నలు పుడుతూ ఉన్నవి.

ఈ సృజన వ్యాపారంలో జ్ఞాతమనస్సు పాత్ర ఏమిటి? ఈ జ్ఞాతమనస్సు వస్తు రూప అభివ్యక్తులలో ఏయే దశలలో నిర్ణాయకమైన భూమికను వహిస్తున్నది అనే అంశం కూడా ఆలోచించదగిందే. నిత్యజీవనంలో అసంకల్పిత చర్యల ప్రాధాన్యం ఎలాంటిదో కళాసృజనలో అసంకల్పిత అంశం ప్రాధాన్యం అంత కంటె పది రెట్లు ఎక్కువ.

సృజన వ్యాపారాన్ని గూర్చిన ఈ విశ్లేషణ సాహిత్యాధ్యయనంలో ప్రధాన భూమిక అవుతుంది, సంకల్పిత పరిధిలోని సామాజిక చారిత్రక మత సాంకేతిక తత్వశాస్త్రాలు మాత్రమే కాకుండా సహజంగా రచనాక్రమంలో మనోలోకపు సూక్ష్మసూక్ష్మాంశాలు గర్భితంగా ఉండటం జరుగుతుంది, ఈ నూతన దృష్టితో చూచినప్పుడు కావ్యాధ్యయనంలో కొత్త పార్శ్వము ప్రకటిత మవుతున్నది.

సంక్లిష్టమైన ఈ మనస్సును గూర్చిన ఇటీవలి పరిశోధనలు ఈ వ్యక్తా వ్యక్తాల నడుమగల వైరుధ్యాలను ఆవిష్కరిస్తున్నవి. వైయక్తికమైన ఆలోచ నకు, విశ్లేషణకు, నిబద్ధతకు వ్యతిరేకంగా మనస్సు లోపొరలలో పరస్పర విభిన్న సంస్కారాలు ఉండే అవకాశం ఉన్నది, అవి రచనకు రచయితకు తెలియకుండానే రచనాక్రమంలో వెల్లడి అవుతూ ఉంటవి. అందువల్ల కొన్ని కొన్ని సందర్భాలలో కావ్యపరమార్థమును గవేషించితే కవి సంకల్పమునకు విరుద్ధంగా తాత్పర్యం వ్యక్తం కావడం కద్దు.

వ్యక్తి జీవనంలోని జ్ఞాతమనస్సులోని అనుభవాలు సంకల్పాలు పరి జ్ఞానం, నిశ్చయాలు ఇదంతా రచయిత కృషిలో వ్యష్టి అనుభవం. ఇది ఒక

సరళరేఖ. అతని వ్యుత్పన్నత, కౌశలము కూడా దీనికో భాగాలే అయితే ఈ పరిమితులలో నుంచి మాత్రమే కళాసృష్టి ఏర్పడటంలేదు. దానికి ప్రేరణ సమష్టి అవ్యక్తంలోనుంచి కలుగుతున్నది. వ్యష్టి అవచేతనలోనుంచి అది రూపు కడుతున్నది, ఒక విధంగా ఇది స్వప్నం లాంటి దశ. ఈ దశలోనుంచి తన జాగ్రదనుభవంలో లేనటువంటి రూపాలు, సన్నివేశాలు, దృశ్యాలు రూపొందుతూ వుంటవి. ఇక్కడే పురాగాథల ఆధునిక రూపాలు ఏర్పడుతూ ఉంటవి, ఇదంతా అవచేతనానుసంధానం, ఈ రేఖ వ్యష్టిరేఖను నిలువుగా నడిమికి ఖండిస్తుంది, ఈ ఖడించినచోట బిందువు కళా సృజన స్థానం.




అయితే పాఠకుడు లేదా సహృదయుని దృష్టిలో ఈ సృజన వ్యాపారం లోని దశలతో ఏమి సంబంధం? అతనికి రచనతోడి సంబంధం వ్యక్త మనస్సులోనే కలుగుతున్నదికదా! అని విచారించవలసి ఉన్నది. కాని పాఠకుడికి కలిగే అనుభవం కేవలం జ్ఞాత మనస్సీమల్లోకి పరిమితమైంది కాదు.అది ఆస్వాదింపబడే వేళ అతనిలో కూడా అవచేతనానుసంధానం కలుగుతుంది. ఇదే అంతఃప్రీతి. రచన చదివే పాఠకుడికి ఒక విలక్షణమైన భావస్పందం కలుగుతుంది. అది అపూర్వమైనదిగా ఉంటున్నది.

వ్యష్టి అనుభవమూ అవచేతనానుసంధానమూ సంగమించి జరిగేది కళా సృష్టి. అందువల్ల కళాసృష్టి సమష్టి చైతన్య స్పర్శచేత రూపాంతరీకరణ పొంది వ్యక్తిగతమైన జీవన భావనల పరిధినుంచి విముక్త మవుతున్నది. సమష్టి అను

భవం, పరంపరాగతంగా ఆయా జాతి జనుల మౌలికానుభవాలకు రూపం ఇస్తున్నది ఇందువల్ల ఆ రచన దేశ కాల సీమలను దాటి మానవుని సర్వ దేశ కాలాలకు చెందిన సమానానుభవాలను వ్యాఖ్యానిస్తూ విశ్వజనీనమైనదిగా వెల్గొందు తున్నది. అలా ఎదిగిన కావ్యం - మహా గ్రంథం - ఏనాటి పాఠకునికైనా ఈ అంతఃప్రీతి కలిగిస్తున్నది. ఈ లక్షణం కలిగించే శక్తినే భవభూతి సమాన ధర్మమని చెప్పటం జరిగింది

కవి సృజన వేళలో అవచేతనా పార్శ్వంలో మేల్కొంటాడు. అప్పు డతనికి జాగ్రదవస్థా స్మృతి ఉండదు యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ. ఈ నిశయే సుషుప్తి, అవచేతన. దీనిలోని స్వప్న సంకలనమే కళాసృజన.

అవచేతనలో అనుభవం బింబాలను, ఆరోపాలను, ప్రతీకలను సంత రించుకొంటున్నది. అక్కడ నిక్షిప్తమైన అనుభవాలలో సమాన లక్షణం గలవి వరంపరగా ఆ వేళ స్వయంవరానికి సిద్ధమైన కన్యల వరుసలాగా దర్శన మిస్తాయి. కవి అనుభవం ఆ దశలో తనకు సన్నిహితమైన దానితో అనుబద్ధ మౌతుంది. అది వ్యక్తమయ్యేసరికి నూతనమైన ఉపమానమో, రూపకమో, భావ చిత్రమో, శబ్ద చిత్రమో అవుతున్నది. భౌతికమైన ద్రవ్యం భావరూప మైన దానితో, భావ రూపమైన అంశం భౌతికమైన ద్రవ్యంతోనూ లగింప బడుతుంది.

నక్షత్రాల పసివాళ్ళు, నేడు రేపటి సరస్సులోకి దూకబోయే ఈ వేళ, ఆవేశాల దీప స్తంభాలు, ఇంద్రియాల తలుపులు, అమ్మ చూపుల కర్పూరం, సూర్య పద్మం.... ఇలా వరుసగా ఆధునిక కావ్యాలలోనుంచి ఉదాహరిస్తూ పోవచ్చు. ఇవన్నీ అవ్యక్తంలో నుంచి రూపొందిన బింబ సమాకలనం కలవే. కవి ఈ సంధిలో ఉన్న పరిస్థితిలో ఇలా వర్ణిస్తాడు:

ఈ కెలన శరత్పూర్ణిమావృత శశాంక
లలితరోచిర్వితాన మా కెలన ఘోర
ఘనతరాంధకార చ్ఛటా సమాక్రాంత భూమి
అందు సగ మిందు సగముంటి నౌర నేను.

అందుసగ మిందుసగమూ ఉన్న ఈ వేళ 'ఈ సగము నాది నాకే కన్పింపబోదు' జాగ్రత్ సుషుప్తులలో ఒక దానిలోని స్థితి రెండవ వేళ తెలియబడకపోవడం ఈ పద్యంలో స్పష్టంగా చెప్పబడ్డది.

అయితే రచన అంతా అవ్యక్త స్థితిలోనే జరగడం లేదు. అది ఉన్మత్తాలాపన మాత్రం కాదు. తన అవ్యక్తపు తలుపులన్ని తెరచి తన సంకల్ప స్వరూపం దానిలోకి చేర్చి ఆక్కడ నుంచి ప్రవాహాన్ని వ్యక్తంలోకి రానిచ్చి ఆ దశలో దాని అంచులను జాగ్రత్ స్థితిలో తీర్చిదిద్దుతూ తన మూల సంకల్పంతో అవిరోధంగా ఉండేటట్లు తాత్పర్యాన్ని నిర్ణయించి తదభిముఖంగా దాన్ని నిర్మించుకుంటూ పోతాడు రచయిత.

అయితే రచనలో కానవచ్చే మౌలిక ప్రతిభాంశాలూ, అపూర్వమైన అభివ్యక్తి రచనలో వ్యక్తమయ్యే అంతర్గతలయా ఇలాంటివన్నీ అవచేతనలో నివేఅయి-వర్ణ్య వస్తువూ, ఆలోచనాంశాలు అంతర్గత తర్కం, భావ వికాసంలోని సోపానక్రమమూ ఇవన్నీ జాగ్రచ్చైతన్యం వల్ల కలిగే అంశాలు అవుతున్నవి. కవి రెండు భూమికలలోకి పోతూ వస్తూ వాటి సంధిలో నిలిచి వుంటున్నాడు. 'చంచచ్చంద్ర కరస్పర్శ హర్షోన్మీలిత తారకా - అహో రాగవతీ సంధ్యా జహాతి స్వయమంబరం' అన్నప్పుడు కవి మనస్సులో ఆ సంధ్యారాగం క్రమంగా పలుచబడుతూ వేరొకవైపు చంద్రోదయంతో వెన్నెలల కిరణాలు ఒక్కొక్కటీ ఆకాశాన్ని ఆవరిస్తున్నవేళ తన అవచేతనలోని ఒక విలక్షణమైన శృంగారానుభవం మేల్కొని సామ్యాన్ని సంధించుకొని ఈ శ్లోక రూపాన్ని పొందింది. ఆ 'రాగవతి'ఎవరో ఆ సృజనవేళ కవి మనస్సులో గుర్తులేకపోవచ్చు. 'కరాంగుళి నఖోత్పన్న నారాయణదశాకృతిః' అన్నప్పుడు అమ్మవారి నఖకాంతులను భావించిన కవి సామాన్య ఉపమానాలతో రూపకాలతో వర్ణించడంతో తృప్తిలేక తన అనుభవంలోని లోలోతుల్లో సృష్టియొక్క సర్వస్థితి మూలమైన వైష్ణవశక్తియొక్క దశావిష్కారాన్ని స్మరించిన వేళ ఈ బింబం రూపుకట్టింది.

బింబ కల్పనకు ఆధారం అవచేతనాలోకం. ఇక్కడ భూమికలు వేర్వేరుగా ఉంటవి. హనుమంతుడు లంకను దహించినాడు. ఈ లంకా దహనగాథ ప్రసిద్ధమైందే. ఈ కార్యం వెనుక సీతాన్వేషణమూ, ఆమె శోకాన్ని అపనోదించడం వంటి అంశాలున్నవి. లంకను దహించిన అగ్ని రాక్షసులు అతని వాల

మున కంటించింది. కాని కావ్యభావనలో లీనమైన సహృదయుని చిత్తములో ఆ అగ్ని - హనుమంతుడు సీతా దర్శనము వలన నాహరించిన ఆమె శోకాగ్ని - దానిచేత నే లంకాదాహము జరిగింది. కావ్యార్థ భావనమునందు తద్గతార్థమున కంటే విలక్షణమైన భావానికి బింబయోజన జరిగింది. 'ఉల్లంఘ్య సింధోస్సలిలం సలీలం యశ్శోక వహ్నిం జనకాత్మజాయాః ఆదాయతేనైవ దదాహ లంకాం నమామి తం ప్రాంజలి రాంజనేయం' అన్న పద్యం ఈ స్థితిలోనుంచి పుట్టింది. సీతాశోకాన్ని తానుగా అనుభవించే మనోభూమికలో నుంచి ఈ కల్పన ఉత్పన్నమయింది.

కావ్యంలో కల్పితములయ్యే బింబములన్నింటికీ ఒక సాధారణ లక్షణం ఉంటుంది. ఐంద్రియికములు - అనైంద్రియికములు అనే రెండు అనుభవాలు ఒకదానితో ఒకటి సంయోజింపబడటం జరుగుతుంది. సరూపమైన శ్రీరాముని మూర్తికి నిరూపమైన ధర్మముతో సంబంధం కలుగుతుంది. 'రామో విగ్రహవాన్ ధర్మః.' ఆమె నేత్రాలలో అనంతాకాశం ప్రతిఫలిస్తున్నది. ఇక్కడ అనంతాకాశం - దాని నైల్యమూ సృష్టియొక్క అనంతతా లక్షణాన్ని ఆమె కన్నులలోని అనంతమైన అన్వేషణను ఎదురు చూచుటను వ్యక్తం చేయటం ద్వారా భావవ్యంజకములౌతున్నవి. 'ఆమె కన్నులలో అనంతాంబరపు నీలి నీడలు కలవు'- 'కైకేయి మధుసామగానమూర్తి' అన్న వాక్యంలో ఈ మె దృశ్య సౌందర్యం శ్రవ్యమైన సామగాన రూపంగా సాక్షాత్కరిస్తున్నది. భగవత్ప్రీతికరమైన సామగానం ఎట్లాంటిదో - అవతార ప్రయోజనానికి ఉపకరణమైన ఆమె కూడా స్వామికి ప్రీతి కలిగించేదే - వేదానాం సామవేదోస్మి. ఇతర వేదములకంటే విలక్షణమైన సామము సంగీతము ద్వారా హృదయరంజన చేస్తుంది. కైకేయి సౌందర్యం అల్లాగే హృదయావర్జకమైంది. ఇక్కడ రెండు విధాల ఐంద్రియానుభవాల సంయోజనం జరిగింది. సాధారణంగా బింబముల కల్పనంలో దృగింద్రియ విషయములకే ప్రాధాన్యం ఉంటుంది. తరువాత ప్రధాన్యం మిగిలిన యింద్రియ విషయాలకు చెందుతుంది. ఐంద్రియక బింబాల సంయోజనంకూడా కవిత్వంలో అనుభవ స్ఫురణకు అధికంగా దోహదం చేస్తుంది. ఈబింబములలోనుంచే ఉపమాద్యలంకారసందోహము జన్మిస్తున్నది. ఉపమేయం ప్రక్షిప్తమై ఉపమానం కావ్యంనిండా స్వతంత్రంగా వ్యాపించినప్పుడు అది ప్రతీక అవుతున్నది. ప్రక్షిప్తమైన ఉపమానం అస్వతంత్రమై ఉపమేయానికి నీడలాగా ప్రవర్తించినప్పుడు అది అన్యాపదేశమై (అలిగరీ) ప్రవర్తిస్తున్నది.

వ్యక్త చేతనతో అవచేతనానుసంధానం జరిగే సన్నివేశానికి ఇదమిత్థమని ఒక ప్రణాళిక రచించే వీలుండదు. అవ్యక్తంలో జరిగే కార్యక్రమం ఇచ్ఛా విరహితము కావడం, ఆయావేళల్లో ఆయావ్యక్తి అనుభవవేళలో అతని సంస్కారములు వాసనలు ఉద్బుద్ధమయ్యే తీరునుబట్టి అనంతంగా ఈ వైవిధ్యం ఏర్పడుతుంది. కవిత్వం నిత్య నూతనంగా ఉండేందుకు ఈ వ్యక్తావ్యక్తాల 'గ్రథనకౌశలం' కారణమవుతున్నది.

దేశ కాల భేదాన్నిబట్టి కవిత్వంలో వస్తువు, భాషాశైలులు, ఛందస్సు మారిపోవడం కద్దు. అయితే ఈ బింబ ప్రపంచం నిత్యమూ నూతనము అయింది.

ఒక్కొక్క కవిలోని బింబ ప్రపంచాన్ని జాగ్రత్తగా విశ్లేషించి చూస్తే ఆయన చైతన్యపు లోతుల్లో ఎన్ని లోకాలు దాగివున్నవో తెలియవస్తుంది. అయితే అవ్యక్తము యొక్క ఈ విలాసాన్ని, విజృంభణను అదుపులో ఉంచేది వ్యక్త చైతన్య భూమికలో ఉన్న ఔచిత్య తత్త్వం. ఈ ఔచిత్యం గ్రామ్యవాసన నుంచి కవిత్వాన్ని విముక్తం చేసి సభ్యసంస్కారపరిధిలో నిలిపి ఉంచుతుంది.

రససిద్ధాంతంలో అనుభూతిని విశ్లేషించేప్పుడు మనశ్శాస్త్రం ప్రధానాంశం అవుతున్నది. విభావములలో ఆలంబనం బాహిరమైన వస్తువే అయినా ఉద్దీపనం మనస్సుకు సంబంధించిందే. అనుభావ వ్యభిచారి భావాలలో వ్యభిచారి భావాలు మనస్సంచారాన్ని విశ్లేషించి తెలియవలసినవి. అనుభావాలు మనోభావాల బాహిరమైన వ్యక్త సంజ్ఞలు. సంయోగము, నిష్పత్తి ఈ రెండూ లోతుగా విచారించవలసిన మాటలు. ఈ సంయోగము జరిగే మనోభూమిక ఏది? మనస్సు, బుద్ధి, అహంకారము ఈ క్రమంలో సంయోగం జరుగుతూ పరిణమించే దశ చిత్తమును చేరుతుంది. ఇది 'సైకి'కి సమానముగా భావింపవచ్చును. ఈ దశలో విభావాదుల పరిణామస్థితి సాధారణీకరణం అవుతుంది. సాధారణీకరణం పొందిన ఈ సామగ్రి చిత్తములో రసముగా నిష్పన్నమవుతున్నది. రసము అలౌకిక మన్నప్పుడు అది లోకసంబంధమైన పరివేషములన్నీ - పై పొరలన్నీ సాధారణీకరణం పొందేటప్పటికి క్రమంగా వదలి వేస్తున్నది. అప్పుడు ఆ అనుభవం విలక్షణమై విశ్వజనీనమై సుఖ దుఃఖపరిమితులకు అతీతమై రస్యమాన మవుతున్నది.

('అభినందన' ఆచార్య దొణప్ప షష్టిపూర్తి సంచిక. డిసెంబరు, 1987.)

# సాహిత్యానుశీలనలో ప్రాగ్రూపాల, పురాగాథల ప్రాధాన్యము

ఆధునిక కాలంలో మనస్తత్వశాస్త్రంలో వెలువడిన నూతనాంశములు సాహిత్య అనుశీలనకు, తద్రహస్యాన్ని అవగాహన చేసుకోవడానికి దోహదం చేస్తున్నాయి. యూంగ్ ప్రతిపాదించిన ప్రాగ్రూప తత్త్వ వివేచనం అపూర్వమైన అనుసంధానమై ప్రాచీన పరంపరాయాతాలుగా వస్తూ ఉన్న పురాగాథల అంతర్యాన్ని ఆధునిక సాహిత్య సృజనలో వాటి ప్రాథమ్యాన్నీ వ్యక్తం చేయటంలో వినూతన జ్ఞాన కవాటాలు తెరిచింది.

ఏ సాహిత్య సృజనకైనా మూలం వ్యక్తావ్యక్త జగత్తులతోడి అనుసంధానం. వ్యక్త చైతన్యం - అవ్యక్త చైతన్యం రెండూ సాహిత్య నిర్మాణంలో శరీర చైతన్యాలవలె అవినాభావంగా ప్రవర్తిస్తూ ఉంటవి. అయితే సృజన వేళ రచయిత వ్యక్తావ్యక్త చైతన్యాల నడిమి బిందువు మీద నిలిచి ఉంటాడు. తన వ్యక్తిలోని అవచేతనలోనుంచి త్రోసుకు వస్తూవున్న అనుభూతి ముద్రలను, విచిత్రరూపాలను, కల్పనలను వ్యక్త జగత్తులోకి విసిరివేస్తూ దానికి రచనాకాలాన్ని కల్పిస్తాడు. అయితే యూంగ్ ప్రతిపాదించిన సామూహిక అవచేతన లేదా సమష్టి అవచేతన అన్న సిద్ధాంతంవల్ల వ్యక్తి తన వైయక్తిక అవచేతన పరిమితులను కూడా దాటి సృజన సమాధి దిశలో తనకు తెలియకుండానే సామూహిక అవ్యక్త చైతన్యంలోకి ప్రవేశిస్తాడు. ఇక్కడ అతను వ్యక్తం చేసే అంశాలు అతని జీవితంలో పరిసరాలలో అనుభూతాలు కానవసరం లేదు. ఈ అనుభూతమైన భావజగత్తు, అంతా సమష్టి అవ్యక్త అవచేతనలో నుంచి ఆకర్షింపబడియో లేదా త్రోసుకొనియో వచ్చినదై ఉంటుంది. 'ఉర్విలోన మహాకవి యోగివంటివాడు, సర్వమ్ము భావనావధిగ జూచు' అన్నచోట ఈ భావన యొక్క అవధి సమష్టి అవచేతనయే. అందువల్ల 'అదియెల్ల అనుభవించెననుకొనుట వట్టి సామాన్యమైన మాట' అని అది సమష్టి అనుభవం పరిధిలోనిదని నిర్ధారణగా తెలుస్తుంది.

సాహిత్య సృజనకు ఏ దశలోనైనా ఆ జాతి పురాగాథలు దాని అనంత కాలపు అనుభవ సంపుటాలుగా నిలచి ఆధార సామగ్రిగా నిలచి ఉంటాయి. రచనలో ఉపమాది సామగ్రియైనా, నిర్మాణపు మాదిరులైనా ఈ పురాగాథల ఆధారం మీద నిలచి ఉండటం కద్దు. అయితే ఈ మాదిరులు కవి వ్యక్త చైతన్యాంశంలో భాగం కాకుండా అతని భావనను ఆ మార్గంలో ప్రవర్తించేందుకు దోహదం చేస్తవి. మానవుల ప్రవృత్తిలోని విశ్వజనీనతను, సార్వకాలీనతను గర్భీకరించుకొన్నవి కావడం వల్ల పురాగాథలు మానవేతివృత్తాన్ని చిత్రించే ఏ రచయితకైనా మార్గదర్శనం చేస్తాయి.

మనం పురాగాథలు అన్నప్పుడు దానిలో పురాణ కథలు, జానపద గాథలు, పరంపరగా వచ్చే జనశ్రుతుల్లోని అంశాలు అన్నీ భాగాలే అవుతవి. మన దేశంలో పూర్వకాలంలో ఈ పురాగాథల ప్రాముఖ్యం గ్రహించి వుండటం వల్ల పురాణాల సంకలనం జరిగింది. తరువాతి కాలంలో మళ్ళీ సంకలనం చేయవలసివస్తే పంచతంత్రమూ, బృహత్కథా, విక్రమార్కుని కథలు, దశకుమార చరిత్ర, శుకసప్తతి, హంసవింశతి ఇత్యాదిగా లోక కథాకంకలన కార్యం కొనసాగుతూ వచ్చింది. శిష్టుల వాఙ్మయానికి జానపదుల వాఙ్మయానికి ఆదాన ప్రదానాలు ఎప్పుడూ జరుగుతూ వచ్చాయి.

ప్రాగ్రూపాలు వ్యక్తిగత జీవితంలో కలలో గోచరించడం కద్దు. ఎవరిలో వ్యక్తచైతన్యాంశ బలహీనంగా వుంటుందో, వ్యష్టి అహంభావం తగ్గు స్థాయిలో వుంటుందో వారిలో సమష్టి అవచైతన్యం మేలుకుంటుంది. అవ్యక్త చైతన్య స్థితిలో వైరుధ్యముల సమన్వయం గోచరిస్తుంది. చైనావారి ప్రాచీన వాఙ్మయంలో టావో అన్న చిహ్నము ఉంది. ఇది భూమ్యాకాశముల, దివారాత్రాల, సూర్యచంద్రుల, స్త్రీపురుషుల సమైక్యతకు చిహ్నముగా ఏర్పడిన గుర్తు. అట్లాగే సర్పము గుర్తు. బావిలో లేదా గుహలో సర్పము అవ్యక్త చైతన్యములోని అంశాలకు ప్రాధాన్యం వహిస్తుంది. ఇది రోగాలను నయం చేయడం, బుద్ధిని వికసింపజేయడం, భవిష్యత్తును చెప్పడం మొదలైన అనేక కార్యాలను సూచిస్తుంది. విధిని కాపాడే సర్పము నిధికి ప్రతీక అవుతుంది. ఆ సర్పము స్వర్ణవర్ణంలో ఉంటుంది. పాతాళంలో సర్పాలు కద్రువ సంతానమైన సర్పాలు.

భూమిని ధరించిన ఆదిశేషుడు - కుండలిని. సుషుమ్న రూపమైన సర్పము - విష్ణుశయనమైన అనంతుడు. ఇలా సర్పము ఒక జాతిలో ఎన్ని భిన్న భిన్న భావాలకు సంకేతంగా వచ్చిందో చూస్తే ఆశ్చర్యం వేస్తుంది.

ప్రాగ్రూపమంటే మన సమష్టి అవచేతనలోనుంచి వచ్చే కథాంశాలు గానీ, పాత్రలుగానీ, భావాలుగానీ కావచ్చు. సృష్టిలో అంతటా ఈ ప్రాగ్రూపాలు సామాన్య లక్షణం కలిగి ఉంటాయి. అందుచేత ప్రాగ్రూపాలు విశ్వజనీనాలు. అందుచేత వాటి మీద ఆధారపడి నిర్మితమైన పురాగాథలు కూడా విశ్వజనీనాలు అవుతున్నాయి. ఈ ప్రాగ్రూప విజ్ఞానం అవ్యక్తంగానే ప్రాక్తన కాలాల్లో ఉన్నట్లు గోచరిస్తుంది. "అసంశయం క్షత్ర పరిగ్రహ క్షమా" అన్న సందర్భంలో కాళిదాసు అంతఃకరణ ప్రవృత్తికి ప్రాధాన్యం ఇవ్వడం ఈ అంశాన్ని సూచిస్తుంది. ఈ అంతఃకరణంలో స్ఫురించే సహజ బోధ ఏ మనోభూమికలోంచి ఆవిర్భవిస్తుంది - అన్న ప్రశ్నకు యూంగ్ స్పష్టంగా సమాధానం చెప్పాడు.

ఈ ప్రవృత్తి స్వరూపాన్ని విశదంగా కాళిదాసు "రమ్యాణివీక్ష్య" అన్న సందర్భంలో వివరిస్తాడు. తాను ఎదురుగా దర్శించినప్పటికంటే ప్రవృత్తికి హేతువు అబోధపూర్వమైంది. అననుభూతమైంది. జననాంతర సౌహృద ములు భావ స్థిరములు. ఈ భావ శబ్దమునకు మనం అర్థం చెప్పడంలో ఈ ప్రాగ్రూపాల ఉనికి నిర్ధారణ చేయవచ్చును. ఈ ప్రాగ్రూపాల ఆవిర్భావ స్థానము 'సైకి'. దాన్ని మనం భారతీయ పరిభాషలో 'చిత్' అనవచ్చునేమో! ఈ చిత్ ప్రాక్తజనుల మనోలక్షణాలను, విశ్వాసాలను, అలవాట్లను, జానపద పౌరాణిక విజ్ఞానాన్ని మత భావాల సమతౌల్యాన్ని తనలో గర్భీకరించుకొని ఉంటుంది. ప్రధాన ప్రాగ్రూపములు - 1) మాతృ పితృ ప్రాగ్రూపము, స్త్రీ పురుష ప్రాగ్రూపము, 2. పునర్జన్మ ప్రాగ్రూపము, 3, సమూహ వ్యక్తిత్వాన్ని పొందడం, 4. తెగల నాయకునితో తాదాత్మ్య భావము. 5. మనిషి ఈ జన్మలోనే మరల క్రొత్త జీవితాన్ని ప్రారంభించడం మొదలైనవి. మనిషిలోని ప్రేమ, దయ, క్రోధము, పగ మొదలైనవి కూడా ప్రాగ్రూపాలే. ఈ ప్రాగ్రూపాలన్నీ అనుకూల వ్యతిరేక పక్షాలలో కూడా ఉంటవి. (పాజిటివ్ అండ్ నెగిటివ్.)

ఈ ప్రాగ్రూప విజ్ఞానం లేకపోతే పురాణ వాఙ్మయమంతా అర్థంకాక నిరర్థకమైనదిగా గోచరిస్తుంది. పురాగాథలలోని అంశాలు అనన్వితాలుగా దుర్గమాలుగా తయారవుతవి. ఉదయ సూర్యుణ్ణి సముద్రంలో నుంచి అవతరించిన దివ్య వీరుడుగా, ఆకాశం మీద రథం నడిపేవాడుగా - పడమటనున్న భయంకర సర్పం అతణ్ణి మ్రింగి వేస్తుందనీ, రాత్రంతా దానిలో ఉంటూనే దాన్ని చీల్చి రక్తసిక్తాంగుడై తిరిగి ఉదయిస్తాడనీ పాశ్చాత్యలోక గాథ. భారతదేశంలో ఇదే అంశం ఉదయ సూర్యుడు మందేహులనే రాక్షసులతో యుద్ధం చేసి రక్తసిక్తాంగుడై రథం మీద ఆకాశంలో పయనిస్తాడని చెప్పబడింది ఈ రెంటి సామ్యం చూస్తే ప్రపంచంలోని ప్రాగ్రూపాల నడుమ గల సమ లక్షణం కనిపిస్తుంది. "సిరథము" అన్న రచనలో విశ్వనాథ అప్రతిహత రథయానాన్ని, క్రింద నలిగిపోయే వాళ్ళను వర్ణించినప్పుడు ఈ ప్రాగ్రూపం పని చేసిందేమోనని తోస్తుంది.

మహాభారతంలో పాండవులు, ద్రౌపది - ఈ ఆరుగురూ ధర్మ స్వరూపమైన కుక్కతో పాటు హిమాలయముపై ప్రయాణం చేసినట్లుగా మహాప్రస్థాన పర్వంలో ఉన్నది. ఖురాన్‌లో 15 వ పేరాలో "అసాహబ్ - ఎ - కహబ్" అన్న వృత్తాంతంలో ఆరుగురు వ్యక్తులు ఒక కుక్కతో పాటు ప్రయాణం చేసి ఒక గుహలో కొన్ని వందల సంవత్సరాలు నిద్రించినట్లుగా చెప్పబడింది. ఈ పురాగాథల సామ్యం కూడా పరిశీలించదగినదే. మన పురాణ గాథలలో ప్రాగ్రూప తత్వం ప్రస్ఫుటంగా గోచరించే సన్నివేశాలు ఎన్నో ఉన్నాయి. జయవిజయులు విష్ణుదేవుని ద్వారపాలకులు. వాళ్ళు శాపం పొంది కూడా జన్మలెత్తి మళ్ళీ స్వస్థానం చేరారు. ఇక్కడ మూడు జన్మలనూ సమష్టి అవచేతన, అవచేతన, వ్యక్తచేతన అన్న మూడు దశలుగా భావించవచ్చును. అయితే జయవిజయులు అనుకూల ప్రాగ్రూపాలుగా కాకుండా వ్యతిరేక ప్రాగ్రూపాలుగా ఆవిష్కరింపబడ్డారు. అందువల్లనే వారిలోని వ్యతిరేక లక్షణం - అంటే దైత్య లక్షణం ఒక్కో దశలో నుంచి మరో దశకు వచ్చేసరికి తిరుగుతూ వచ్చింది. హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల కోసం ఒక్కో అవతారం అవసరం కాగా, రెండో దశలో శ్రీరాము డొక్కడే సరిపోయినాడు. మూడవ దశలో శ్రీకృష్ణుడు సంహరించిన దుష్టులలో శిశుపాల, దంతవక్త్రులకు ప్రాధాన్యం లేదు. ఇంకా పురాణ ప్రోక్తమైన అవతార సిద్ధాంతం కూడా ప్రాగ్రూప

తత్వాన్ని వ్యాఖ్యానిస్తుంది. ప్రాగ్రూపం ఏ భావాన్ని స్ఫురింప జేస్తున్నదో అది ముఖ్యం కాని దాని రూపం ఎప్పుడూ కాదు. అందువల్ల శ్రీమన్నారాయణుని అవతారాలేవైనా అన్నింటికీ ప్రయోజనం ధర్మ సంస్థాపనమే. ఈ ధర్మ సంస్థాపన భావం కథా రూపాన్ని పొందితే ఆయా కాలాల చైతన్యాన్ని పొదువుకొని అవతార కథా చిత్రంగా పర్యవసించింది.

ఈ అవతార భావం యొక్క వ్యతిరేక ముఖాన్ని ప్రకాశింప జేస్తే అది ధర్మధ్వంసక భావం. భగవద్విరోధ భావం యొక్క పునరావృతి అవుతుంది. అయితే ఈ భావం ఎప్పటికప్పుడు శ్లథమవుతూనే ఉన్నది. ఈ అంశం ఆధారంగా చిత్రించిన ఒక అద్భుత కథా చిత్రం విశ్వనాథ పురాణవైర గ్రంథమాల. పురాణవైర గ్రంథమాలలో ఈ విరోధభావం స్వరూపం జయద్రథుడి ద్వారా వ్యక్తమయింది. మన భారతంలో అప్రధానంగా కనిపించే జయద్రథుడు ఈ నవలల్లో భగవద్విరోధ భావాన్ని నిలువబెట్టేందుకు రకరకాల రూపాలలో రకరకాల కాలాలలో ప్రయత్నం చేస్తూ ఉంటాడు. ఈ అద్భుతమైన వస్తు కల్పనలో జయద్రథుని వస్తు కల్పనలో జయద్రథుని విశ్వరూప నిర్మాణం భగవద్విరోధియైన, అనాదియైన, 'సైతాన్' స్వరూప ప్రతిపాదకంగా కొనసాగింది.

ప్రాగ్రూపాలలో ప్రధాన ప్రాగ్రూపం మాతృరూపం. ఈ మాతృరూపం పురాతనకాలం నుంచీ అన్ని జాతులలోనూ కానవస్తుంది. ఈ మాతృ ప్రాగ్రూపం దేవతా రూపాన్ని పొందింది. వివిధ రూపాలలో శాక్తధర్మమంతా ఈ ప్రాగ్రూపాన్నాశ్రయించింది. తల్లియొక్క వివిధ లక్షణాలు ఆధారంగా వివిధరూపాలు వచ్చాయి. లలిత, దుర్గ, కాళి. ..మొదలైనవన్నీ ఆమె యొక్క వివిధ పార్శ్వాలను వ్యక్తంచేసే రూపాలు. దానిలో భాగమైన కుమారి రూపం మనకు కన్యాకుమారిగా, బాలగా రూపొందింది. ఆమె భయంకర రూపం ప్రత్యంగిర, భిన్నమస్తాది రూపాలుగా గోచరించింది. ఈ విధంగా తంత్ర సాహిత్యం అంతా మాతృప్రాగ్రూపం యొక్క విస్తృతరూపంగా కనిపిస్తుంది. తంత్రంలో ఉపయోగించే వృత్తము, త్రికోణము, మండలము వీటి భిన్న భిన్న సంక్లిష్టరూపాలు భావాలకు సంకేతములుగా ప్రాక్తనకాలంనుంచీ వస్తున్నాయి.

ఈ ప్రాగ్రూపాలు మన అలంకరణలలో, నిర్మాణాలలో, కల్పనల్లో నిలిచే ఉన్నాయి. ఇంకా పరిశీలిస్తే మన సాహిత్యంలో కానవచ్చే దేవతా రూపాలు, ఆభరణాలు, ఉపాసనా పద్ధతులు, వర్ణములు, పూలు ఇవన్నీ ఈ ప్రాగ్రూప సంబంధం కలిగి ఉన్నాయి.

ఆధునిక సాహిత్యాన్ని అర్థం చేసుకోవడానికి కూడా ఈ ప్రాగ్రూప వివేచన ఎంతో అవసరం. గురజాడ 'కన్యక'లో సతి దేహత్యాగమూ, వీర భద్రుని విజృంభణమూ ప్రాగ్రూప ప్రవృత్తిగా గోచరిస్తాయి. మాలపల్లిలో కథా నిర్మాణం వెనుక మహాభారత కథా సూత్రం గర్భితమై ఉన్నది. రామదాసు, వెంకటదాసు, సంగదాసు క్రమంగా ధర్మజ, భీమార్జునులను సూక్ష్మరూపంలో గర్భీకరించుకొన్నవారు. అలాగే సంగదాసు మరణానికి ముందు ఆయన బుచ్చయ్యగారి దగ్గర ఉపదేశం పొందటం, వెంటనే సంఘర్ష ణలో ప్రవేశించడం గీతోపదేశ సన్నివేశాన్ని గుర్తుకు తెస్తుంది. కమల వికృత రూపంలో నలుడు బాహుకుడై దమయంతి వద్దకు చేరడంగా రూపుదిద్దుకుంది. ఇక్కడ స్త్రీపురుష రూపాలు వ్యత్యస్తమైన పద్ధతిలో అదే ఇతివృత్తం పునరా వృత్తమైంది. దీనిలో వర్ణితమైన సెటిల్‌మెంటు జీవితం, జైలుజీవితం అరణ్య, అజ్ఞాతవాసాలను స్ఫురింపజేస్తూ వున్నాయి. ఈ సామ్యాలు ఏ అంశానికి ఆ అంశంగానే చూడాలి. వాటి మధ్య ఒక అనుస్యూతి ఉండనక్కరలేదు.

ఇంకా వేయిపడగలలో ప్రాగ్రూపాల ప్రాచుర్యం ఎక్కువగా గోచ రిస్తుంది. నవలలో కలలు-భావసూచన, పాముల పడగలు, వాటి భిన్న భిన్న దర్శనాలు, గణాచారి, పసరిక ఇవన్నీ ప్రాగ్రూపాలే. ఇవికాక అనేక సన్ని వేశాలలో ప్రాగ్రూప స్ఫురణ ఉండనే ఉన్నది. పాములు కాలాన్నీ, వ్యవస్థనూ సూచించడం ఒకవైపు, రెండోవైపు పృథ్వికి ప్రతీకయై జీవశక్తిని సూచించడం పసరిక పాత్ర పోషణలో వ్యక్తమౌతుంది. గణాచారి మంత్రకత్రైకు అభివ్యక్తిగా కనిపిస్తుంది. ఈ వ్యక్తిత్వం ఇక్కడ అనుకూల పార్శ్వం నుంచి వ్యక్తం చేయ బడ్డది. అయితే దీని వ్యతిరేక ముఖము పురుషరూపంలో 'స్వర్గానికి నిచ్చె నలు'లో వాయుదేవునిలోనూ, నాస్తిక ధూమంలో జయద్రథునిగాను వ్యక్తము చేయబడ్డది. పసరికలో ప్రాణవికాసంలోని అన్ని దశలూ స్ఫురింపబడ్డవి. ఈ నవలలో సుబ్రహ్మణ్యస్వామిని తీర్చిదిద్దడంతో ప్రాగ్రూప స్ఫురణతో పాటు

రచయిత పురాణకథా విజ్ఞానము, యోగసాధనాజ్ఞానము సమ్మిళితము చేయ బడ్డవి. ఈ నవలలో ప్రధానంగా సుబ్రహ్మణ్యేశ్వరుడు కలలలో కనిపిస్తాడు. అతని ప్రసన్నత, క్రోధమూ, వృద్ధీ-శైథిల్యమూ సమాజ స్థితికి సూచకాలుగా ఉన్నవి. ఆయా వ్యక్తులకు కనిపించి భావిని సూచించడమూ దీనిలో ఉన్నది. అంతేకాక దీనిలో కొన్ని సన్నివేశాలు ప్రాగ్రూప ప్రవృత్తిని వ్యక్తం చేస్తూ వున్నవి. వసరిక మరణం సందర్భంలో ఆదిమ మానవుని శిక్షాస్మృతి విధానం గోచరిస్తున్నది. సుబ్బన్న పేట ఆవిర్భావం సందర్భంలో ఆవు, పాము, పుట్ట మొదలైన వృత్తాంతం పురాణాలలోని పృథు కథను సూచిస్తున్నది.

'ఏకవీర'లో ఏకవీర పాత్ర ప్రవృత్తిలో రేణుకాదేవి కథ గోచరిస్తుంది. ప్రణయ విజృంభణ వల్ల స్త్రీ ఆత్మత్యాగం రేణుక వృత్తాంతం సూచించే అంశం. ఏకవీర వీరభూపతిని చూడటం, మనస్సును బిగబట్టుకోలేకపోవడం, ఆమె మృతీ ఈ అంశాన్ని స్పష్టం చేస్తున్నవి. ఆమె పేరు ఏకవీర - అంటే రేణుకా దేవియే. రేణుకాదేవి కథ తన కథకు ఆధారంగా నిలబడ్డట్టు బుచ్చి బాబు 'చివరకు మిగిలేది'లో చెప్పాడు. దానిలో స్త్రీ పాత్రలన్నీ ప్రణయభావం-సమాజనీతి మధ్యన నలిగిపోయినవే. చివరకు పాతివ్రత్య భావనిధియైన ఇందిరకు కూడా ప్రణయాన్ని భర్తయందు నిలువరింపజేసే యత్నం ఆమె మృతివేళనే సాధ్యమవుతుంది. సహజంగా స్త్రీ జీవితంలో ఉండే సంఘర్షణ, ఆత్మ బలిదానం ఆదికాలంలో మానవుడు ఛిన్నమస్తాదేవి రూపంలో చూస్తే ఆ ఛిన్నమస్తా రూపం మనకు కాల్పనిక యుగంలోని కథా నాయికలందరిలోనూ గోచరిస్తుంది. 'మైదానం'లో, 'తుఫాను'లో, 'చెలియకట్ట'లో ఇలా ఆనాటి ప్రముఖమైన నవలలన్నింటా ఈ రేణుకా ప్రాగ్రూప ప్రతిఫలనం కనిపిస్తున్నది.

పురాణాలలోని బుధ - ఇల వృత్తాంతం ఆనిమా, ఆనిమస్ సమైక్య లక్షణాన్ని నిరూపిస్తుంది. ఈజిప్టు ఇట హెర్మిస్, గ్రీకులో మెర్క్యూరీ ఇలాంటి రూపాలే. ఈ ప్రాగ్రూపంలో ఉండే స్త్రీ పురుషుల సమ్మేళనం ఆదిమానవుల మనోభావాన్ని వ్యక్తం చేస్తుంది. ఈ అంశం తరువాత తరువాతి కాలంలో అర్ధనారీశ్వర మూర్తిగా మనకు రూపు కట్టింది. ఇక్కడ ఇల భూమికీ, బుధుడేమో ఆకాశానికీ సంకేతాలు. ఈ రెంటి కలయికలో స్త్రీ పుంసయోగమైన సృష్టి వికాసము ఉన్నది. అందుకే బుధుడు కన్యారాశికి అధిపతి. బుధుడికి ద్వారకలో దేవాలయం ఉండేదనీ, శ్రీకృష్ణుడు అర్చించినాడనీ తెలియ వస్తున్నది. తరువాత కాలంలో బుధుడికీ, మహావిష్ణువునకూ అభేదం చెప్పబడ్డది.

ఆధునిక కవిత్వంలో ఈ ప్రాగ్రూపాల స్ఫురణ అధికంగానే ఉన్నది. శ్రీశ్రీ మహాప్రస్థానం అన్న పేరులో అవ్యక్తంగానే జీవిస్తూ ఉన్న ఈ జగత్తును విడిచి నూతన జగత్తుకు అభిముఖంగా ప్రయాణం చెయ్యడమే ప్రధానాంశం. మహాప్రస్థానంలోని మహాప్రస్థానానికి దీనికీ వస్తుతః భేదం ఉన్నా ఒక సుదూర లక్ష్యం గురించిన సర్వమూ త్యాగం చేసిన ఒక మహా సాహస ప్రయాణం ఇక్కడ సమలక్షణం. అట్లాగే సోమసుందర్ వజ్రాయుధం అన్న పత్రికకూడా ప్రాగ్రూప భావనయే. దుష్ట శిక్షణ అన్న భావంకంటే పర్వతాల రెక్కలతోడి స్వేచ్ఛాచారము ఎంత జనహింసకమో ఈ ప్రతీక సూచిస్తుంది.

శ్రీశ్రీ పరమేష్ఠి జూకాలు అన్నచోట పునస్సృష్టికి ఉన్ముఖమైన బ్రహ్మ దేవుని చైతన్యాన్ని సూచిస్తున్నది. ఈ భావం వేదాధ్యయనం చేసే బ్రహ్మ నిష్ఠులైన బ్రాహ్మణులు కదిలే కుండలాల స్ఫురణ వెనుక లోలోతులలోకి త్రవ్వుకుపోగా పుట్టింది.

ఆయన ప్రయోగించిన 'జగన్నాథ రథచక్రాలు' అనే ప్రతీక కూడా ప్రతీక ప్రాగ్రూపాల నడిమి అంశమే. అప్రతిహతమై గమనమే కాకుండా మానవుల దుఃఖాలను తొలగించేందుకు దేవతలు రథాలలో ఆకాశం నుంచి దిగి వస్తారనే ప్రాగ్రూప భావం దీని వెనుక ఉన్నది. ఆకాశం దారులంట వెళ్ళిపోయే రథ చక్రాలను భూమార్గం పట్టిస్తాను అంటాడు.

ప్రాగ్రూప వివేచన ప్రాగ్రూపాలను గుర్తించడమూ, ప్రాగ్రూప ప్రవృత్తిని గుర్తించడమూ ఈ విధంగా మూడు విధాలు. అయితే పురాగాథ ప్రాగ్రూపంగా వ్యక్తం కావడంతో బాటు ప్రత్యక్షంగా కవి చైతన్యంలో భాగమై రచనా ప్రణాళికలో చోటు చేసుకుంటుంది. ఈ దశలో కవి అచేతనలో ప్రతీకలుగా,ఉపమానాలుగా,రూపకాలుగా రూపుకడతాయి. సావిత్రి, హరిశ్చంద్రుడు, శ్రీరామచంద్రుడు, విశ్వామిత్రుడు, ఆంజనేయుడు, ధర్మరాజు, కీచకుడు, ధృతరాష్ట్రుడు, దుశ్శాసనుడు ఇలా ఎన్నో పాత్రలు మనకు ప్రతీకలుగా, ఉపమానాలుగా సాహిత్యంలో ప్రవర్తించడం చూస్తూనే ఉన్నాము.

స్వాతంత్ర్య సమరం రోజులలో మాతృదాస్య విమోచనం, పాంచాలీ పరాభవం ఇత్యాది రచనలన్నీ పురాణగాథల ప్రతీకలుగా నాటి దేశ స్థితిని చెప్పడానికి ఉద్దేశించినవి. శ్రీ అరవిందులు 1905 లో రచించిన 'భవానీ

మందిర్'అనే కరపత్రం అంతా ప్రతీకాత్మకమే. మాతృ ప్రాగ్రూప మూలాంశం ఉన్నప్పటికీ బంకించంద్రుని వందేమాతరం గీతంలో ఉన్న విరాణ్మూర్తి వర్ణనం అంతా ప్రతీకాత్మకతను మూలంగా చేసుకున్నదే.

పురాగాథ కూడా జాతి పెరుగుతున్నకొద్దీ పెరుగుతూనే ఉంటుంది. దాని మూలాంశం మారకపోయినా, దాని చుట్టూ తత్కాలీనములైన ఆచార వ్యవహారాలు, ఆదర్శభావనలు, నూతన కథా వలయాలను నిర్మించుతూ ఉంటవి. ఒక్కొక్కసారి తద్వ్యతిరేకమైన భావాలను కూడా ప్రతిక్రియా రూపంలో పరికల్పన చేయడం జరుగుతుంది. జానపద గాథల్లో రామాయణ వృత్తాంతంలో వచ్చిన మార్పులన్నీ ఈ దృక్పథంతో వచ్చినవే. వేనరాజులో గౌతముని పాత్ర ఆధునిక కాలంలో సంప్రదాయ పునాదుల క్షతికి విరుద్ధంగా కవి వ్యక్తం చేసిన ఆక్షేపణయే. అట్లాగే ఖూనీ, శంబూక కథ, అశోకం, చలం హరిశ్చంద్ర, ప్రహ్లాద, రామాయణ విషవృక్షం ఇవన్నీ వ్యతిరేక ముఖంగా ప్రతీకలను కూల్చివేయడంకోసం పరికల్పింపబడ్డ ప్రతిక్రియా రూపాలే.

అయితే పురాగాథలు, ప్రాగ్రూపాలను మన దేశపు తాత్త్విక చింతన దృష్ట్యా చూచినప్పుడు కొన్ని అంశాలు చర్చనీయాంశాలవుతున్నవి. మాండూక్యోపనిషత్తు మనస్తత్వ శాస్త్రాంశాలను మౌలికంగా చర్చించింది. అవస్థాత్రయ నిరూపణలో జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలలో భిన్న భిన్న చైతన్యాలను స్ఫుటంగా నిర్దేశించింది. స్వప్నదశకూ సుషుప్త్యవస్థలోని స్థితికీ ఆధునిక శాస్త్రాన్ని అన్వయించవలసి వస్తే అవచేతననూ, సమష్టి అవచేతననూ పేర్కొనవచ్చు. తురీయావస్థ మాత్రం ఇంకా ఆధునిక మనఃశాస్త్రంలో భాగం కాలేదు. కాళిదాసు 'జననాంతర సౌహృదాని, ప్రవేదిరే ప్రాక్తన జన్మవిద్యాః'అని అన్నప్పుడు ఈ సంస్కార పరంపరకు మూలం జన్మ పరంపరంగా కనిపిస్తుంది. ఆధునిక మనస్తత్వ శాస్త్రకర్తలు జన్మ పరంపరను అంగీకరించలేదు. ప్రాచ్య పాశ్చాత్య పురాగాథలలో ఈ అంశం ఒకటి స్ఫుటంగా భిన్నంగా గోచరిస్తుంది. అక్కడ తరాల పరంపరకూ ఇక్కడ జన్మ పరంపరకూ సమాన స్థానం గోచరిస్తుంది. ఈ భిన్నాంశం తప్ప మిగిలిన అంశాలను సమన్వయం చేయడంలో ఇబ్బంది లేదు.

ఈ దృక్పథంలో యూంగ్ ఆత్మ పదార్థాన్ని అంగీకరించడానికి సన్నిహితంగా వచ్చిన మాట నిజమే కాని అంగీకరించలేదు. దీనిలో కర్మలు -

వాసనలు - సంస్కారాలు ఈ అంశాలన్నీ ముడిపడి ఉన్నవి. అయితే శివుడు శరీరధారణ చేసేందుకు వస్తూ వెంట ఐదు భూత సూక్ష్మాలనూ, ఐదు ఇంద్రియ సూక్ష్మాలనూ మాత్రమేకాక మనస్సును కూడా వెంట బెట్టుకొని వస్తున్నాడు. ఈ మనస్సుతోపాటు దాని అనుభవాల ముద్రలూ వెంట వస్తున్నవి. ఈ అంశం చూస్తే మనస్సు యొక్క అనుస్యూతి అనాదిగా జీవుని వెంట వస్తూ ఉన్నట్లు, ఆ సంస్కారాలు కూడా అనుస్యూతంగా సాగి వస్తున్నట్లు గోచరిస్తుంది. అంటే ఈనాటి భాషలో మానవునిలో అతి పురాతన కాలపు సంస్కారాలు అఖండంగా అనువర్తించి రావడం అసహజమైనదేమీ కాదని తెలుస్తున్నది.

ప్రాగ్రూపాలకు, ప్రతీకలకు మధ్య విస్పష్టమైన విభజన రేఖ గీయడం సాధ్యం కాదు. అయితే ప్రాగ్రూపం కవియొక్క ఇచ్ఛా రహితంగానే అతని రచనలో ఆవిష్కృతమైతే ప్రతీక అతని ఇచ్ఛా సంయోగం కలిగిన పురా గాథల ఒత్తిడి కలిగిన సృజన రీతిలో సమావిర్భవిస్తున్నది. ప్రాచీన ఆది భావాంశాలు కాలక్రమాన ప్రసరిస్తూ, ప్రవహిస్తూ, ఘనీభవించే దశకు చేరు కుంటాయి. ఈ దశను ప్రాగ్రూపావిర్భావ స్థానంగా పేర్కొనవచ్చును. అయితే ప్రవహించే దశయే. అన్ని ప్రాగ్రూపాలు ప్రతీకలు కావు. అట్లాగే అన్ని ప్రతీకలూ ప్రాగ్రూపాలు కావు. కొన్ని ప్రాగ్రూపాలు మాత్రం ప్రతీకల లక్షణం కలిగి ఉండటం కద్దు.

ఈ అంశాలను పరిశీలించడంవలన రచనలను, రచయితలనూ, అంచనా వేయడంలో కొన్ని నూతనాంశాలు వెలికి వస్తాయి. సృజన వ్యాపారంలో రచయిత బహిర్ముఖమైన వ్యక్తిత్వానికి సంపూర్ణ స్వామ్యం లేదు. కావ్యార్థ విచారణలో ఒక రచనలో అంతరంగానే ఎన్నో వైరుధ్యాల అధ్యయనం వల్ల వ్యక్తమయేది రచయిత వ్యక్తిత్వమే కాకుండా సమష్టి అవచేతన కూడా వ్యక్తం కావడంవల్ల తాను జీవించే సమాజం యొక్క పరంపరాయాతమైన వ్యక్తిత్వం ప్రస్ఫుటం అవుతున్నది.

(4, 11 అగస్టు 1985 ఆంధ్రప్రభ.)

(అనంతపురం శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, జాతీయ సదస్సు ఫిబ్రవరి 17, 1985.)

# సాహిత్యంలో యుగ విభజన– దాని పరిమితి

ఏ సాహిత్యానికైనా, ఏ చరిత్రకైనా అధ్యయనం చేయడానికి అది కొనసాగిన పద్ధతులను విశ్లేషించడానికి దానిని సమగ్రంగా చూడడం, అవగాహన చేసుకోవడం అవసరం ప్రవాహనిత్యత్వం లాంటిదే చరిత్రకూ వర్తిస్తుంది. విడివిడిగా ఏ అంశం ఆ అంశంగానే దాని ప్రత్యేకత వ్యక్తిత్వం ఉన్న ఒక వృక్షం యొక్క పరిణామంలో కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పూలు, పండ్లు ప్రాథమికమైన మూలానికి సంబంధించి ఉంటవని మనం అనుకోవటంలో విప్రతిపత్తి ఉండనక్కరలేదు.

చరిత్రను అధ్యయనం చేసేటపుడు ఇటీవలి కాలంలో మార్క్సిజం దృక్పథం వచ్చేవరకు దాని సన్నివేశాలు పరంపరగా తప్ప హేతుబద్ధమైన అనుస్యూతమైన పరస్పర సన్నిహితమైన సన్నివేశాలుగా భావించే పద్ధతి ఏర్పడలేదనే చెప్పాలి. ఒక సన్నివేశానికి ఆధారంగా సమూహాన్ని, సామూహికములైన ఆలోచనల పరిణామాన్ని ఆధారంగా తీసుకోవాలా లేదా ఆకస్మికంగా ప్రకృతిలో ఏర్పడే సన్నివేశాలను ప్రధానంగా తీసుకోవాలా అనేది ముఖ్యమైన ప్రశ్న. ఈ మూడు మార్గాలలోనూ తొలుతది మార్క్సిజం అయితే మిగతాది తత్పూర్వం నుంచి వస్తున్నవి.

ఒక సన్నివేశం జరిగిన తరువాత దాన్ని గూర్చి విశ్లేషించి పూర్వాపర హేతువులను చెప్పడం సులభమే కావచ్చు. కానీ ఏ చరిత్రను స్వభావ నిర్దేశం చేసి భావి కార్యక్రమాన్ని నిర్దేశించడం అంత సులభమైన పనేమీ కాదు. అలా నిర్దేశించిన అట్లా జరిగిన సన్నివేశాలు చాలా అరుదుగానే కన్పిస్తాయి. గడచిన సంవత్సరం సోషలిస్టు దేశాలలో వచ్చిన మార్పులు అంతకుముందు ఊహించినవి కావు. మార్క్సియుల సూత్ర పరిభాషాక్రమంలో భావించినవి కావు.

అయితే చరిత్ర నిర్దేశానికి కేవలం వైయక్తికములైన ఇచ్ఛాశక్తులే ఆధారం అవుతాయా లేక యాదృచ్ఛిక సంఘటనలు కారణమవుతాయా అంటే ఏదీ ఇదమిత్థమని చెప్పడానికి వీలులేదు. అట్లాగే దేన్ని తిరస్కరించడానికీ వీలులేదు. ఈ మూడు అంశాల సమన్వయంతో చరిత్రగతిని అధ్యయనం చేయడం కొంతవరకు సాధ్యము అసలు మానవ సమాజం, నాగరికత, సంస్కృతి, సాహిత్యం, కళలు, శిల్పాలు, సంగీతం, నాట్యం, విజ్ఞానశాస్త్రం ఇవన్నీ మానవుడు కనే కలలలోనుంచి వాస్తవ ప్రపంచంలోకి దిగి వచ్చినవే. కలలు కనేవరకు బాహ్యమైన అంతరమైన హేతువులెన్ని ఉన్నా కలలుకనే వాడు వ్యక్తియే. అవిధముగా భవిష్యత్తు బీజం వ్యక్తి భావనలో మొలకెత్తి ఆనాటికి ఉన్న పరిస్థితులు, అంటే భూతకాలం, అంటే గడచిన కాలం తన చుట్టూ ఉన్న సమాజం దానికి ప్రతిస్పందించే విధము, అంటే వర్తమానం వాటి సహకారం మీద ప్రాకృతికమైన అంశాల అనుకూల్యం పైన ఆధారపడి పెంపొందుతుంది చరిత్ర గతిని సాహిత్య చరిత్రను ఈ సూత్రాన్ని ఆధారం చేసుకుని అధ్యయనం చేయ ప్రయత్నిస్తే అది తన తత్త్వాన్ని ప్రకటించడం సాధ్యపడుతుంది.

అందులోనూ సాహిత్యం ఇతర సృజనాత్మక ప్రక్రియల్లాగే వ్యక్తి ప్రతిభా మూలము. ఈ వ్యక్తిని వదిలేస్తే మూలసూత్రము తప్పిపోతుంది. సాహిత్యంలో అనేక సన్నివేశాలు మౌలికమైన ఈ సూత్రాన్ని పదే పదే వ్యాఖ్యానిస్తాయి. వాల్మీకి కావ్యారంభానికి సంబంధించిన క్రౌంచవధ సన్నివేశం యాదృచ్ఛికమైనా, అది ఎంత ప్రధానమైన ప్రేరణో తెలియచేస్తున్నది. ఇవన్నీ గమనించినప్పుడు ఏ సాహిత్య చరిత్రకైనా, నిర్దిష్టమైన ఏకసూత్రతను వ్యాఖ్యానించడం సులభం కాదు.

భారతీయ భాషా సాహిత్యమును గమనించినపుడు వైదిక కాలంలో ఉపనిషత్తుల కాలంలో, బౌద్ధుల కాలంలో. షడ్దర్శన కాలంలో- ఇతిహాస పురాణముల కాలంలో, కావ్య నాటకముల కాలంలో . ఇలా నిర్దేశించుకుంటూ పోవచ్చు. ఈ మధ్యలో ప్రాకృతము, పాళీ, అర్ధమాగధి వంటి భాషలు బౌద్ధజైనమతాల ప్రవాహికలుగా మారడం చూడవచ్చును. సంస్కృత సాహిత్యాలలో వచ్చిన అనేక పరిణామములు, సన్నివేశాలు ఆనాటి సకల భారత దేశము యొక్క

సాంస్కృతిక చైతన్యానికి ప్రాతినిధ్యం వహిస్తూ ఉన్నవి. ప్రాకృత భాషల యొక్క సాహిత్యం అట్లాగే జైన, బౌద్ధ ధర్మాల ఔన్నత్యాన్ని ప్రకటించడం జరిగింది. ఏది ఏమైనా భారతీయ సంస్కృతీ ప్రవాహానికి ఆధునిక భారతీయ భాషా సాహిత్యాలు ఉద్యమ వికాసం చెందేదాకా సంస్కృతమే ప్రధాన వాహిక అయిందని చెప్పవలసి ఉంటుంది.

సంస్కృత సాహిత్య పరిణామంలో భాసుడు, బాణుడు, భవభూతి, జగన్నాథుడు ఇలాంటి అనేక మంది రచనలు ఆనాటి ప్రవాహ క్రమంకంటే అతీతంగా ముక్తికి ప్రతిభా శిఖరాలుగా కానవస్తున్నాయి. అట్లాగే మరికొంతమంది అవిద్యావంతులు పూర్వం నుంచీ వస్తున్న సాహిత్య ప్రవాహాన్ని దారి మళ్ళించినట్లు కానవస్తున్నది. ఇతిహాసాలు ఏర్పడుతున్న కాలంలో దర్శనాలు రావడం, పురాణఉపపురాణాలు ఏర్పడుతున్న కాలంలో మహాకావ్యయుగం ప్రవర్తించడం, పాణినీయ వ్యాకరణ సంప్రదాయానికి భిన్నంగా కాతంత్రాది వ్యాకరణాలు వెలువడడం ఇలాంటి సన్నివేశాలు సులభంగా సూత్ర నిర్దేశం చేయడానికి ఒదిగేవికావు.

ఈ విద్వద్గోష్ఠిలో ప్రధానాంశమైన ఈ యుగ విభజన సాహిత్య విషయంలో స్థూలంగానే తప్ప సమగ్రంగా సాధ్యమయ్యే అంశం కాదు యుగము అనే మాట కాలానికి సంబంధించినది. ఒక కాలంలో, ఒక ప్రవృత్తి ప్రధానంగా ఉండడం ఆ ప్రవృత్తి, ఆనాటి సాంస్కృతిక కళారూపాలలో ప్రధానంగా సత్యమైన అంశమే, ఈ యుగ ప్రవృత్తికి హేతువైన కాల చైతన్యం సాహిత్యానికి ఆధారమైన వైయక్తిక ప్రతిభా విశేషాన్ని కొంతవరకు ప్రభావితం చేస్తుందనడం సత్యమేకాని అదే అంశం ప్రధానమని చెప్పడం దోషయుక్తమైన విశ్లేషణకు దారి తీస్తుంది.

ఆధునిక భారతీయ భాషాసాహిత్యాల పరిణామాలను ఒకసారి చూస్తే, ఒక్క తమిళ వాఙ్మయాన్ని ప్రక్కకు పెట్టితే మిగిలిన వాఙ్మయాలలో సాహిత్య ధోరణి ప్రధానంగా 10 వ శతాబ్దం చుట్టుపట్ల పెంపొందింది. తమిళ వాఙ్మయం మాత్రం అంతకు వేయి సంవత్సరాలకు పూర్వమే సంపన్నమైన కావ్య సంప్రదాయం కలిగి తొల్కాప్పియమ్, మణిమేఖలై, తిరుక్కురళ్,

ఆళ్వారు కాయన్‌మార భక్తి గీతాలు ఇలా ప్రవాహం దాటుతూ దాటుతూ 10 వ శతాబ్దానికి చేరుకుంటున్నది. క్రీస్తు శకారంభానికే తెలుగు కన్నడ భాషల స్వరూపం ఇంచు మించు రూపొందినట్లు గాథాసప్తశతి మొదలైన వాటి ఆధారంతో నిరూపించే అవకాశం ఉన్నా రెండు భాషలతోనూ సాహిత్యం ఎందుకు రూపొంద లేదు, పెంపొందలేదు అనేది అసమాధేయమైన ప్రశ్న.

ఆనాడు తమిళ దేశంలో తెలుగు కన్నడులకు సన్నివేశాలు, సన్నిహిత సంబంధాలు, రాకపోకలు లేవనే అవకాశం లేదు. ఒకవేళ ఈ భాషల్లో సాహిత్యం ఉండి ఏ ఆధారం దొరకనంతగా నశింపజేయ బడిందనేది కూడా అతి శయోక్తియే అవుతుంది. తమిళులలో శైవ సంప్రదాయాల విజృంభణ తర్వాత కూడా బౌద్ధ వాఙ్మయం ఎట్లా నిలిచిఉందో అట్లాగే కన్నడంలో శైవ వైదిక సంప్రదాయం రూపొందిన తరువాత జైన వాఙ్మయం నిలిచే ఉన్నది. కానీ తెలుగులో అంతకన్న భయంకరమైన వైదిక శైవ సంప్రదాయాలు విజృం భించనూలేదు. అందువల్ల నాటి వాఙ్మయం నశించిందనడం కేవలం ఊహ అవుతుంది. అంటే తమిళంలో వాఙ్మయం మూడు పూవులు, ఆరు కాయలుగా వికసిస్తున్న కాలంలో దాన్ని అనుకొని ఉన్న తెలుగు కన్నడ దేశాలలో సాహిత్య ఆవిర్భావం ఆలస్యంగా జరగడం ఏ హేతువుకు అందని విషయం. కన్నడ వాఙ్మయం తెలుగుకంటే ముందే మేల్కొనడానికి కారణమైన రాజ కీయ మత సంప్రదాయాలు తెలుగు దేశంలో నెలకొనియే ఉన్నవి. కాని, వేంగీ దేశం నుండి వెళ్ళిన కవి పశ్చిమ చాళుక్య ఆస్థానంలో భారతం రాస్తే తరువాత వందసంవత్సరాలు గడిచాకనే వేంగీదేశంలోని పురోకవి తెలుగులో భారతాన్ని ప్రారంభించడం జరిగింది.

భారతీయ భాషా సాహిత్యాల పరిణామం 10 వ శతాబ్దం నుండి 18 వ శతాబ్దం దాకా చూస్తే స్థూలంగా ఈ విషయాలు కన్పిస్తవి:

1. ఈ యుగాన్ని ఆవరించిన ప్రధాన అంశం భక్తి సంప్రదాయం, రామానందులు, కబీరు, వల్లభాచార్యులు, సూరదాసు, తులసీదాసు, విద్యాపతి, చండీదాసులు, లల్లేశ్వరి, జ్ఞానేశ్వర్, నామ్‌దేవ్, తుకారాం, రామదాసు, నానక్ మొదలైన గురు పరంపర; సర్వజ్ఞుడు, అన్నమయ్య, పోతన మొదలైన వాళ్ళు ఈ భక్తి ప్రవాహాన్ని దేశం నిండా ప్రవహింపజేశారు.

2 ఆక్రమించడానికి వచ్చిన ఇస్లాం ఇక్కడి అద్వైత ప్రభావాలతో క్రమంగా ఇతర దేశ భాషా వాఙ్మయాలతో సహా సంప్రదాయ పద్ధతిగా నెల కొన్నది. ఇది దక్షిణ భాషా వాఙ్మయాలలో కానరావడం లేదు.

3. ఇస్లాం నెదిరించడానికి ప్రయత్నించిన వీరుల కథలు వీర గాథలుగా రూపొందాయి. ఈ వీర గాథల్లో క్రమంగా ఇతర వీరులకు సంబంధించినవి కూడా వెలువడటం జరిగింది.

4. భక్తి ధర్మం నిర్మించటంతో సంప్రదాయాలలోని మౌఢ్యమును, డంబాచారాన్ని, కాపట్యాన్ని నిరసించేందుకు అధిక్షేపం కూడా కావ్య వస్తువు అయింది. ఈ అదిక్షేపం తత్త్వ విరహితమైన మూఢ సంప్రదాయాన్ని నిరసించేదే కాని, తత్త్వాన్ని నిరసించేది కాదు. భక్తి పేర డాంబికాన్ని నిరసించేద కాని భక్తిని నిరసించేది కాదు.

5. ఈ కాలంలో వ్యక్తిగతంగా ఆత్మసాక్షాత్కారం పొందిన మహానుభావులు సగుణ నిర్గుణ సంప్రదాయ పరిధులలోనే ప్రాచీన తంత్ర యోగ మార్గాల ప్రభావంతో అనేక సంప్రదాయాలు నెలకొల్పారు.

6. వీరశైవం, నాథ సంప్రదాయం, మహానుభావ సంప్రదాయం, అచల సంప్రదాయం, చైతన్య సంప్రదాయం, సిక్కు సంప్రదాయం మొదలైనవి అత్యధికమైన సారస్వత ఆవిర్భావానికి కారణం అయ్యాయి.

7. సంస్కృతములో ఉండి ప్రజలకు అంతగా అందుబాటులో లేని ఇతిహాస పురాణాలు దేశ భాషల్లోకి పరివర్తితం కావడం ప్రారంభమైంది. రామాయణ భారత భాగవతాలు అనేక భాషల్లోకి విస్తృతంగాను సంగ్రహంగాను అనువదింపబడి పునర్వ్యక్తీకరింపబడి ప్రజల హృదయాలకు చేరువ అయ్యాయి.

స్థూలంగా ఈ అంశాలను చూచినప్పుడు వీటన్నిటివెనుక నూతన సంప్రదాయాలు ఆ కాలంలో వచ్చిన ప్రతిఘటనలకు ఎదురుగా నిలిచి దాన్ని సజీవంగా ఉంచే ప్రయత్నం జరిగినట్టుగా తోస్తున్నది, భక్తిసంప్రదాయం, సమాజంలో వర్ణాల మధ్య ఉండే విభాజక రేఖను చెరిపివేసింది. అప్పుడే క్రొత్తగా వచ్చిన వీరశైవ, నాథ, అచల, సిఖ్ మొదలైన సంప్రదాయాలు బ్రహ్మప్రాప్తికి అధికారభేదం లేదని నిరూపించాయి. కబీరు, సర్వజ్ఞుడు,

జయదేవ్, వేమన మొదలైన అధిక్షేపకవుల రచనలు సంప్రదాయ ప్రవాహం లోని మాలిన్యాన్ని ప్రక్కకు నెట్టుతూ వచ్చాయి.

స్థూలంగా కానవచ్చే ఈ విశ్లేషణలో యుగ విభాజక రేఖ ఎట్లా గీయడం అన్నది ప్రశ్న - అన్ని భాషల్లోనూ సమానమైన ఇతివృత్తాలు, ఆలోచనలు, కావ్యరూపాలు, పరస్పరం ఓతప్రోతంగా కలిసిపోవడం మనం గమనించ వచ్చును. 18 వ శతాబ్దంలో ఆధునిక యుగం వచ్చేదాకా ఆధునిక భారతీయ సంప్రదాయాలలో ఈ సామ్యలక్షణం ప్రస్ఫుటంగా కానవస్తున్నది.

తెలుగు సాహిత్యం విషయానికొస్తే కొన్ని పై లక్షణాలు మినహా పరిస్థితుల మార్పేమీ లేదు, మన సాహిత్య చరిత్రకారులు పూర్వం నుంచి యుగవిభజన చేసేటపుడు కాలక్రమాన్ననుసరించి ప్రాచీన, మధ్యయుగ, అర్వాచీన (ఆధునిక) కవులని ఆయా కాలాలకు పరిపాలించిన రాజ్యాల పేర అంటే చాళుక్య, కాకతీయ, రెడ్డి, విజయనగర, తంజావూరు నామాలలో మూల్య విధానాన్ని ఆశ్రయించిన సమాజం తనలోని అన్ని స్థాయిలలోని వారికి దాన్ని ప్రసారం చేసేందుకు ఛిన్నాభిన్నమైన వాహికలుగా ఈ అభి వ్యక్తీకరణకు ఎన్నుకున్నవి. భిన్నంగా కనిపించే ఈ అభివ్యక్తీకరణలో తాత్త్వికంగా ఒక ఏకాకారం ఉన్నది. అందువల్ల ఈ విధమైన విభజన స్థిర మైనది కాకపోవడం కాలపరిధిలో ఒదిగిపోదు, ప్రక్రియాపరంగా చూచి నప్పుడు ఒక కవిత్రయ యుగంలోనే ఇతిహాస పురాణాలు, ద్విపద కావ్య సంప్రదాయాలు, స్వతంత్ర కావ్యమైన కుమార సంభవం, కథాకావ్యమైన దశకుమార చరిత్ర, పావులూరి మల్లన గణితమూ, విజ్ఞానేశ్వరీయము, ఆంధ్ర భాషా భూషణం వంటి శాస్త్ర గ్రంథాలు, శివయోగం వంటి సాధకుల వాఙ్మయము, కృష్ణమాచార్య వచనముల వంటి విలక్షణ దేశీయ వచనప్రక్రియ మొదలైనవన్నీ కనిపిస్తాయి, దీనితోని ద్విపదకావ్య సంప్రదాయమంతా నన్నయ, తిక్కనలకు పాల్కురికి సోమన రంగనాథులకు నడుమ ఉండే అంతరం కూడా పరిగణించవలసి ఉన్నది.

కాకతీయ సామ్రాజ్యం పతనం అయి సాంస్కృతికంగా సంక్షోభం నెలకొని ఉన్న సమయంలో ఒకవైపు శృంగార నైషధం రాస్తున్న శ్రీనాథుడు,

వేరొకవైపు భాగవతం రాస్తున్న పోతన, మరొకవైపు ప్రజలబాణీలో దూరంగా తిరుపతి కొండమీద కూర్చుండి వేలాది సంకీర్తనలను రచిస్తున్న అన్నమయ్య కనిపిస్తారు. అన్నమయ్య కీర్తనలలోని భాష సముద్రమంత విశాలమైనది. నన్నయాదుల భాషా సంప్రదాయంకంటే అంత్యంత వైలక్షణ్యం కలిగింది. దాని మార్గం చూస్తే తెలుగుదేశంలో నాటి ప్రఖ్యాతములై ఉన్న జానపద వాఙ్మయములోని ధోరణులన్నీ ప్రకటంగా కానవస్తాయి. అయినా వస్తువులో మూల్య విధానంలో భేదం లేదు.

ఒక యుగంలోని వైలక్షణ్యం ఇలా కానవస్తుంటే ఒక యుగంలోనే ఒక వ్యక్తిలోనే ఈ వైవిధ్యాన్ని చూడవచ్చు. పురాణ ఖండాలను ఒక వైపు అనువదిస్తూ, శృంగార నైషధం రచియించి భావికావ్యానికి పునాదివేస్తూ, మరొకవైపు క్షేత్రమాహాత్మ్యాలు కూరుస్తూ ఉన్న శ్రీనాథుడు. పల్నాటి వీర చరిత్రను రచించడం ఒక విలక్షణమైన అంశమే. అంటే అధికార భేదాన్నిబట్టి ప్రతిభావంతుడైన కవి తన అభివ్యక్తిని శిల్పాన్ని భాషనూ అమరుస్తున్నాడన్నమాట. అంటే మూలస్రోతస్సు ఒకటే అయి భిన్న ప్రవాహాలు పారించడం లాంటిది ఈ అంశం.

ఈ అంతరం ఒక ప్రక్రియలో కూడా కానవస్తున్నది శ్రీకాళహస్తి మాహాత్మ్యంలో ధూర్జటి వర్ణించిన ఆటవికుల జీవితం ఇంత స్పష్టంగా మరెక్కడా కన్పించదు. రాయలవారి ఋతువర్ణనలలో కనిపించే ప్రజా జీవన చిత్రం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. మనుచరిత్రలో స్ఫుటమయ్యే ధార్మిక గృహస్థ జీవనానికి స్వేచ్ఛాకామాచారానికి నడిమి సంఘర్షణ ప్రాథమికమైన సామాజికాంశం. అట్లాగే పండితారాధ్య చరిత్రలోని శాస్త్ర చర్చలు ప్రౌఢ గ్రంథాలకు సంబంధించినవి. యక్షగానాలలో కొన్నిచోట్ల కనిపించే చర్చలు సామాన్య ప్రజల్ని ఉద్దేశించినవి కావు.

మహా అల్ప సంప్రదాయాల నడుమ స్పష్టమైన విభాజక రేఖ లేనట్లుగానే ఉన్నంతలో వాటి నడుమ పరస్పరం ప్రభావం చేసుకునే లక్షణం కానవస్తుంది. ద్విపద కావ్యాలు చంపూ కావ్యాలుగా మారడం, తాళ్ళపాక తిమ్మక్క సుభద్రా పరిణయములోని అంశాలు విజయవిలాసంలోకి ఎక్కడం, భాస్కరామాయణంలోకి అవాల్మీకములైన జానపద కథాంశాలు ప్రవేశించడం ఉదాహరణగా తీసుకొనవచ్చును.

అయితే సాహిత్య చరిత్ర అధ్యయనానికి యుగవిభజన అవసరం లేదా? దానికి ప్రయోజనమేమి ఉండదా అన్న ప్రశ్న ఉదయిస్తుంది. స్థూలంగా సాహిత్యంలో వచ్చిన మార్పులను అధ్యయనం చేయడానికి, అభివ్యక్తిలోని పరిణామాన్ని తెలుసుకోవడానికి ఇది ఉపకరించవచ్చు. ప్రాచీన కాలానికి ఆధునిక కాలానికి మూల్యా విధానంలో స్పష్టమైన మార్పుగా వచ్చినట్లు కన్పించేదాకా దీనికి ఎక్కువ ప్రయోజనం ఉండదు. అయితే ఒక్కొకకాలంలో అయా సన్నివేశాలు ప్రతిభావంతులయిన కవుల సృజనలూ, పూర్వకాలంకంటే స్పష్టమైన మార్పును సూచిస్తుంటాయి. ఆ మార్పును గమనించడానికి ఈ యుగ విభజన తోడ్పడవచ్చును.

ఇంతవరకూ జరిగిన విభజన స్థూలంగా కావ్యసంప్రదాయానికే పరిమితంగా ఉంది. ఇప్పుడు దానిని సమస్త వాఙ్మయాన్ని అవరించేదిగా ఎలా విభక్తం చేయవచ్చో ఆలోచించాలి. ఒక్కసారి వస్తూ, వస్తూ ఉన్న మార్పు హఠాత్తుగా ఆగిపోయి పూర్వపద్ధతి సజీవంగా సాక్షాత్కరిస్తుంది. దీనికి వైయక్తికమైన ప్రతిభా ప్రకాశం ఎంతవరకు కారణమో, ఇతరేతర కారణాలు ఏమైన ఉన్నవో అన్వేషించాలి. సాహిత్యాన్ని నిలువుగా చీల్చేదృష్టికాకుండా. అవిచ్ఛిన్నంగా, అనుస్యూతిని కలిగించే మౌలికమైన ఏకసూత్రాన్ని పట్టుకుంటే అది ఆధారంగా ఈ యుగవిభజన సులభం కావచ్చును. కాలమూ తాత్త్వికంగా పారమార్థిక దృష్టిలో సత్యమైనదికాక పోయినా, వ్యావహారికంగా, అది మన జీవితాలను పరిపాలిస్తున్నట్లు ఎట్లా భావిస్తున్నామో, అట్లాగే ఈ యుగవిభజనమూను అధ్యయన సౌలభ్యానికే తప్ప సహృదయుని సాహిత్యసౌధ ప్రవేశానికి ఏ ఆటంకము కల్పించలేదనే విశ్వసిస్తున్నాను.

(హైదరాబాదు విశ్వవిద్యాలయము యుజిసి జాతీయసదస్సు, ఫిబ్రవరి 1990)

# నవ్యకవితారంభము

## 1

"వ్యష్టియనుదానికి వ్యక్తి స్వాతంత్ర్యము కలదా?... వ్యక్తి తన యిచ్ఛను సౌఖ్యమును సమష్టి నిమిత్తము సమర్పింపవలయునా? వలదా? అనునవి ప్రతి సమాజమును గలవరపరచుచున్న సమస్యలు.... వ్యక్తిగత స్వాతంత్ర్యమును సమాజాధిపత్యమునకుగాను ధారపోయవలయునని తెలుపు వాదము సామ్య వాదము అనియు, వ్యక్తిపక్షమును ప్రకటించువాదము వ్యక్తివాదము అనియు వ్యవహరింపబడుచున్నవి. వ్యక్తిని శాశ్వతముగా సమాజమున కధీనమొనర్చుట వలనను, నిర్బంధపూర్వక శిక్షావిధానముల మూలమున గలుగు స్వార్థత్యాగము వలనను ప్రాప్తించు ఫలమునకు మన మాతృభూమి దివ్యనిదర్శనము.... మనో వ్యాపారదక్షత లేదు. హృదయవికాసము లేదు. జీవచైతన్యము లేదు. ఆశా ప్రసారము లేదు. ఇచ్ఛాప్రకోపము లేదు. ఆనందోత్కర్ష లేదు. తీవ్రదుఃఖాను భూతియు లేదు, నిర్మాణ ప్రతిభాసంచలనము లేదు. నూతన తత్త్వజిజ్ఞాస లేదు. నూతన విషయ గుణ గ్రహణమే లేదు. అదేవిధమున త్యాగాశయమే లేని, ఔదార్యమే లేని సదాశయమే లేని సమాజమననేమో తెలియని స్వార్థత్యాగమనగా నేమి?.... జనులను స్వతంత్రులను జేయుడు వారి సంకెలలు విదళింపుడు అనియే నేను ఘోషింతును."[1]

ఈ ఉద్ఘోష స్వామి వివేకానందునిది. ఆయన ఈ శతాబ్దము ఆవిర్భవించు ఉషోవేళలో 23-12-1900 నాడు రాసిన ఒక లేఖలోని కొన్ని పంక్తులు ఇవి. ఇది భారతీయుల అంతరాత్మ పలికిన పలుకులు.

ఆయన మాటలలో ఈ శతాబ్దపు చైతన్యమైన వ్యక్తి నిష్ఠమైన సంఘ పురోగతి సూచితమైనది. కుహనాధర్మము, నిర్జీవ సంప్రదాయము, మానవత

1. శ్రీ వివేకానంద లేఖావళి-II భాగము (అను) చిరంతనానందస్వామి (1950) పే. 207-211.

లేని మతము వివేకానందునిచేత నిరసింపబడ్డవి. ఒక నూత్న చైతన్యద్వారం తెరువబడ్డది. గడచిన శతాబ్దంలో భారతదేశంలో వచ్చిన పునరుజ్జీవన ప్రవాహానికి వివేకానందుడు హరిద్వారం వంటివాడు. సమగ్రమైన తత్కాల చైతన్యంతో ఆయన వ్రాసిన వాక్యాలు ఈ శతాబ్దపు భారతీయ జీవనానికి మార్గదర్శకులుగా ఆధునిక జీవన నిర్మితికి దోహదాలుగా రూపొందినవి.

19వ శతాబ్దంలో భారతదేశంలో నూతన యుగారంభం జరిగింది. రామమోహనరాయ్ నుండి రాధాకృష్ణుని వరకూ గల భారతీయ మహాపురుషుల పరంపర సర్వతోముఖంగా ఈ జీవనమును పునర్నిర్మాణం చేసి జాతిని నవో త్తేజంతో రూపొందించింది.

ఈ నవీన యుగారంభానికి దోహదం చేసిన అంశాలు రాజకీయంగా దేశం అంతా ఒకే ఆంగ్ల ప్రభుత్వానికి ఆధీనంలో ఉండడం- అది కారణంగా పాశ్చాత్య విద్యాసంస్కారాలు మన దేశంలోని యువకులలో ప్రవేశించడం, రైళ్ళు, మిల్లులు మొదలైన ఆధునిక పారిశ్రామిక నాగరకత ప్రవేశించడం, క్రైస్తవ మత ప్రచారకులు తమ మతం ప్రచారం చేసే నిమిత్తం దేశ భాష లనూ, ఇక్కడి సారస్వతాల్ని అధ్యయనం చేసి అనేక నూతనాంశాలను ప్రాచీన గ్రంథాలలోంచి వెలికితీసుకురావడం- ఈ విధంగా మూడు మార్గాలుగా ఈ పురారచనోద్యమం ప్రారంభమయింది.[2] ఈ ఉద్యమం సంఘ సంస్కరణగా, జాతీయ సంస్కారాన్ని అంతటినీ ఒకసారి పునఃపరిశీలించి మళ్ళీ క్రొత్తగా అన్వయం చేసుకునే విధంగా, నూతన జీవన పరిస్థితులకు అనుగుణంగా నూత నాంశాలను గ్రహించే విధంగా రూపొందింది. అన్ని రంగాలతోపాటు సాహిత్య

---

2. పాశ్చాత్య సాహిత్య సంస్కృతుల ప్రభావము భారతీయుల రాజకీ యార్థిక నైతిక జీవితములందు గొప్ప మార్పులను తెచ్చెను. భారతీయుల వేషభాషలు విద్యావిధానము, ఆచార వ్యవహారములు, మతము, విశ్వాస ములు ఒకటననేల సర్వ సంస్కృతి యందును గొప్ప విప్లవము సంభవించెను.

— డా. అక్కిరాజు రమాపతిరావు- వీరేశలింగం పంతులు : సమగ్ర పరిశీలన, (1972) పే. 180.

కళారంగాలలోనూ అనూహ్యములైన మార్పులకు ఈ ఉద్యమం కారణ మయింది. ఈ కొత్తదనం చాలావరకు వంగదేశం భూమికగా అవతరించి మిగిలిన దేశాన్ని ఆవరించింది. క్రమంగా రామమోహనరాయ్, రామకృష్ణుడు, బంకించంద్రచటర్జీ, దేవేంద్రనాథటాకూర్, రవీంద్రుడు, వివేకానందుడూ, శ్రీ అరవిందుడూ, అవనీంద్రనాథుడూ ఇలా మహాపురుషుల పరంపర జాతి చైతన్యముల స్రోతస్సు నుంచి తరంగాలు తరంగాలుగా వెలువడుతూ వచ్చింది. దయానందుడూ, తిలక్, గోఖలే, గాంధీ యిలా మరికొంతమంది ఇతర ప్రాంతాలకు చెందిన మహాపురుషులు కూడా ఈ పునరుజ్జీవనరథం ముందుకు సాగించిన వారే.

ఈ భావధార ప్రధానంగా మన సాహిత్యరంగంలో తెచ్చిన అంశాలు మౌలికమైనవి. తత్పూర్వ యుగాలలో అప్పుడప్పుడూ కలుగుతూ వచ్చిన మార్పులు కేవలం దాని సంవిధానాన్ని, సాహిత్య రూపాన్ని ఒక పరిమితికి లోబడి మార్పు చేసేవి. ఈ ఉద్యమ ఫలితంగా వచ్చిన మార్పులు పునాదులను కుదించేవి. ప్రధానమైన లక్షణం భావనకు సంబంధించింది. తత్పూర్వం సాహిత్యసృష్టికి ఆధారమైంది. సాహిత్య సంప్రదాయంగా రూపుదిద్దుకొన్నదీ ధార్మిక సాహిత్యమూ లేదా సమాజ చిత్త వినోదం కోసం పుట్టిన శృంగార హాస్య సాహిత్యమూ పాశ్చాత్య సాహిత్య ప్రభావంతో నూతన సాహిత్య రూపాలు ఎన్నో సాహిత్యంలో ప్రవేశించాయి. సాహిత్యం జ్ఞానప్రసారకంగా

---

3. The western education broadened the horizon of Indian experience, awakening the country's sleeping soul to the enchantment of sudden life and manifold striving. The spell of agelong indolence was broken and at last the nation found herself endowed with mighty and quissant wings. Almost inevitably every new idea that entered the country due to the impact the west gained currency through Bengal and Bengali.

— D.V.K. Raghavachary- Triveni April 1953 P. 19.

ప్రజలకు దగ్గరగా ఉండేదిగా క్రమంగా రూపొందసాగింది.[4] ఈ కారణం చేత వచన వాఙ్మయం క్రమంగా వృద్ధి పొందింది. ఆదునిక విజ్ఞానశాస్త్ర ప్రభావం క్రమంగా విస్తరించసాగింది. సాంఘిక చైతన్యం, హేతువాద దృక్పథం, భౌతికవాద లక్షణం ఆలోచనల్లో స్థానం ఏర్పరచుకొన్నవి. పాశ్చాత్యులవల్ల మనకు సంక్రమించిన మనో లక్షణాల్లో ప్రజాస్వామిక భావన ఒకటి. క్రమంగా వ్యక్తి గౌరవం పెరిగింది. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే మూడు అంశాలు భారతీయుల చైతన్యంలో ఉజ్జ్వలించాయి. క్రమంగా ఇది స్వాతంత్ర్యోద్యమంగా రూపొందే అవకాశం వచ్చింది.

కొత్తగా ఉదయించిన సాహిత్యప్రక్రియలతో సాహిత్యసీమలు విస్తరించాయి. అనుభూతి వ్యక్తీకరణకు కొత్త ఆకారాలు దర్శనమిచ్చాయి. గీతి కావ్యం, నాటకం, ఏకాంకిక, నవల, చిన్నకథ, జీవితచరిత్ర, స్వీయచరిత్ర యింకా ఎన్నో సాహిత్య రూపాలు. వీటిల్లో నాటకం పూర్వంనించీ ఉన్నదే అయినా దేశభాషల్లోకి సంస్కృతాంగ్లాల్లోంచి దాదాపు ఈ శతాబ్దంలోనే ప్రవేశించింది. అన్ని భారతీయ భాషలలో వలెనే తెలుగు భాషలోనూ ఈ నూతన చైతన్యం వీరేశలింగంవల్ల ప్రవేశించింది.

వీరేశలింగం సాహిత్యసాధన అంతా సంఘర్షణలోనూ, సాధనసామగ్రిని సృష్టి చేయడంలోనూ సరిపోయింది. ఆరంభంలో ప్రాచీన సంప్రదాయాన్ననుసరించి కొన్ని కావ్యాలు రచించినా తన సామాజిక ప్రయోజనానికి వచనమే ప్రధాన వాహికగా స్వీకరించి అనేక రచనలు శరపరంపరగా సృష్టించాడు ఆయన. 19 వ శతాబ్దపు ఉత్తర భాగం - అందులోనూ చివరి పాతిక సంవత్సరాలు ఈ నూతన భావోత్తాల తరంగాలలో తెలుగుదేశాన్ని ముంచెత్తే రచనలు చేశాడు. (ఈ శతాబ్దంలోనూ ఆరంభ వింశతి వర్షాలు దాదాపుగా ఆయన రచన

---

4. "భాషవలని ప్రయోజనమేమి? జనులు తమ యభిప్రాయముల నొండొరులకు తెలుపుకొనుట. భాషలోని గ్రంథముల వలన ప్రయోజనమేమి? తమ భావములను దూరముననున్నవారికి రాబోవు తరములవారికి సులభముగా తెలుపుట."

(కం. వీరేశలింగం) వీరేశలింగం : సమగ్ర పరిశీలన. పే. 328.

కొనసాగింది.) పాతిక సంవత్సరాల కృషి సాహిత్యరంగంలో నూతన కవితావ తరణానికి అదను సమకూర్చింది. 1887 లో 'సరస్వతీ నారదసంవాదము' తెలుగు కవిత్వం మారవలసిన స్థితిని చాటిచెప్పే వ్యంగ్య రచన. ప్రబంధాల బంధాలలో నలిగే సరస్వతి విషాదం ఆ కావ్యం. అంతకు పూర్వం (1876) అభాగ్యోపాఖ్యానం అనే ఒక అధిక్షేపకావ్యం వ్రాశారు. ఈ కావ్యం ప్రబంధాల లోని వర్ణనలను,శృంగారాన్నీ ఇంకా ఇతర అంశాలకు పేరడీ చేస్తూ వెక్కిరించే నూటపదహారు పద్యాలుగల ఏకాశ్వాస ప్రబంధం. ఈ రచనలు రెండూ అంత వరకూ సాగివస్తున్న నిర్జీవ కవితాప్రవాహానికి అడ్డుకట్టలు అయితే కావ్య రంగంలో నూతన లక్షణాలు ఆవిష్కరింపబడటానికి మరి కొంతకాలం ప్రయ త్నాలు కొనసాగవలసి వచ్చాయి.

ఇదేకాలంలో తిరుపతి వేంకటకవులు సాహిత్యరంగంలో ప్రవేశించారు. నానారాజ సందర్శనం చేస్తూ అవధానాలుచేస్తూ వారి జైత్రయాత్ర కొనసాగింది. పద్యానికి ధారాశుద్ధి, వ్యావహారిక శబ్దాలు కవిత్వంలోకి ప్రవేశించడం, పద్యంలో కృత్రిమాలంకారాలు, ఆడంబర సమాసాలూ తగ్గిపోవడం, ప్రవాహ ప్రాయమైన వచనంలాగానే పద్యమూ సాగిపోవడం యీ కవులు తెలుగు కవి త్వానికి ప్రసాదించిన గొప్ప గుణాలు. శ్రవణానందం,పాణిగృహీతవంటి కావ్యా లలో ప్రాబంధిక లక్షణాలు కొన్ని ప్రవేశింపకపోలేదు.[5] ఈ కవుల రచనలు 'ప్రాచీన కవితకు భరతవాక్యము, నవీనకవితకు నాందీవాక్యము'గా ప్రశంసింప బడ్డాయి. అద్యతనాంధ్రకవిప్రపంచ నిర్మాతలైన ఈ కవుల ఆదానము నవ్య కవిత్వానికి అంతోయింతో లేకపోలేదని భావించవలసి ఉంటుంది. 'నవ్యకవు లలో విశ్వనాథ సత్యనారాయణ, పింగళి–కాటూరి కవులు,నాయని సుబ్బారావు గార్లు తిరుపతి వేంకటకవుల శిష్యకోటిలోనివారే కాబట్టి గురువులు వేసినముద్ర వారి మనస్సులను పూర్తిగా విడిచిపెట్టిందనుకొనే వీలులేదు. ఈ ద్వారా నవ్య

---

5. వీరి కృతులయందు నవ్యత్వము భవ్యత్వము నంద లేదు. వస్తువులా పురా తనములు ఛందస్సులా శతధాపరిక్షుణ్ణములు .... శ్రవణానందాదులు సద్యోనిర్వృతిని కలిగించుచున్నను ఉపదేశమహనీయములు కావు.... కవిత్వమును వీరు పాండిత్యాటవినుండి యుద్ధరించిరి– ఖండవల్లి లక్ష్మీ రంజనం–తెలుగు విజ్ఞాన సర్వస్వము III పే. 621.

కవిత్వం బహు స్వల్పంగానైనా తిరుపతి వేంకటకవులతో జన్యజనక భావం కలిగి ఉంది'[6] అంటున్నారు కె. వి. రమణారెడ్డి గారు. నవ్యకవిత్వానికి కారకులు కాకున్నా ప్రేరకులుగా చాలామంది విమర్శకులు ఈ కవులను భావిస్తున్నారు.[7]

ఈ శతాబ్దారంభానికే వ్యావహారిక భాషావాదం ప్రవేశించింది. వీరేశలింగంకంటే కొంచెం ముందుకుపోయి భాషా విషయంలోనూ సంస్కరణ భావించిన గిడుగు రామమూర్తి - గురజాడ అప్పారావువంటి ప్రయోగశీలుడూ భావుకుడూ కాలచైతన్యాన్ని తనలో స్పందింపచేసుకోగలిగిన వ్యక్తి తోడ్పాటులో శ్రీకృష్ణుడు అర్జునుడితోసహా యుద్ధరంగంలో ప్రవేశించినట్లు ప్రవేశించాడు కన్యాశుల్కం ప్రథమ ముద్రణ వెలువడింది. వేదం వేంకటరాయశాస్త్రి పాత్రోచిత భాషాప్రయోగంతో ప్రతాపరుద్రీయం వెలువడింది. ఒక సామాన్య జన జీవనంలోని ఇతివృత్తం ఆధారంగా 1900 సంవత్సరంలో ముసలమ్మ మరణం అన్న చిన్న కావ్యం కట్టమంచి రామలింగారెడ్డి రచించడం జరిగింది.

ఈ శతాబ్దం తెలుగు సాహిత్యక్షేత్రంలో ఈ విధంగా నూతన లోకాలకు స్వర్ణ కవాటాలను తెరుస్తూ ప్రారంభమయింది. 'వెండి గొలుసులు లంకెవేసి ప్రచండమగు నీ నీలి తెరలను తూర్పువాకిలి తలుపురెక్కల తొలగలాగెద రెవ్వరో?"[8]

---

6. కె. వి. రమణారెడ్డి - మహోదయం 1989 పే. 472.
7. Tirupati Venkata kavulu rescued Telugu Poetry from the decadent classieism of the early ninetee-nth century. they brought the muse from out of the courts of chieftains and the coteries of Pandits to the newly awakened population of Andhra. And they made posible the lyric outbirst of Raya-prolu Subbarao .... K. Ramakoteswara Rao Swata-ntra - 8 May 1954.
8. రాయప్రోలు సుబ్బారావు - కావ్యకంఠిక (1953) పే. 78.

## 2

ప్రథమంగా నవ్యకవిత్వమంటే యేమిటో నిర్వచించుకోవాలి. గత శతాబ్దానికీ, వర్తమాన శతాబ్దానికీ సంధిలో నిలుచుని మనం ఈ ప్రశ్న వేసుకుంటే - అప్పుడే పాశ్చాత్య దేశాలలో విజ్ఞాన సూర్యుని ప్రకాశం - ప్రాచ్య దేశాశాలలో అప్పుడప్పుడే ఆ కిరణాల వెలుగులో కళ్ళు నులుముకుంటున్న ప్రజలు కనిపిస్తారు. ఆత్మ విస్మృతి పొందిన ఈ ప్రజలకు తమ తమ దేశాల్లో ఉన్న జీవన చైతన్యసంపద గోచరించింది. ఇంకా తమకు నిద్రతో, నిద్రకు కారణమైన తమోనివహం తొలగిపోతూ కనిపించింది. ఆ దిక్కుమీద ఒక మమకారం, ఒక ఆర్ద్రత, అనుకరణ భావమూ ఏర్పడ్డవి.

ఈ సందర్భంలో నవ్యత అనేది ఏ ఒక్క వ్యక్తిలోనూ ఆవిష్కృతమైందని చెప్పడం కష్టం. ఆ ఒకానొకచోట అది అధికదీప్తితో ప్రకాశించి ఉండవచ్చు. పాశ్చాత్య విజ్ఞాన ప్రభావంచేత మన మనస్సులన్నీ ఒకానొక నవీన దృష్టినీ, హేతువాదాన్నీ అలవరచ్చుకొన్నవి. శతాబ్దాలుగా, సహస్రాబ్దాలుగా యథాతథంగా అంగీకరిస్తూవచ్చిన అంశాలు అన్నీ ప్రశ్నలకు గురిచేయబడ్డవి. నూతన పరిస్థితుల్లో వాటి యోగ్యతను ఔచిత్యాన్నీ ప్రశ్నించడం జరిగింది.

అయితే ఈ ప్రశ్నవేయడం జరిగింది కాని సమాధానం ఒకేవిధంగా ఉండదు. ఒకచోట సంపూర్ణ తిరస్కారం. ఒకచోట అది ఇంకా సజీవంగా ఉండటం కారణంగా పునఃస్వీకారం నూతనాంశాలతో సమన్వయం, నూతన పరిభాషలో వ్యాఖ్యానించడం. ఈనాటి భావాలను ఆనాటి పరిభాషలో చూడటం- ఇలా అనేక విధములైన ప్రక్రియలు ఈ సందర్భంలో జరిగాయి. భారత దేశానికి ఉన్న సంపన్నమైన సహస్రాబ్ద పర్యంతమైన ఉజ్జ్వల జీవనవైఖరి అంత సులభంగా తిరస్కార్యం కాలేదు. పునరుజ్జీవదశలో అది మళ్ళీ పునారచన పొందింది.

ఈ నూతన అన్వయం ఇంతకు పూర్వం ఉన్న భేదాలను బ్రద్దలుకొట్టి ఐక్య భావాన్ని ఒక సామ్యలక్షణాన్ని నెలకొల్పింది.[9] గాలిబ్ కవి ఒకానొక పర్షియన్ గీతంలో ఇలా అన్నాడు: "ఈ అంధకార రాత్రులలో ఉషస్సును గూర్చిన శుభవార్త చెప్పారు వారు. వారు వెలిగే దీపాన్ని ఆర్పారు కాని సూర్యుడి వైపు చూపారు. కిరీటంలో మౌక్తికాన్ని లాక్కున్నారు కాని దానిని జ్ఞానానికి జతకూర్చారు.[10]" ఇది ఆనాటి భారతీయ రచయితయొక్క సామాన్య భావన. పాశ్చాత్యదేశాలనుంచి సంక్రమించిన నూతనాంశం ఎంతో అమూల్యమైంది. భారతీయులు కొద్దికాలంలోనే అది తమ సంస్కారంలోని ఒక భాగమేనని గుర్తించారు. వారి సభ్యతలోని కొంతకాలంగా పక్షపాతంవల్ల పడిపోయిన అంశమే అది. ఇప్పుడు స్ఫుటమైన రెండంచులు భూమీ, ఆకాశం, వస్తువూ, చైతన్యమూ- హేతువూ సంబుద్ధి (Intution), వ్యక్తి, సమాజమూ, ఈ అన్నింటి ద్వంద్వాల సమష్టి సమన్వయమే భారతీయ సంస్కృతిహృదయంలో ప్రధానాంశం - అప్పటికే మేల్కొన్న జాతీయభావన కఠినమైన పరదేశ పాలన చేత దోపిడిచేత - ఈ చైతన్యంవల్ల బలపడింది.[11]

మానవ జీవనతత్త్వం ఎప్పుడూ పరిణామలక్షణం కలది. మనిషితోపాటు అతనికి సంబంధించిన అన్ని అంశాలూ పరిణామం పొందుతూ వుంటవి. భౌతిక జీవనంలో మార్పు మనోమయ జీవనంలో మార్పు పరస్పరమూ అనుబద్ధములై

---

9. .... ఇలా రెండు శాఖలు ఒకటి భోగలాలసా ప్రధానంగామూ, మరొకటి భక్తి వైరాగ్య ప్రధానంగానూ విడివడ్డాయి. శ్రీనాథ పెద్దనలూ, పోతన వేమనలూ వేరు వేరు శాఖలకు చెందారు. ఇదే శాఖా వైవిధ్యం. కాని జాతీయ పునరుజ్జీవన మహోద్యమంతో పై ఉభయ పాక్షికతలూ వాటి వివిధశాఖలూ బద్దలై పోయినవి. నూత్న సాంఘికోద్గమనం సాహిత్య రంగంలోని వర్గపరిమితుల నధిగమించి ఒక వినూత్న ఏకత్వ స్వభావాన్ని ఆవిష్కరించింది - పాములపర్తి సదాశివరావు-భారతీయ సాహిత్య పరిణామాలకు పరిశీలన (1958) పే. 53.
10. Literatures in Indian Languages - Ed. V. K. Gokak (1958) P. 30.
11. Ibid P. 31.

ఉంటవి. మానవుడిలో బీజ రూపంగా పూర్వం నిద్రాణస్థితిలో ఉన్న అంశాలు తరువాతికాలాలలో వికసనం చెందుతాయి. ఈ వికసనలక్షణం ఒక అనుస్యూతి కలిగి ఉంటుంది. అయితే బాహిరంగా వచ్చేమార్పు అనూహ్యమైందీ, అతివేగ మైందీ అయినప్పుడు మానవుడు ఉక్కిరిబిక్కిరి కావడమూ పరిణామం ఎడల ఘర్షణ పడటమూ తప్పనిసరి. అప్పుడు అది సామాన్యంగా సాగిపోయినట్లుగా నిశ్శబ్దంగా సాగిపోదు.

సమాజంలో ఆనాటి మార్పును గురించి మల్లంపల్లి సోమశేఖరశర్మ యిలా అన్నాడు: "అంతటితో అంతవరకు గాఢ నిద్రాపరవశమైవున్న మన సంఘం అతని (వీరేశలింగం) పిలుపులకూ, మేల్కొలుపులకూ, కూకలకూ, కేకలకూ అదరిపడి దద్దరిల్లి లేచింది. అహవనీయాగ్ని చ్ఛటవలె తాను పాకినంత మేరా ఒక మహాసాంఘిక విప్లవం ప్రావృట్కాల పయోధరమాలికలాగా గర్జిస్తూ పునీతం చేసింది."[12]

ఈ పరిస్థితివల్ల హేతువాదానికి గురిచేయబడ్డవి - విగ్రహారాధన, వర్ణ వ్యవస్థ, అస్పృశ్యత, పురాణేతిహాసాల సత్యత్వము, వేదముల అపౌరుషే యత్వము ఇత్యాదిగా అనేకాంశాలు. వీటిలో తత్పూర్వము సంస్కర్తలు బసవేశ్వర రామానుజాదులు కొన్నింటిని కొంచెం విమర్శిస్తూ మార్పుచేస్తూ వస్తున్నా మౌలికమైన పరివర్తనకు కారణం కాలేదు. పాశ్చాత్య విద్యాద్వారాన ఇతర ప్రపంచం- ఎన్నో విధాల పురోగతిని పొందిన ప్రపంచం సాక్షాత్కరించి ఆత్మపరిశీలనకు హేతువయింది. ఈ విచికిత్సలో ఈ విజిజ్ఞాసలో నవ యుగం సాక్షాత్కరించింది.

ఆధునిక కవిత్వము, నవ్య కవిత్వము, అభినవ కవిత ఇత్యాదిగా ఎన్నో పర్యాయ పదాలలో ఆధునిక కవిత్వాన్ని మన సాహిత్యంలో వ్యవహరిస్తూ వచ్చారు. రాయప్రోలు వారు అభినవ స్వరకల్పన కుద్యమించితినని చెప్పారు. ఆయన ఆ కవితను అభినవ కవిత అని వ్యవహరించారు.

---

12. కె. వి. రమణారెడ్డి మహోదయం - (1969) పే. 53.

"సాహిత్యమంటే ఒక జాతి సంస్కారం. మన జాతి పూర్వం వక గొప్ప సంస్కారదశను పొందింది. సృష్టిక్రమంలో, సృష్ట్యాదినుండి కాలనిర్ణయంలో భిన్న రాజచరిత్ర నిర్ణయంలో, సంఘ ధర్మ నీతులలో, ఆర్థిక రాజకీయాలలో, సారస్వత పథాలల్లో వక విశిష్టమైన సంస్కారంతో కూడిన సిద్ధాంతాలమీద మన జాతి నడిచింది. ఇవ్వాళ ఆంగిలేయులు మన్ని ఆక్రమించటంచేత ఆ మహాసంస్కారంమీద అభిమానం పోయింది. పాశ్చాత్య దేశీయుల సంస్కారం మీద అభిమానం ప్రబలింది. ఏతదభిమాన పురస్కృతములైన భాషాతత్త్వం, చరిత్ర నిర్మాణం, సృష్ట్యాది కాలనిర్ణయం, సంఘధర్మాలు, విశ్వాసాలు వీటిని ఏ ఏ గ్రంథం పరామర్శిస్తుందో అదంతా నవ్య సాహిత్యం" ఇది విశ్వనాథ సత్యనారాయణ నవ్యసాహిత్యానికి చేసిన నిర్వచనం.[13]

ఈ నిర్వచనం ఆధునిక సాహిత్య నిర్మాణానికి కారణమైన మనో లక్షణాన్ని స్ఫుటం చేస్తుంది. ఈ రెండు సంస్కారాలమధ్య సంఘర్షణ కలిగింది. సాహిత్యం - ఈ సంస్కారాల సంఘర్షణను చిత్రిస్తుంది. అయితే పై నిర్వచనంలో పాశ్చాత్య సంస్కారంమీద అభిమానంతో రచింపబడ్డ గ్రంథాలు మాత్రమే నవ్యసాహిత్యమనీ, అవి విధిగా భారతీయ సంస్కారాన్ని త్రోసి రాజనవలసి ఉంటుందనీ భావించరాదు. ఏతదభిమాన పురస్కృతములు' అంటే ఈ కొత్త సంస్కారం, దానినిగూర్చిన విచారణతోడి గ్రంథాలు. అవి భారతీయ సంస్కారాన్ని ఈ కొత్త సంస్కారమనే నికషంమీద ఒరిపిడి పెట్ట వలసి ఉంటుంది. తత్పూర్వంలాగా యథాతథంగా ఉన్నది ఉన్నట్లుగా అంగిక రించడం ఆధునిక సాహిత్యలక్షణం కాదు. 'కట్టుబాట్లకులోనయి బహిర్వ్యాప్తిని కోల్పోయిన సర్జనశక్తులు నేడు సంకుచితమునుండి వెలికురికి ఆత్మోచిత కార్య కల్పనకు సిద్ధములైనవి'[14] అన్న దువ్వూరి రామిరెడ్డిగారి మాటలు ఈ అభి ప్రాయమునే బలపరుస్తున్నవి. ఇంతకాలము మన సాహిత్యం తరతరాలుగా వస్తూవున్న గతానుగతికములైన మర్యాదల నాశ్రయించి నిర్జీవమై పడి ఉన్నది. ఈ నూతన సంస్కారం దాన్ని పునః జీవింపజేసి నూతనోత్సాహంతో ముందుకు సాగేట్లు చేసింది.

---

13. విశ్వనాథ సత్యనారాయణ : నవ్యసాహిత్య పరిషత్తు, సప్తమ వార్షి కోత్సవాధ్యక్షోపన్యాసం. భారతి, ఏప్రిల్ 1940.
14. దువ్వూరి రామిరెడ్డి – కవికోకిల గ్రంథావళి-4 (1959) పే. 178.

తెలుగుభాషలో ఆధునిక కవిత్వానికి బాహిరమైన ప్రేరణలు రెండు - పాశ్చాత్య సాహిత్య సంస్కారము, స్వదేశంలో సాగుతూ వున్న స్వాతంత్ర్యోద్యమము. అంతరంగా ప్రేరణలు రెండు - క్షీణప్రబంధయుగంలో శిథిలమైపోయిన తెలుగు కవిత్వానికి కొత్త సంవిధానాన్ని అభివ్యక్తినీ కూర్చడం, ఎప్పుడో కోల్పోయిన జాతి ఆత్మను అన్వేషించి దర్శించి దాన్ని మళ్ళీ కవిత్వంలో పునఃప్రతిష్ఠించడం. ఈ చతుర్విధ ప్రేరణలు కారణంగా కొనసాగిన అభినవ కవిత ప్రధానంగా సాహిత్యంలో ఉదారవాదాన్ని ప్రవేశపెట్టింది. లాక్షణికులు విధించిన సంప్రదాయ సారస్వత నియమాల సంకెళ్ళనుంచి తప్పించి కవిని స్వేచ్ఛగా పాడుకొమ్మని చెప్పింది. విస్మృతమైన తన పురావైభవాన్ని స్మరిస్తూ కీర్తిస్తూ ప్రేరణ పొందుతూ వర్తమానానికి దాన్ని పునాదిగా ఆత్మవిశ్వాసం కలిగేందుకు కారణంగా చరిత్రను వర్తమానకాలపు చైతన్యంలో స్పందింపజేస్తూ రచింపజేసింది. సౌందర్యానికి కొత్తదనాన్ని చేర్చి దాన్ని ప్రకృతి అంతటా అన్వేషించేట్లు చేసింది. కొందరిలో దుఃఖభూయిష్ఠమైన వర్తమానంనుంచీ, వాస్తవాన్నించీ దూరంగా పలాయనం చిత్తగించేట్లు చేసింది. ఈ లక్షణాలు అన్నీ దాదాపు పాశ్చాత్య దేశాల్లో రొమాంటిక్ ఉద్యమంలో సంభవించినవే.

ఈ ఉద్యమంలో సంప్రదాయంకంటే సామాజిక ఆచారాలకంటే వ్యక్తి ప్రధానం. కల్పనకు ప్రాచుర్యం ఒకవైపు, వాస్తవ దృష్టికి ప్రాధాన్యం వేరొకవైపూ లభించింది. మానవానుభూతులకు కేంద్రంగా వ్యక్తిని స్థాపించి వస్తునిష్ఠతకంటే ఆత్మాశ్రయత లేదా వ్యక్తినిష్ఠ ప్రాచుర్యంలోకి వచ్చింది.

మార్పుల విషయంలో కవిత్వంకంటే ఇతర సాహిత్యప్రక్రియలు కొంత వేగంగా సాగిపోయినవి. మార్పుల విషయంలో 'కాలధర్మానుగతమై జగత్ప్రవృత్తి మారునపుడు వాఙ్మయమును మారు నిజము' అని రాయప్రోలు పేర్కొనడం జరిగింది. కొత్త భావాలు కొత్త రీతులు రావడం తప్పనిసరి అని ఆయన మతం. ఈ మార్పు క్రమంగా జాతీయ జీవనంతో అన్వయం పొందుతుందనీ, పాతలో సజీవమైందంతా మిగులుదుందనీ, అలాగే నవీనతలోని తీవ్రత క్రమంగా సంప్రదాయంతో సర్దుకుపోగలదనీ ఆనాటి కవులు చాలామంది భావించారు. ఈ అన్వయాన్ని రమ్యాలోకం యిలా ప్రపంచిస్తున్నది:

వాణి వాయింప మ్రోగిన వీణమీద
పారశీక గీతంబులు పలుకమనెనె?
ఋషుల నీవారములు పలియించినట్టి
పొలములందు గులాబీలు పూయమనెనె?

ప్రాచీనంగా వస్తూవున్న కట్టుబాట్లు తెగడంతో కవికి మొదట లభించింది స్వేచ్ఛ. తన భావాన్ని, వర్ణ్యవస్తువునీ ఏదో ఒక కావ్యం యొక్క నిర్మితిలో బంధించవలసిన అవసరం లేదు. దాన్ని యథాతథంగా వర్ణిస్తూ పోవచ్చు. ఒక కథాసూత్రము ఆద్యంతముగా ఉండవలెననే నియమం తొలగిపోయింది. దీంతో పాటు కావ్యంలో నియతంగా ఆచారంగా వస్తూవున్న అవతారికలూ, అష్టాదశ వర్ణనలూ తొలగిపోయాయి, కిరీటాలూ క్రీడా పర్వతాలు - తేనె కాల్వలూ, పుప్పొడి వంతెనలూ- నాయికల అష్టాంగ వర్ణనలూ, శబ్దార్థాలంకారాల అనుచిత ప్రకీర్ణకాలు ఇవన్నీ తొలగిపోయి అంతా ఒకేసారి కొత్త లోకంలోకి ప్రవేశించి నట్లయింది కవికి. కావ్యంలో తాను అభివ్యక్తం చేసే భావానికి వేరే ఎవరో వ్యక్తిముఖంగా పలికే అవసరం లేదు. తానే నాయకుడు. మనస్సు లోలోతుల్లోకి తరచుకుపోయి ఆ ఊహలన్నీ యథాతథంగా వెలువరిస్తూ వచ్చాడు కవి.

ఇంతదాకా సాగుతూ వస్తూవున్న భాషకూడా అతనికి అసంపూర్ణమైన ఉపకరణంగా భాసించింది. ఛందస్సుకూడా అనవసరంగా భావాన్ని పలుచబడేసేందుకు, దీర్ఘంగా చెప్పేందుకు తప్ప తనకు అవసరమైనట్లుగా పనికి రాదేమో ననిపించింది. కొత్తకవి భాషను అంతా రూపుమార్చేశాడు. అరిగిపోయిన మాటలనూ, పదబంధాలనూ పరిహరించాడు. కొత్త పదబంధాలను, సమాసాలనూ రూపొందించుకున్నాడు. కవిత్వంలో వచనత్వం తగ్గించి అనుభూతి ప్రాధాన్యానికి సూచకంగా మృదుసరళ వర్ణాల ప్రాచుర్యం గల మధుర రీతిని స్వీకరించాడు. 'శ్రవణదారుణములు శిరీషప్రసన్న భావబాధకములు రసభంజకములునైన విషమశబ్ద స్నేహమనుఘటిల్ల దమృత మయమైన సుకవి సూక్తమున నెపుడు' (రమ్యాలోకము) అని ఒక ప్రత్యేక రీతిని అలవరచు కొన్నాడు. వేరొకవైపు జానపదగేయాల్లో ఉండే సరళమైన అక్లిష్టమైన భాషను-వ్యావహారికాన్ని తెలుగు కవిత్వంలో ప్రవేశపెట్టే ప్రయత్నం జరుగుతున్నది.

నవ్యకవిత్వానికి గీతపద్యమూ, ముత్యాలసరమూ ప్రధానచ్ఛందోరూపాలుగా ఏర్పడ్డవి.[15] అంటే నవకవులు వృత్తులు ఇతరచ్ఛందస్సులు వాడలేదనికాదు.

ఏ ఉద్యమమైనా ప్రవాహదశను పొందేందుకు ఏ ఒక్కవ్యక్తో కారణం కాడు. కొందరు పరంపరయా కారణాలుగానూ, మరికొందరు ప్రత్యక్షంగానూ కారణం కావచ్చును. వీరుల జన్మమూ, ఏరుల జన్మమూ తెలియడం కష్టమే అన్నట్లు ఇలాంటి ఉద్యమాల మూలపురుషుణ్ణి ఖచ్చితంగా ఇతడే అని చెప్పడం కొంచెం చాదస్తమే. సమష్టి చైతన్యం బహుముఖాలుగా విస్తరిస్తూ ఉంటుంది. నాటి కవిమీద ప్రధానంగా వీరేశలింగం భావోద్యమం గిడుగు భాషోద్యమం ఈ రెండూ ప్రభావం వేశాయి. గురజాడ అప్పారావు నవకవితా సృజనచేస్తూ ఇలా అంటున్నాడు. "తెలుగులో నవ్యరీతులకు నూతన ప్రమాణాలకు ప్రయత్నించిన మొదటి కవిని నేనే. నా కావ్యకళ నవీనం, కావ్య యితివృత్తాలు భారతీయం. కవితలో నేను ఉత్తమ ప్రయోజనాలను ఉపలక్షించాను. జీవితాన్ని నూతన దృక్పథంలో దర్శించి కథా, కవితారూపంలో దాని తత్త్వాన్ని అన్వయించడానికి ప్రయత్నించాను."[16] కావ్యకళ నవీనం, ఇతివృత్తాలు భారతీయం అనడంలో ఆయన మనస్సులో ఉన్న కవితాస్వరూపం సాక్షాత్కరించుకోవచ్చు. పడమటి సారస్వతపు వెలుగుల్లో స్ఫురించిన నూతన కళాస్వరూపాలను తెలుగులో ప్రవేశపెట్టి- యితివృత్తం సమాజంలో వస్తూవున్న భావ విప్లవానికి సంబంధించింది. అది సమకాల సమాజంలోనిది కావచ్చు. లేదా పురాణాదుల్లో ఉన్నదైనా కావచ్చు- అయితే దానిలోని కేంద్ర సమస్య అప్పుడు సజీవ చైతన్యం కలదిగా ఉండాలి. అంతేకాక దాని తత్త్వం సార్వకాలిక మానవతా లక్షణం కలదై ఉండాలి. భారతీయ భాషల్లో నవకవితాసృష్టి ప్రారంభమయ్యే నాటికి గాంధీయుగం ప్రారంభం కాలేదు. అంటే జాతీయోద్యమం సామాన్య

---

15. నవ్యాంధ్ర కవిత్వమునకు ముందు దారితీసినది తేటగీతము-
వోరి నరసింహశాస్త్రి - 'తెనుగుతోట'కు పీఠికలో ఆంధ్రభారతి అంతకు ముందటి అలంకార భారమును డుల్చివేసి ముచ్చటగా ముత్యాల సరాల నలంకరించుకొన్నది. .... డా॥ సి. నారాయణరెడ్డి, ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయము ప్రయోగములు. (1967) పే 207.

16. కె.వి. రమణారెడ్డి- మహోదయం (1969) పే. 7.

జనుల స్థాయికి దిగిరాలేదు. ఇంకా సంఘ సంస్కారోద్యమమే ప్రధానంగా కొన సాగుతూ వున్నది. ఈ ఉద్యమానికి వ్యక్తి మూలం. వ్యక్తి స్వేచ్ఛా వికాసాలే మానసిక పురోగతి లక్ష్యాలు. ఈ మానవ మహోద్యమానికి భారతీయ వాఙ్మ యంలో శిఖరంగా నిలిచినవాడు రవీంద్రుడు.[17] రవీంద్రునికి నోబెల్ బహు మానం ద్వారా ప్రపంచ ఖ్యాతి రావడంతో భారతీయ సాహిత్యాలలో అతని ముద్ర ప్రధానంగా ప్రసరించడం మొదలయింది 1910 తరువాత. తరువాత దాదాపు రెండు దశాబ్దాలు కవులెవ్వరూ ఆయన ప్రభావంనుంచి తప్పించుకోలేక పోయారు.

తెలుగు కవుల్లో రాయప్రోలు, అబ్బూరి రామకృష్ణరావు ప్రత్యక్షంగా రవీంద్రుని సంస్కారం పొందినవాళ్ళు, కృష్ణశాస్త్రి, విశ్వనాథ, వేదుల, నాయని, నండూరి మొదలైన కవులంతా అప్రత్యక్షంగానైనా ఆయన కావ్యాలవల్ల ప్రేరణ పొందినవాళ్ళు ఈ కవులకంటే ముందే రవీంద్రుని సాంగత్య పరి చయం కలవాడు గురజాడ అప్పారావు.

అయితే వర్డ్సువర్తు, కాలెరిడ్జి, షెల్లీ, కీట్సు బైరన్‌వంటి ఆంగ్లకాల్పనిక కవుల ప్రభావం క్రమంగా తెలుగు కవులమీద పెరుగుతూ వచ్చింది. ఇంకా ఓమర్ ఖయ్యాం ప్రభావంకూడా మన కవులమీద పడ్డది. రాయప్రోలు, దువ్వూరి మొదలైన కవులు ఆయన రచనను ఆంగ్ల, పారశీకాలంచి తెలుగులోకి తెచ్చారు.

ఇందరు కవుల ప్రాబల్యం ఉన్నా అందరిలోనూ రవీంద్రుని ప్రభావం కవులను ఔపనిషదమైన విచారణశీలంతో నిలిపి ఉంచింది. స్వతంత్ర బుద్ధి, దుఃఖాభిభూత ప్రేమ భావనము ఈశ్వరారాధనము అనే నాల్గుపాయల్లో ప్రవ హించిన భావకవిత్వం ముఖ్యంగా చివరకు భారతీయ తాత్త్విక చైతన్య పరం పరతో ఐక్యం పొందింది.[18]

---

17. దేవులపల్లి కృష్ణశాస్త్రి- పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము- భారతి, జనవరి 1949.

18. స్వతంత్ర బుద్ధితో లోకములో సంచరించి దుఃఖముల పాలై ప్రేమ వలనను సంపూర్ణ శాంతి పొందలేని మనుష్యులకు ఒక్కటే శరణము. అది ఈశ్వరారాధన- శివశంకర శాస్త్రి, కృష్ణపక్ష సింహావలోకనము.

నా కావ్యకళ నవీనం, కావ్య యితివృత్తాలు భారతీయం అన్న గురజాడ మాటలు నవ్యకవితాస్వరూపం. దాని అంతస్తత్వాన్ని వ్యాఖ్యానం చేస్తాయి. "సాహిత్యం పురాణేతిహాసాలను విడిచి జీవితంలోనుంచి పైకుబికే ఒక జీవనదిగా వెలువడనారంభించింది. భారతీయ సంస్కృతితోపాటు పాశ్చాత్య కాల్పనిక సాహిత్యప్రభావాన్నికూడ స్వీకరించిన భావకవులు పూర్వసాహిత్య రూపాలకు, ఛందస్సులకు ఒక వినూత్న సారళ్యాన్ని సమకూర్చారు. జీవితాన్ని ఆదర్శవాద దృక్పథంతో పరిశీలించి భావప్రకటనలోనూ, శైలిలోనూ స్వేచ్ఛా ప్రియత్వాన్ని ప్రకటించారు."19 నవ్యకవితా స్వరూపం ఒకవిధంగా వేషంలో మార్పు. కాలాను గుణంగా వచ్చే పరిణామం. 'వాసాంసి జీర్ణాని యథావిహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి' అన్నట్లుగా నిత్యచైతన్య స్వరూపమైన ఆత్మలక్షణము కవిత. నవ్య కవులకు దృక్పథం విషయంలో ఒకవిధమైన వైరుధ్యం ఏర్పడింది. సంప్ర దాయంమీద ఆచారాలమీద తిరుగుబాటు చేయడమైతే చేశారు. సారస్వతంలో ఒక వినూతన దృక్పథాన్ని ప్రవేశపెట్టారు కాని, తాము పోయే త్రోవ యేది, తమ దర్శనం ఏది అన్న విషయంలో తరువాతి నవ్యకవులు సాంఘిక చైత న్యాన్ని అంత స్పష్టంగా ప్రదర్శించక వైయక్తికంగా అంతర్ముఖీనతను ప్రద ర్శించారు. ఆ విషయాలలో స్పష్టమైన సాంఘిక దృక్పథం ఉన్న కవులు రాయప్రోలు, గురజాడలే. తరువాతి కవుల్లో ఈ దృక్పథం క్రమంగా కుంచిం చుకు పోవడం ప్రారంభమైంది. జాతీయోద్యమం బలపడటంతో ఎందుకో చాలా మంది ఊహాప్రేయసుల చేలాంచలాల గాడ్పులలో చిక్కుబడిపోయారు. వీరిలో కొందరు అలా ఉండలేకపోయారు. వారు తమ దృక్పథాన్ని నిర్ద్వంద్వంగా ప్రకటించవలసి వచ్చినది. అందువల్లనే ఆంధ్రోద్యమ రూపంలో విశ్వనాథ, కొడాలి మొదలైన కవులు పురాచరిత్ర వైభవాన్ని గానం చేశారు. నాటి "ప్రేమలో నిది లేశంబనియైన చెప్పుటకు కాదా నాటి స్వాతంత్ర్యముల్" అని "నేటితో అస్వతంత్రతానియతమైన ఈ బ్రతుకు తెల్లువారు భరింపలేరు" అనీ స్వేచ్ఛా సమర చైతన్యాన్ని ప్రకటిస్తాడు. జగమునిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు నని వెట్టిగా గొంతెత్తి పాడతాడు.

ఈ ఆదర్శానికి జాతీయ చైతన్యానికి నిమగ్నత అనే అంశం క్రమంగా జాతీయ చైతన్య పునరుజ్జీవన తత్త్వంగా రూపుదిద్దుకొన్నది. మరో మార్గాన సాగిపోయిన అది ఇది అంతర్జాతీయతగా మానవతగా అవతరించింది.

---

19. అనిసెట్టి- కల్పనలోని చింతనలో (1953)

ఆధునిక కవులవల్ల సాంఖ్యతత్త్వానికి కొంత ప్రాధాన్యం వచ్చింది. జగత్తునకు సర్వమూ మూలప్రకృతియే కారణమయింది.

కానబడక నమమాన ప్రమాణమునకె
అందియందని పరతత్త్వ మవలనుంచి
పంచభూత భాసితయైన ప్రకృతికళనె
సన్నిహిత లక్ష్యమనియె వచస్వి నేడు. (రమ్యాలోకము)

ఈ మూలప్రకృతి యొక్క నానావిధ వికల్ప విచిత్ర రచనాహేతుత్వమే కవికి కవితావస్తువయింది. ఈశ్వరుడు కేవలం సాక్షిమాత్రుడే కావడంవల్ల ప్రకృతి ఉపాస్య మవుతున్నది ఈనాటి కవికి.[20]

నవ్య కవిత్వం వల్ల వస్తువులో భాషలో అభివ్యక్తిలో సారస్వత ప్రక్రియలో ఎంతో మార్పు వచ్చింది. వెయ్యేండ్లుగా సాగుతూ వస్తూవున్న తెలుగు కవిత్వం అమూల్యంగా మారడం ప్రారంభమయింది ఈరోజుల్లోనే. పద్యం నడకలోనూ, విరుపులోనూ ఎత్తుగడలోనూ, ఉపసంహారంలోనూ ఒక అపూర్వమైన సౌందర్యాన్ని సంతరించుకొన్నది. 'చికిలి మెరుంగు సన్న నగిషీ పని' హెచ్చింది.

ఈ నూతనమైన కావ్యపరిభాష, కొత్త ఇడియం తొందరలో సారస్వత ప్రియులకు పట్టుబడలేదు. సంప్రదాయ విమర్శకులు ఈ మార్గాన్ని తీవ్రంగానే విమర్శించారు. దీని స్వరూపాన్ని అమూలాగ్రంగా పరీక్షపెడుతూ వెలువడ్డ గ్రంథం ఉమాకాంత విద్యాశేఖరుల 'నేటికాలపు కవిత్వం.'

20. అబ్బూరి రామకృష్ణారావు 1909 లో రచించిన 1914 లో ప్రచురించిన జలాంజలి అన్న కావ్యంలో ఇదే భావం ఇలా వ్యక్తం చేయబడ్డది: "నిఖిల జగము లదృశ్యుడై నిండియున్న ఈశ్వరుని ప్రకృతియే స్ఫురింపజేయు మనమున కతీతమైన వర్ణనల గూడి ప్రకృతి పరమాత్మ యనెడి విభ్రమము గొలుపు."
—ఊహాగానము, ఇతర కృతులు (1973) పే. 7.

# 3

"అడుగులు బొబ్బలెత్త వదనాంచల మందున జారుచెమ్మటల్
మడుగులు గట్ట మండు కసుమాలపుటెండ వడంతియోర్తు జా
రెడు జిలుగుంబయటం సవరించుచు చొక్కిన యింపుతోడ కా
ల్నడకన బోవుచుండె నెడలన్ కనిపించెడి తోటలోనికిన్".

రాయప్రోలు సుబ్బారావు 1912 - 13లలో రచించి ప్రచురించిన తృణ కంకణ కావ్యారంభం యీ పద్యం. సంప్రదాయ కావ్యస్వరూపం నుంచి విడివడి కొత్తగా తెలుగు కావ్యం రూపొందుతూవున్న సమయం అది. ఈ పద్యంలో కావ్యనాయిక ఎలా అడుగులు బొబ్బలెత్తగా దూరానవున్న తోటలోనికి ప్రయాణమైందో తెలుగు కవితా సరస్వతి కూడా నాటికే చిత్ర కావ్యాలూ, బంధ కవిత్వాలు, ద్వ్యర్థి కావ్యాలు, శృంగార ప్రబంధాలు కారణంగా నీరసమైన తెలుగు కవితాక్షేత్రంలో ఎడారిలో గ్రీష్మంలో నిలిచి ఉన్నట్లుగా ఉంది. అప్పుడు ఆమె ప్రయాణం ఒక నూతన కావ్యప్రపంచం లోనికి. అది అభినవ కవిత. దాన్నే తరువాత కాల్పనిక కవితగా కూడా పేర్కొన్నారు.

తృణకంకణం సర్వసమగ్ర లక్షణాలతో సుస్పష్ట రేఖలతో తెలుగులో వెలువడ్డ మొదటి ఆధునిక కావ్యం. అప్పటికే ఆంగ్ల కవితా ప్రాభవం కారణంగా తెలుగు కవిత్వంలోకి నూతన కవితారూపాలు రావటం ప్రారంభ మయింది. కవి ద్రాక్షపండ్లగుత్తి వంటి లిరిక్కును తెలుగులోనికి తెచ్చే ప్రయత్నం యీ కావ్యంలో చేశానని చెప్పాడు. లిరిక్కు అనే మాటకు మనం గీతికావ్యం అని వాడుతూ వున్నాము. ప్రధానంగా గీతికావ్యం గేయలక్షణం కలిగి సంగీత సాంగత్యంగల రచన. గ్రీకుదేశంలో లైర్ అనే ఒకానొక సంగీతవాద్యం కారణంగా ఈ పేరు కలిగింది. పాశ్చాత్య భాషలలో - గుండె లోంచి హఠాత్తుగా నిర్గమించే ఒకానొక మధుర సంగీతరేఖ వంటి గీతం ఇది. ముఖ్యంగా ఇది ఆత్మాశ్రయమైన రచన. ఆంతరమైన అనుభూతులనూ, భావాలనూ వ్యక్తంచేసే రచన యిది. దీని పరిమితి అల్పమైంది. కథాంశం సాధారణంగా ఉండదు. వైయక్తిక అనుభూతులను యిది యథాతథముగా వినిర్గమింపజేసే సాధనం.

ఒకానొక చోట అల్పమైన కథాంశం కూడా ఉండవచ్చును. అయితే ఈకథాంశం పాత్రముఖాన అంతరమైన అనుభూతి విశేషాన్ని వ్యక్తంచేసేందుకే ఉపకరిస్తుంది. కాని, కథావృత్తము పాత్రపోషణ సన్నివేశ కల్పనాదికముగా విస్తరించదు.

తృణకంకణానికి పూర్వమే ఆధునిక కవితావిర్భావానికి ఎన్నో ప్రయత్నాలు జరిగాయి. చారిత్రికంగా ఆధునిక లక్షణాలు కొన్నింటిని కలిగిన కావ్యాలు 'ముసలమ్మ మరణము' మొదలైన రచనలు కొన్ని వచ్చాయి. గురజాడ అప్పారావు ముత్యాల సరాలు మొదలైన రచనలు ఈ నవకవితారంభానికి పూర్వ రంగం సిద్ధం చేశాయి. వాటి అన్నింటి ఫలస్వరూపంగా తృణకంకణం[21] ఆవిర్భవించింది.

1909 నాటి రాయప్రోలు ప్రథమ రచనయైన లలిత ఒకానొక ఇంగ్లీషు కావ్యానికి అనుకరణ. దీని వస్తువులో నిర్వహణలో నూత్నత ఎంతో ఉన్నా ప్రాబంధికవాసన ఇంకా పోలేదని చెప్పవలసి వుంటుంది.[22] రచనాశైలిలో అది స్పష్టంగా గోచరిస్తుంది.

---

21. ఆధునిక కవిత్వం అనేది అప్పుడే ప్రారంభమయింది. ఆ రోజులలో ఈ కృతివల్ల ఏదో క్రొత్తలోకంలోకి మార్గము ఏర్పడినట్లయింది. అంతకుముందు ఆధునిక విధానానికి తోవతీసినవారు అనూరుప్రాయులు. ఈ సూర్యాలోకమువల్ల సాహిత్యసీమలో నూతనరుచి వ్యాపించి కన్నులు మిరుమిట్లుకొలిపింది. కొంతమంది నేత్రపటలాలు నీరయిపోయినవి.... ఆధునిక కవిత్వమునకు తృణకంకణము ఆదిగ్రంథమని అస్మదాదుల ఆశయము - శివశంకరశాస్త్రి - తృణకంకణ నీరాజనము (1938).
నాకు జ్ఞాపకం ఉన్నంతవరకు 1916 (?) ఆ ప్రాంతాన తెలుగులో మొదటి ఆధునిక పద్యకావ్యం అవతరించినది - ఆచంట జానకిరామ్ - సాహిత్య సమితి వ్యాసావళి - 2 (1969) పే. 47.
22. లలితలో ప్రాబంధిక వాసనలు పోలేదనుటకు ప్రభాతాది వర్ణనలే తార్కాణం.
—డా॥ సి. నారాయణరెడ్డి - ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయము ప్రయోగము (1967) పే. 279.

"హారము భారమై, వనవిహార సుమాపచయప్రియోత్సవా
దారము క్రూరమై, మధురసాయన రుచ్యపదార్థ పిచ్ఛిలా
హారము కారమై, నవహిమాంబుకరాంచిత చందనాద్యలం
కారము వైరమై, వెతలగానిలితిన్ నిను బాసి నెచ్చెలీ."

ఈ పద్యంలో ఎత్తుగడలోని చమత్కారం అచ్చంగా ప్రబంధాలలోదే. లలితకు పీఠిక రాస్తూ రమాకాంతాచార్యులు నాటికే ఆంగ్ల సారస్వతమును అనుసరించే, అనువదించే యువకులు చాలామంది రంగంలో ఉన్నారని పేర్కొంటూ ఈ కవి వాళ్ళ లాగా కాకుండా ఆంగ్ల కవితా రసాస్వాదన ఆకంఠంగా చేశాడనీ, కొత్త జీవితాన్నీ, రక్తాన్నీ తన రచనలో చేకూర్చాడనీ, ప్రత్యక్షంగా కల్పనలను ప్రకృతిలోంచి స్వీకరించి మూర్తి కట్టిస్తాడనీ, ప్రవాహ ప్రాయమైన సుందరమైన శైలిలో గంభీరమైన ఆహ్లాదకరమైన రీతిలో రచించాడనీ పేర్కొన్నాడు.[23] అనుకరణ లక్షణంచేత - దీనిలోనే కవి తరువాత ప్రతిపాదించిన తాత్త్విక సిద్ధాంత బీజాలు ఉన్నా ఇది ఆధునిక కావ్యరచనకు పూర్వరంగ రచనగానే పేర్కొనవలసి ఉంటుంది.

తృణకంకణంలో ఆరంభం నుండి చివరిదాకా ఒక భావసూత్రము కొనసాగుతూ వస్తుంది. అది 'ప్రేమ' సిద్ధాంతము. కవి తరువాత దాని నమలిన శృంగార మని ఒక ప్రత్యేక సిద్ధాంతంగా పేర్కొన్నాడు. 'లిరిక్కులోని అనురాగము మన కావ్యములలో వలె సంభోగపరిణామము పొందనక్కరలేదు. విషయేంద్రియ భోగముకాక భావాత్మక మయిన స్నేహయోగంగా పరిణతమౌతుంది. దీనిని అమలిన శృంగార మని సంకేతించితిని' అన్నాడు కవి పీఠికలో. కథంతా ఒక యువతీ యువకుల జంట మధ్య జరిగే భావ సంఘర్షణ ఇతివృత్తంగా కలది. ఇద్దరూ చిన్ననాటి చెలులు. అయితే నాయిక వివాహం యింకొకరితో జరిగిపోయింది. కాని అతడు నిరాశోపహతుడై వేరే వివాహం చేసుకోవడానికి సిద్ధపడడు. ఆ సందర్భంలో వారిద్దరూ కలుసుకొన్న ఒక విలక్షణమైన సన్నివేశం ఈ కథాచక్రానికి మూలబిందువు. ఈ బిందువు స్థిరమైన చిత్తంతో చెలుని చిత్త వైపరీత్యాన్ని సవరించేందుకు వచ్చిన చెలియ

23. లలిత - Introduction (రెండవ ముద్రణకు వ్రాసింది).

చెలుడు దాని చుట్టూ పరి భ్రమిస్తాడు. ఈమె చుట్టూ పరిభ్రమించే ఈతని భావ వలయాలన్నింటినీ ఆమె మనశ్శుచితారోచిస్సులతో పునరుజ్జీవింపజేస్తుంది. 'శృంగార శుచి రుజ్జ్వలః' అన్న శుచి లక్షణం వ్యాఖ్యానించి ఆమె తన సాహిత్యమునకు నూతన దిగ్దర్శనం చేస్తుంది.

రమాకాంతాచార్యులు రాయప్రోలు మీద ఆంగ్లకవితా ప్రాభవాన్ని కంఠోక్తిగా పేర్కొంటే శివశంకరస్వామి ఇలా అంటున్నాడు: "సుబ్బారావు గారు ఆంగ్లకవితా రసము ఆస్వాదించినమాట వాస్తవమే. అయినప్పటికీ ఆ కవుల శక్తికి ముగ్ధులై దీన్ని రచించలేదు. కాళిదాస కవీంద్రుని నాటకత్రయము బహుపర్యాయములు సాకల్యముగా సమాలోచన చేసి ఆమీద తృణకంకణము కూర్చినారు."[24] ఆయన నూత్న దర్శనానికి పాశ్చాత్య సంస్కారంకంటే కాళిదాసాదుల భారతీయ సంస్కారం ప్రధాన హేతువని శివశంకరస్వామి అభిప్రాయం కావచ్చును. ఏది ఏమైనా ఈ నూతన దర్శనం ఆధునికులను ప్రధానంగా ఆకర్షించింది.[25] లోకంలో ప్రేమ అంతా మూడుపాయలుగా తీర్చబడ్డది ఈ కవిచేత. దాంపత్య భక్తి, వాత్సల్యరక్తి, సఖ్యసక్తి అని. పైతృకమైనది వాత్సల్యము. స్త్రీ పురుషయోగము దాంపత్యము, ఇతర వ్యక్తులనడుమ అనుబంధము సఖ్యము ఈ విధంగా త్రిపథగ ఈ ప్రేమ. ఈ మూడూ 'ఆదిమ మగు ప్రేమయందె ముక్తి' పొందుతవి అంటాడు. వ్యక్తి ఆవిర్భావమునకు మూలము దాంపత్య నిష్ఠమైన ప్రేమ. ఇది సృష్టి హేతువు. వ్యక్తి వికాస హేతువు వాత్సల్య ప్రేమ. శిశువులో అనురాగము, ఆత్మవిశ్వాసము, ఆనందానుభవము, లోకజీవనంలోని సుఖ దుఃఖాలను పంచుకొని అనుభవింపగల నేర్పు ఇవన్నీ ఈ ప్రేమలోనుంచె వస్తవి. తల్లిదండ్రులే ఆరంభంలో మనస్సును తీర్చిదిద్ది అహంతను నిలబెట్టేవాళ్ళు. ఈ విధంగా వాత్సల్య ప్రేమ స్థితికారకము. వ్యక్తి

---

24. తృణకంకణము—నీరాజనము. (1938)

25. The classicist nodded for the charm of homely language, while the modern liked the new direction of love, given there in — Rayaprolu Subbarao Fifty years of modern Telugu Literature (Unpublished essay).

సమాజములో కలిసిపోవడము, ఇతరుల ఇష్టముకోసం తన ఇష్టాన్ని వదలు కోవడము, సానుభూతి పొంది తన వ్యక్తిత్వాన్ని మరచిపోవడము, క్రమంగా త్యాగభావ పరాకాష్ఠ ఇవి సఖ్యప్రేమ లక్షణాలు. ఇది లయలక్షణము. వ్యక్తి అహంకారము సామాజిక చైతన్యములో లీనంకావడం ఇక్కడ పరమార్థమైన విషయం. ఈ విధంగా ఈ మూడు దశలూ జగచ్చైతన్య పరిణామంలో మూడు మెట్టాలు. స్వర్గమర్త్య రసాతలాలు.

ఇంతవరకు తెలుగుసాహిత్యంలో స్త్రీపురుష సంబంధం సామాన్యంగా సంభోగావధిగా తీర్చబడ్డది. క్షీణప్రబంధాలలో ఈ సంభోగలక్షణం మరీ దిగజారి అశ్లీలతనూ, అసభ్యతనూ సంతరించుకొన్నది. స్త్రీ అంగాంగవర్ణనము, సురత వర్ణనము విరివియైనవి. కవుల భావన దేహవర్ణన దాటి సాగలేదు.

కులశుభాంగ వయోధీర కుసుమమందు
మోహమదువె గవేషించే మున్ను సుకవి
సాత్త్విక ప్రేమకోశ పేశలములయిన
వత్సలామృత రుచులనె వలచె నేడు (రమ్యాలోకము)

నరనారీ సంబంధము
పరిభావింపుము దిశావిభాగము వరుసన్
ధర; జననీ భగినీ సహ
చరీ కుమారీ క్రమము నిజంబగుట సుధీ (మాధురీ దర్శనము)

అని అలాంటివేళలో నరనారీబంధము ఎంత పవిత్రంగా భావించవలెనో వెల్ల డించి వ్యాఖ్యానించాడు కవి. కులాంగనా సౌందర్యవర్ణనంలోనూ అనురాగ వర్ణనకు మోహమే ఆలంబనం కానక్కరలేదు. అందువల్లనే ఆధునిక భావ కవులు ప్రేయసులను వర్ణించినా కులపాలికలను వర్ణించినా వారి అలౌకిక సౌందర్యాన్ని వర్ణించారేకాని దైహికమైన మోహాన్ని రెచ్చగొట్టే వర్ణనలు చేయ లేదు. ఈ మనోహర సుకుమార భావనామార్గానికి ప్రవర్తకుడు రాయప్రోలు. ఆమె వారికి ప్రేయసిగా, హృదయేశ్వరిగా, గృహలక్ష్మిగా, ప్రకృతిగా, సౌందర్యాధిష్ఠాత్రిగా, ఉపాస్యదేవతగా, సర్వజగన్మాతగా సాక్షాత్కరించింది. అందువల్లనే నారీనర సంబంధానికి నూతన లక్ష్యాన్ని చూపిస్తాడు కవి. జననీ,

భగినీ, సహచరీ, కుమారీ క్రమము అది. ఇది ఒక చక్రము. జననినుండి తాను బయల్వెడలినది మొదలు తాను కారణంగా ఉద్భవించిన కుమారిదాకా పురుషుని సంబంధము ఒక అవర్తమును పూర్తిచేసింది. ఆమెకూ సర్వప్రకృతి హేతువయిన భూమికీ అభేదము భావించాడు కవి.[26] జనన్యాది చతుష్కము నాలుగుదిక్కులు. జననియు సహచరియు కారణజాతము. భగినీ కుమారికలిద్దరూ కార్యజాతము. జననిదగ్గర తాను వాత్సల్యమున కనుభోక్త. భగినివద్ద తాను ఏక మాతృజన్య సామాన్య లక్షణము కారణముగా సఖ్య ప్రేమకు తావు. సహచరి వాల్మీకి చెప్పినట్లు సహధర్మచరి. ఈమెతోటి తాను దాంపత్య ప్రేమకు అనుభోక్త. ఇంతేకాదు, తాను కుమారికయెడ వాత్సల్యమును పంచి ఈయవలసిన వాడు. కారణవర్గానికీ, కార్యవర్గానికీ అంతరంగా కొంత సాలక్షణ్యమూ, కొంత వైలక్షణ్యమూ ఉన్నది. జననిలో క్రమంగా సహచరి లీనమవుతుంది. అట్లాగే భగినిస్థానంలో కుమారి లయం పొందుతుంది. క్రమంగా ఈ నలుగురూ అమ్మ వారి నాలుగు అంశలు మహేశ్వరి, మహాలక్ష్మి, మహాకాళి, మహాసరస్వతి స్వరూపాలు. అంటే ఆదిశక్తి విలాసమే ఈ స్త్రీ స్వరూపము.[27] 'కలలెందొ

---

26. అందు నీ విలక్షణ జీవయాత్రకొరకు, పృధివినే నవ్యులు సమాశ్రయింతు, భక్తి తల్లిగా ధాతిగా దేవతామతల్లిగా సమస్త పరావర కామ్యములను-(రమ్యాలోకము).
చరాచర జీవకోటిచేత ప్రకృతి చనుబాలు కుడిపించిన కవికి స్త్రీపట్ల ఆర్ద్రకోమల దృక్పథం అలవడడంలో ఆశ్చర్యం లేదు. నవ్యులకు సౌందర్యమె ఉపాధి అయింది. వారు ప్రేమ మంత్ర మహోపాసనా మయులు, కాని వారి లక్ష్యము అక్షరానందసిద్ధి. పూర్వకవులవలె సంభోగరహితమైన విప్రలంభ శృంగారము వీరికి ఉపాదేయమైనది - కె.వి. రమణారెడ్డి, జయంతి, నవంబర్ - 1968.
27. విశ్వనిర్వహణమునను, జగల్లీలా వ్యాపారమునను జగజ్జనని శక్తుల లోను. మూర్తులలోను నాలుగు ప్రధానాంశలు విదితమగుచున్నవి.... జ్ఞాన సత్త్వసామరస్య. సంపూర్ణత్వములే తన్మూర్తుల వేర్వేరు గుణములు........ ఈ నాలుగు శక్తులను మహేశ్వరి, మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి అను దివ్యానామములతో వ్యవహరింతుము- శ్రీ అరవిందులు- జనని (అనువాదం 1949) పే. 36-37.

నిత్యసుందర లలితాలంబన మనంత లావణ్య సముజ్జ్వల హస్తమొకటి, తన్మం గళాభినయ రోచనమ్మె కావ్యకళసుధీ' అని ఆమె లలితా పరమేశ్వరి అని సూచిస్తూ వున్నాడు.

తృణ కంకణంలో ఇద్దరు- నాయికా నాయకులు రెండు భిన్న భిన్న దృక్పథాలు కలవారు. జీవితంగూర్చి. ప్రపంచాన్నిగూర్చి వారి నిశ్చయాలు వేరు. కావ్యం యీ తత్త్వాల నడుమ సంఘర్షణయే.

నాయకుడి దృష్టిలో సంసారము దుఃఖమూలమైంది. ఈ లోకము 'ప్రేమభిక్షా శూన్యంబయి గొడ్డువాఱిన జుగుప్సాలోకము', 'వికాసపతనమగు ప్రపంచకము', 'వృధా లీలాభ్రాంతి'. కాలము 'విషకాలము' 'కాలచపలుడు' ఈ విధంగా పద్యాలలో అక్కడక్కడా ఉన్న మాటలనుబట్టి అతడు జగత్తు యొక్క వైయర్థ్యాన్ని దుఃఖమయత్వాన్నీ భావించినట్లుగా కనబడుతుంది. దీని తత్త్వాన్నిగూర్చి చెబుతూ ఒకచోట ఇలా అంటాడు:

> 'కాంక్షనశియింపని వియోగకాలమందు
> సర్పమును గాంచి భ్రమియింతు సఖుల పాలి
> పూలదండ యటంచును, పూలదండ
> గాంచి కాలపాశం బనుచు కాంక్ష తెగిన'

మాయాపిహితమైన బ్రహ్మమునందు సర్వజగత్తూ వివర్తముగా భాసించేది ఈ విధమైన అధ్యాసవల్లనే. ఈ సిద్ధాంతమును అంగీకరించడంవల్లనే జగత్తంతా అవిద్యాహేతువు వికాసపతనమగునది అంటే భ్రాంతి ఉన్నంతవరకూ ఉండేదీ, లేనంతలో వెంటనే తొలగిపోయేదీ సర్పమును పూలదండగా భ్రమించడం కాంక్షాకాలంలో. కాంక్ష తెగిన తరువాత పూలదండకూడా కాలపాశమని గ్రహించడం. రాగముక్తుడీతడు. తాత్త్వికుడు.[28] ఆధునిక కాలంలో భారతీయ జీవన

---

28. కవికి తాత్త్వికునకు కయ్యంబె సాగెను బహు దినాలు వాక్ప్రపంచ మందు. రాగరక్తు డొకడు, రాగముక్తు డొకండు, సగుణ నిర్గుణముల సఖ్యమెట్లొ, (రమ్యా లోకము) నిజానికి కవికీ తాత్త్వికునికీ భేదం కానీ, వైరం కానీ ఉండే అవసరం లేదు. కవిత్వంయొక్క ఉన్నత శిఖరాలలో తాత్త్వికతా స్వర్ణకిరణాలు ప్రకాశించడం సహజమే అయినా మధ్య యుగాలలో నివృత్తి లక్షణం జగత్తునుండి దూరంగా పారిపోవడంగా భావించిన శుష్క వేదాంతుల వలన ఈ అఖాతం ఏర్పడ్డది.

దృక్పథంలో ఒక మార్పు కలిగింది. రవీంద్రుడు, శ్రీ అరవిందుడు మొదలైన వాళ్ళు జగత్తు మిథ్యా వస్తువు కాదనీ, ఆనంద కేంద్రమనీ వ్యాఖ్యానించారు. నాయకుడు తన అనురాగం ఎంత పవిత్రమైందని భావిస్తున్నా, అతని అనురాగం ఆమె శారీర సౌందర్యావధులనుదాటి ఎంతో దూరం పోలేదు. 'లలిత లావణ్యపూర్ణమౌ లలన చెలువ మెదుట కన్పట్టుచుండు నెల్లెడల నాకు కనులు మూసినన్ విప్పినన్' అని ఆమె రూపధ్యానంచేసే స్థితిలోనే ఉన్నాడు. అందుకే 'తన గుణలతలు పూచిన శోభలో యన' అన్న పద్యంలో నాయిక చిరునవ్వు, మాటలు, చూపులు, నడకలు వర్ణిస్తాడు. ఈ అనురాగంలో అంతరంగా శరీర వాంఛ కానవస్తూనే ఉన్నది. కాబట్టే ఆమెకు జరిగిన వివాహం తనకు అంత దుఃఖహేతువయింది. జగత్తంతా ప్రేమభిక్షా శూన్యంబయి గొడ్డువాఱిన జుగుప్సా లోకముగా కానవచ్చింది. ప్రాణములు త్యజించవలెననే కోరిక కలిగింది.

నాయిక ప్రవృత్తి వేరు. ఆమె మనసు ప్రేమార్ద్రమైనది. తన పెంచిన లేడియెడ వాత్సల్య రసము కురియింపగలది. ఆయాసమెడలకుండగానే ఆమె లేడిని చెమట కారు హస్తంబున చేరదీసి ముద్దిడికొన్నది. ప్రేమ తత్త్వము నెఱిగిన యామె వలపున కన్న ప్రేమ పైయంతస్తులోనిది. సాధారణముగా రెంటికిని అభేదమును భావించటంవల్లనే లోకమున ఆశాభంగము కలుగుతున్నది. నాయకుడు అట్లాగే భ్రాంతి పొందటం జరిగింది. వలపు వడుచుదనముతో చిగురించేది నైమిత్తికమైంది.

> మనసుచే వాక్కుచేత కర్మంబుచేత కలుషితములు కావగినవీ వలపు లవని
> తపసుచే తాల్మిచే ధ్యానధారచేత లీనమై యైక్యమీయజాలినది ప్రేమ

మనోవాక్కాయకర్మలలో దేనివల్లనయినా యీషద్భేదం కలిగినా వలపు చెదరి పోయే వీలుంది. ప్రేమకు త్యాగం పాదు స్వసమర్పణబుద్ధి నైజ లక్షణం. అందువల్ల ఇది క్రమంగా అంతర్లయాన్నీ, ఐక్యమునూ కలిగిస్తుంది. పరస్పరమూ యీ ప్రేమ విషయంలో తపఃక్షమాధ్యానాది లక్షణములు వృద్ధి హేతువులు. సామాన్యంగా తపఃక్షమాదులు భగవద్విషయంలో చెప్పబడుతవి. కాని ఇచ్చట ప్రేమ విషయంలోనూ కవి ఇదే విషయం విధిస్తున్నాడు. ఈ ప్రేమ పారమార్థికమైనప్పుడు భక్తి అవుతున్నది. "సాత్వస్మిన్ పరమ ప్రేమ

రూపా అని నారదుడు.[29] పరమ ప్రేమ సర్వేతర లోకములోనున్న దానికన్నా విలక్షణమయింది. జగత్తులో ఈ ప్రేమోదయం కూడా దైవికమైన సుకృతం చేతనే కలుగుతుందని. అదీ అస్ఖలితంగా నిలచేందుకు దానికి చిరతపశ్శుద్ధి కావలెనంటాడు.[30] ఈ ప్రీతిలక్షణాన్నే రాయప్రోలు ఒకచోట యిలా వివరించారు:

"ప్రీతికూడా ఒక విధమయిన యోగమన్నాను. ప్రీతి అంటే రసమే అన్నారుగదా లాక్షణికులు. ప్రీతి అంటే 'దయామయాంతఃకరణవిశేష'మని ప్రాచీనులు నిర్వచించారు. ఈ వ్యవస్థను యిలా భావించాలె. వీరు బహిరింద్రియములను స్వచ్ఛందంగా వదలివేస్తారు. అంతరింద్రియములను అంతరాంతరమునందు సురక్షితంగా నిర్వికల్పంగా నిలిపి పెట్టుకుంటారు ...మానవునకు నిసర్గమయినది ప్రీతి. ప్రీతికి రాగము తల్లివేరు వంటిది రాగము సుఖాశయి అన్నది యోగశాస్త్రము. సుఖము భోగాశయం కావటం కూడా సహజమే. భోగము లలితకళాశ్రయము కావటము లోకములో కనబడుతున్నది."[31] ఈ విచారణలో ప్రధానమయినది బహిరింద్రియములను స్వచ్ఛందంగా వదలివేసినా అంతరింద్రియములను సురక్షితంగా నిర్వికల్పంగా నిలిపి ఉంచడం. ఈ విధంగా ప్రవృత్తికీ నివృత్తికీ ఒక అన్వయం కూర్చడం కానవస్తుంది ఈ ప్రీతి యోగాన్ని గూర్చి తృణకంకణంలో నాయిక ప్రవచించుతుంది.

> విషయసుఖేచ్ఛలన్ దనియ విహ్వలమైన హృదంతరమ్ము క
> ల్మషమయిపోవనీక అకలంక మృదూకృత సాధనన్ మనో
> విషమగలిన్ మరల్చుటె వివేకము, తన్మయమైన అర్థి మా
> నుషదశలే కృతార్థములనున్ కవివాణి యనుంగు నెచ్చెలీ.

---

29. నారద భక్తి సూత్రములు.
30. వివేకానందుడు ఒకచోట ఇలా రాశాడు:
    Formulas of worship control of Breath
    Science, Philosophy, systems varied
    All these are but delusions of the mind
    Love. Love - that's one thing the sole treasure.
31 కృష్ణశాస్త్రి - కవితా స్వర్ణోత్సవం (ప్రత్యేక సంచిక) 1975 పే. 12.

హృదయం ఎప్పుడూ విషయభోగానుభవంచేత శాంతస్థితిని పొందదు. పైగా విహ్వలత్వాన్ని పొందుతుంది ఆ విధంగా విహ్వల లక్షణంచేత అది వికృతము - వికారము పొందినది - కలుషితము అవుతుంది. ఈ మనో విషమ గతిని మృదూకృత సాధనంచేత సన్మార్గానికి మరల్చవలసి ఉంటుంది. నాయకుడు స్నేహమును విషయ సుఖానుభవంచేత తృప్తి పొందించాలని భావించాడు కాని ఆమె అంతకన్నా హృదయ స్పృష్టమైన మృదు స్నేహ సౌరభంచేత దాన్ని సన్మార్గానికి మరల్చే ప్రయత్నం చేస్తుంది. ఈ మృదు స్నేహం హృదయాలకు ఒక తన్మయస్థితిని కలిగించుతుంది. ఈ తన్మయస్థితి చేత మనిషి అంతర్ముఖుడౌతాడు. బహిరింద్రియ వ్యవహారంతో క్రమంగా అన్వయం కుదురుతుంది. ఈ అంతర్ముఖంగా యింద్రియాలను దమించడం - అదీ ప్రేమచేత. దానికి బాహిరవిషయవాంఛాపరితృప్తి పర్యంతమైన లక్ష్యం లేదు. అందువల్ల యీ స్నేహం నిర్వ్యాజం.

ఈమె స్నేహాన్ని కూడా నిర్వచిస్తుంది. 'కలిసినయంత మాత్రమున కాదు సుమా చెలికార మంతరంబుల నతుకంగజాలిన అపూర్వపు లంకెయే స్నేహమా' - ఇక్కడ స్నేహానికి పరిచయానికి భేదం నిర్వచింపబడ్డది. స్వప్నకుమారంలో కవి - 'తుల్యరక్తి తుల్యావస్థ తుల్యదశల నొకదయిన లేక పొసగ దన్యోన్యమైత్రి' అంటాడు. తుల్య రక్త్యాదులలో స్నేహం యేర్పడటం లోకంలో కద్దు. కాని, మళ్ళీ అవస్థాభేదం సంక్రమించినంతనే ఆ స్నేహం మరుగునబడిపోవడం క్రమంగా మాసిపోవడమూ ఉన్నది. అందువల్లనే దాన్ని అస్ఖలితంగా సాగించడమే జ్ఞానవిదగ్ధుల మార్గమని ఆయన సిద్ధాంతము.

ఈ విధమైన స్నేహమీమాంసలో ఆమె పరమ రమ్యమైన విచారణ కొనసాగించింది. ప్రేమచేత మృదూకృతాలైన హృదయ పద్మపుటాలలోనే శాంతీ, ప్రేమా అనే మధురసాలు అస్ఖలితంగా నిలిచి వుంటాయని అల్పమైన కారణాలచేత వలపులలాగా ప్రేమలు విడదీయడం సాధ్యముకానివనీ ఆమె వ్యాఖ్యానిస్తుంది.

ఈ విధంగా పరిశీలించిచూస్తే తృణకంకణంలో నాయిక అనంతోపాసిక, జగత్తునంతా ప్రేమమయంగా చూడగలది జగద్వ్యవహారానికి మూలముగా-

ప్రేమను స్వీకరించింది. ఇది ఆమెకు యోగసాధన. ప్రేమ అనేది కామనా పర్యవసాయి కాదు. భోగోపలబ్ధిచేత శమించేది కాదు. ఇంకా ఈ ప్రేమభావం ఆమెకు చరాచరమయిన జగత్తు నిండా అభివ్యక్తమై గోచరిస్తున్నది. లతాసుమములు, గువ్వజంట, ఆవులేగలు ఇవన్నీ ప్రేమలో భిన్నభిన్నావస్థలకు సూచకాలుగా ఆమెకు గోచరించారు.

మొత్తముమీద ఆమె ప్రయత్నము ఫలించింది. చెలికానిలో మార్పు వచ్చింది. అతనిచేత సోదరీయని పిలిపించుకొన్నది. తృణకంకణము ఆమె చేతికి తొడిగిన తరువాత కవి 'అనుచు మొగమావలకు ద్రిప్పె నరుణకిరణు డాశ మార్చినయట్టులు' అంటాడు. ఇక్కడ ఈ వర్ణన అతని మనస్సులో కలిగిన పరిణామాన్ని సూచిస్తుంది.

కావ్యంలో మొత్తంమీద ప్రతిఫలించిన ఈ మానసిక వైరుద్ధ్యం నాయికా నాయకుల వ్యక్తిత్వాల నాశ్రయించి ఉండటం గమనింపదగిన విశేషం. కావ్యంలో స్త్రీ ప్రణయ మీమాంస చేసింది. జ్ఞానస్థానం. పురుషుడు మాయా మోహితుడు. ఆమెచేత ఏదిత స్వాత్మలక్షణం కలవాడైనాడు. విశ్వనాథ సత్యనారాయణ ఏకవీర (1930-31) లో ఈ విధమైన సంఘర్షణయే చిత్రింపబడ్డది. దైవికమైన ఒక సన్నివేశంచేత వివాహమునకు బెదిరిపోయిన ప్రేయసీ ప్రియుల రెండు జంటలు - దీనిలో యితివృత్తము. కుట్టాన్ తన ప్రేయసి తన ప్రాణసఖుడైన వీరభూపతి భార్యయని తెలిసినప్పుడు కొంత యంతర్మధనము పొందినాడు. "ఇప్పు డీమెను నేను సోదరివలె చూచుచున్నాను వీరా! ఏదురూహయులేకుండ నీమె నిపుడు కౌగలించుకొనగలను....నేను నిన్న పొందిన మహా బాధ వలన తపస్సు వలన నాకీ శక్తి వచ్చినది" (ఏకవీర 8 వ ముద్రణ పే. 112).

తృణకంకణంలో నాయిక ప్రతిపాదించిన తత్త్వం 'ఆత్మ ప్రసాదన యోగ'మని రూపనవనీతం పేర్కొన్నది. ఈ యోగాన్ని ఆ గ్రంథంలో భక్తి శాస్త్ర ప్రవర్తకుడైన నారదుడే ఉపదేశిస్తాడు ఇది "ఎవరికివారు అంతరంగములలో అనుష్ఠింపదగినది. దీనికి భావమే కీలకం. భావనయే శక్తి, మైత్రీకరుణ భావన అన్యులపట్లనూ, ఉల్లాస ఉపేక్షాభావన స్వార్థమందును అభ్యాసం చేయ

వలెను. ఎక్కడెక్కడ సుఖస్ఫురణకలుగునో అక్కడక్కడ మైత్రీభావన పెంచవలెను. ఎందెందు దుఃఖము గోచరించునో అందెల్ల కరుణాభావన నెఱప వలెను."[32]

విచిత్రమైన మనఃపరిపాక వైవిధ్యంగల ఈ నాయికానాయకుల కలయికలో అపూర్వమైన మానవ మనశ్చైతన్య విచారం కొనసాగింది. దాదాపు ఇరవయేళ్ళ ప్రాయంలో రచించిన ఈ కావ్యం ఆయన రచనలన్నింటిలోనూ తాత్త్వికంగా అనుస్యూతి పొందింది. కావ్యంలో స్థూలంగా జూస్తే ఒక కథారేఖ ఉన్నదేకాని ఆ కథంతా కేవలం ఈ జ్ఞాన విజ్ఞాన జిజ్ఞాసకోసం విస్తరించిందే.

## 4

ఇంక రాయప్రోలువారు ప్రతిపాదించిన అమలిన శృంగారమును[33] గూర్చి వివరించుకోవలసి ఉంది. ఆయన దృష్టిలో రెండే మూలరసాలు - కరుణ శృంగారాలు.

---

32. రాయప్రోలు సుబ్బారావు : రూపనవనీతము (1953) పే. 126.
33. It is a discovery of Modern Poet in the sense the Past masters did not touch it. Nevertheless it is implicit - in our classical Poetry Sringara predominates. Sringara is nothing but human love. Love is the supreme substance of creation it self Raso vai sah. In Upanishadic language it is Ananda. The human being is sensitive to relish and realise himself through its enjoyment This is the state of spirit in which two male and female, melt into one and the entire world becomes a kind, when action ceases, desire rests and the smiles don't seduce nor tears repel. This is a process of achievement through fine arts, swimming through the stream of beauty, 'Sundaram' to the shores of 'Sivam'

కరుణ శృంగారములు రెండె కావ్యమందు
నిజరస విపాక భోగ మందింపగలవు
సహజపూర్ణ చిన్మయ సుఖాస్వాదనమున
శోకమథిత మనోదోష శుద్ధికలన. (రమ్యాలోకము)

రసానందమునకు యింద్రియ సముచ్చయ కేంద్ర పేశలపేశి[34] ఒకటి కలదని ఆయన పేర్కొన్నాడు. ఈ కేంద్ర పేశలపేశి దహరాకాశంలోని ఉపనిషత్తులు పేర్కొన్న అంగుష్ఠమాత్ర ప్రమితుణ్ణి నిలుపుకొన్నచోటేమో! పైన పేర్కొన్న కరుణశృంగార సిద్ధాంతాలలో కరుణరసమే మూలరసమని భవభూతి, శృంగారమే మూలమని భోజుడూ పేర్కొన్నాడు సుఖదుఃఖానుభవ ద్వివిధమయిన జగత్తులో మూలరసము కూడ ద్వివిధముగనే రాయప్రోలు భావించడం జరిగింది. ఋతరస ప్రతిపత్తి వీనికే ఆయన కల్పించాడు.[35] ఇక్కడ ఋతశబ్దానికి పారమార్థికమైన రసములని చెప్పవలసి ఉంటుంది. భోజుని దృష్టిలో శృంగారము జీవుని మూలాహంకారము. ఈ అహంకారము యొక్క వికాసమే స్వభావములకు మూలమగుటచేత సర్వరసములకును మూలం కావడంలో ఏ విప్రతిపత్తి లేదు. కాని రాయప్రోలు ఋతస్థితిలోంచి రసం ద్విధా విభక్త మవుతున్నదని వ్యాఖ్యానిస్తున్నాడు. జీవ చైతన్యము పూర్ణమైన సుఖాస్వాదన పొందే మార్గం ఒకటి. రెండోది మనోదోషాలన్నింటినీ కడిగివైచే శోకమథనం. ఈ విధంగా చూస్తే మొదటి మార్గంలో తారసిల్లే మిగిలిన రసాలు

---

only to live in 'Santam'. This exercise is delicate as it is difficult. It is like a dance on razor edge. —Rayaprolu Subbarao - Fifty years of Modern Telugu Literature. (Unpublished essay.)

34. కలదుగా యింద్రియసముచ్చయ కేంద్ర పేశలపేశి అది కా
వ్యధ్వనిన్ ద్రవియించి సుకుమారమ్ముగా రసమయమగున్.
(మిశ్రమంజరి) 1963 పే. 79

35. కరుణ శృంగారములు రెండె ఋతరస ప్రతిపత్తి నందెడి. ఒకటి కలుషము కడుగు. మఱొకటి కాల్పుకాయము శుద్ధికై. మిశ్రమంజరి (1963) పే. 182.

వీర అద్భుత హాస్యాలు - రెండో మార్గంలో తారసిల్లే రసాలు రౌద్ర భయానక బీభత్సాలు. శాంతమేమో త్రిగుణాల సమస్థితిలో ఉండే నిర్వికల్పమైన మనో లక్షణం కావడం చేత అయన రసంగా అంగీకరించడం లేదు. శోకం 'సలిల మేవహి తత్సమస్తం' అన్నట్లు జల స్వరూపం శృంగారం శుచిరుజ్జ్వలం కావడం వల్ల అగ్ని స్వరూపం. జలం క్రిందికి దిగివస్తుంది. అగ్నిజ్వాల ఎప్పుడూ పైపైకి ప్రజ్వలిస్తూ ఉంటుంది. కరుణమును గూర్చిన రాయప్రోలు చేసిన వివేచనలో కలుషము కడుగుట, లేదా మనశ్శుద్ధికలనం అరిస్టాటిల్ చెప్పిన కెథార్సిస్‌తో సమన్వితమవుతుందని డా. నారాయణరెడ్డిగారు పేర్కొం టున్నారు.[36] రసములు రమ్యాలోకంలో రాయప్రోలు నిర్వచించిన విధం యిది.

భేదమోద ప్రసక్తులన్ భిన్నకుశల
దశలకు వశంవదమగుచు, తన్మయమయి
తన్మయ మొనర్చు సహృదయాంతఃకరణ ము
ఖోపభోగ్యమె రసమన నొప్పు కృతుల.

రసము అంతఃకరణ ముఖోపభోగ్యము. అంతఃకరణమంటే మాయాపి హితమైన బ్రహ్మ చైతన్యము.[37] మనోబుద్ధ్యహంకార చిత్తములు - ఈ చైత న్యమునకు ఇంద్రియాలకూ నడుమ ప్రవర్తిస్తవి. వీటి ముఖంగానే రసా స్వాద నకు వీలుక లుగుతుంది. రసానుభవ స్వరూపాన్ని చెపుతూ కవి హృదయం మకరందపానం చేసే మధుకరంలాగా అవుతుందని పేర్కొంటాడు. ఈ మధు పానంలో కలిగే కైవల్యధారణమె ఆనందము అని ఆయన సిద్ధాంతము.

శృంగారానికి అమలిన శబ్దం వాడడంతోనే సంభోగ శృంగారం నిషిద్ధ మనీ, మాలిన్యము పొందినదనే భావం స్ఫురించే అవకాశం ఉంటుంది. కాని రాయప్రోలు అమలిన శబ్దానికి కేవల కామమును దాటిన రతిచిత్పదార్థము స్థాయిగాగల రసమే అని అర్థం. కామము దంపతీనిష్ఠమయి ప్రజాతంతు నిర్వా హకమై ఉండటం ఆయనకు అభీష్టమే కాని శృంగారమునకు అదే చిట్టచివరి

---

36. ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయము, ప్రయోగములు - (1967).
37. అంతఃకరణ మనగా జీవ చైతన్యము. మాయాపిహితమైన బ్రహ్మ చైతన్యము - విశ్వనాథ సత్యనారాయణ - శాకుంతలము యొక్క అభి జ్ఞానత (1961) పే 71.

శిఖరము కాదు. లలితలోనే ప్రేమ సమగ్ర స్వరూపాన్ని చిత్రిస్తూ దాన్ని మహాధ్వరంగా పేర్కొంటాడు కవి.

> స్నేహము వెన్నవోలె శిఖ జిహ్వలకున్ చవిగొల్పి, యౌవనో
> ద్వాహనరక్తులౌ జతల వాలకముల్ మసృణీకరించి, చే
> తోహరణప్రభావములతోడయి ప్రేమ మహాధ్వరంబునం
> దాహవనీయ పేయరసమై మధుమంత మొనర్చు విశ్వమున్

ఈ జగత్తును స్నేహమే మధుమంతము చేస్తుంది. వాత్సల్య దాంపత్య సఖ్యములు దాని భిన్న భిన్న దశలు. మాధురీ దర్శనంలో దంపతీనిష్ఠ శృంగారాన్ని గూర్చి మహాసవనంగా పేర్కొంటాడు. 'లలియింపకుమి ప్రజాతంతువు' నను శ్రుతిశాసనము మిధునబంధ మహాసవనోత్సవమున గా కెటులవు పాలింపంగ మానవాళికి సుధీ అని- దంపతీనిష్ఠమైన శృంగారానికి ఉన్నతమైన స్థానం కలిపించాడు. దీన్ని ఒక యజ్ఞంగా నిరూపించడం వల్ల తాత్పర్యం ఇది వైయక్తికమైన సుఖంతో పర్యవసించక ఒక సామాజిక కర్తవ్య పాలన ద్వారా, సృష్టి అవిచ్ఛిన్నతను కాపాడటం ద్వారా, ఆత్మోత్తారకమైన పని అవుతున్నది. పితౄణ విముక్తి హేతువవుతున్నది. వైదిక సంప్రదాయంలో యజ్ఞము సపత్నీకంగా ఆచరించవలసిన కార్యం. పురుషుడు అపత్నీకుడైతే అసంపూర్ణ వ్యక్తి.

ఈ విధంగా దంపతీ నిష్ఠమయిన శృంగారం మలినమయింది కాదు. బృహదారణ్యకోపనిషత్తు కూడా దంపతీనిష్ఠమయిన రతిని యజ్ఞంగా పేర్కొనది.[38]

---

38. పురుషోవా అగ్నిర్గౌతమ, తస్య వ్యాత్తమేవసమిత్ ప్రాణోధూమోవా గరిశ్చక్షు రంగారాశ్శోత్రం విస్ఫులింగా స్తస్మి న్నేతస్మిన్నగ్నౌ దేవా అన్నం జుహ్వతి తస్యా అహుత్యై రేతస్సముద్భవతి. యోషావా అగ్ని గ్గౌతమ తస్యా ఉపస్థ ఏవ సమిత్లోమాని ధూమో యేనిరర్చి ర్యదన్త కరోతి తేఽంగారా అభినన్దా విస్ఫులింగా స్తస్మి నేతస్మిన్నగ్నౌ దేవా రేతో జుహ్వతి తస్యా అహుత్యై పురుషస్సమ్భవతి సజీరతి యావజ్జీవ త్యధా యద్రామియతే.

— బృహదారణ్యక 8 అధ్యా - 2 బ్రాహ్మణ. 11, 12.

ఛాందోగ్యోపనిషత్తులో పంచాగ్ని విద్య ప్రపంచింపబడింది. దీని ప్రకారం ఒక శరీరం నుండి మరొక శరీరం పరిగ్రహించేవరకు జీవుడు ఐదు అగ్నుల నుండి సాగిపోతాడు. ద్యులోకాగ్ని, పర్జన్యాగ్ని, పృథివ్యగ్ని, పురుషాగ్ని, యోషిదగ్ని అని. ద్యులోకంలో సోముడుగా, పర్జన్య గర్భంలో వర్షంగా, పృథివిలో అన్నంగా, పురుషుడిలో రేతస్సుగా, స్త్రీలో గర్భంగా జీవుడు రూపొందుతాడు. సోమాది రూపాలన్నీ హుతులే. ఇది ఒక చక్రం, ఈ చక్ర నేమిక్రమం తెలుసుకొని ప్రవర్తించడం మోక్ష హేతువు.

బృహదారణ్యకమే మరొకచోట ప్రేమ తత్త్వాన్ని మరింతగా లోతుగా భావించి చెప్పింది. ఈ ప్రపంచంలో ప్రేమ అనేది అనేక వస్తువుల యందు అభివ్యాప్తమైనట్లుగా కనిపిస్తుంది. కాని నిజానికి ఆ ప్రేమ అంతా వస్తుతః ఆత్మ కామమే[39] అంటే ఆత్మదర్శనంకోసం పడే తహ తహ మాత్రమే, అందు వల్లనే రాయప్రోలు రతి చిత్పదార్థమని నిర్వచిస్తాడు. 'రతి చిత్పదార్థమది పుష్పితమయి స్త్రీపుంసయోగ చిరశిక్షా స్నేహితమై సుమానుషభవ క్రతు కల్యాణంబునకగు' (మాధురీ దర్శనము).[40] భోజుడు చెప్పిన రతి స్వరూపము కూడా ఇదే.

ఈ విధంగా రాయప్రోలు ప్రేమమీమాంస పాశవికమైన కాముం చుట్టూ పరిభ్రమించే శృంగారభావాన్ని విస్తరించి సర్వజగచ్చైతన్యాన్ని ఆవరించేంతగా

---

39. నవా అరే పత్యుః కామాయ పతిః ప్రియోభవతి, ఆత్మ వస్తు కామాయ పతిః ప్రియోభవతి. నవా అరే జాయాయై కామాయజాయా ప్రియా భవతి,ఆత్మ వస్తు కామాయ జాయా ప్రియాభవతి -బృహదారణ్యక 4. అధ్యా - 4. బ్రాహ్మణ 4.

40 ప్రాణులకెల్లను సర్వాంగీణమయి విలసిలు రతి, అకిల్బిషమయి కల్యాణపరమవర్చస్కధురీణమ్మగు స్థాయి నది వఠిందుచేటు సుధీ — మాధురీదర్శనము.

విస్తరించింది.[41] గ్రీకుల ప్లేటానిక్ లవ్‌తో దీనికి సామ్యం లేదు. అక్కడ అది యింత విస్తృతమైన స్థానాన్ని పొందలేదు.

అయితే ఈ దృష్టిలో దంపతీనిష్ఠమైన శృంగారాన్ని ప్రత్యేకంగా ఈ శుచి భావంతో రాయప్రోలు ఏ కొత్త కావ్యములోనూ చిత్రించలేదు. అయితే భావకవిత్వం కొనసాగి విశ్వనాథ, నాయని రచనలు ఈ భావాన్ని ముందుకు తీసుకొని పోయాయి. విశ్వనాథ గిరికుమారుని ప్రేమగీతాలలో కులపాలికా ప్రణయాన్ని పరమోన్నత శిఖరాలలోకి తీసుకుపోయి నూతన లోకాలను తరలించి తెచ్చాడు. ఆయన ప్రతిపాదించిన స్త్రీపుంసయోగము 'శ్రీదమై శాంతమై సమీచీనమైన అవ్యయపదంబు' చేర్చునట్టిది. ప్రేమ జ్ఞానసాధన తోడి మార్గము. అక్కడ అది మలినమగుటచేత కర్మ ప్రాధాన్యము లేదు. ఈ పుంస యోగమే ఒక యజ్ఞము. ఇది ఒక తపోమార్గము. అందుకే -

> నీవు నా గుండె కదలించినావు దేవి!
> దేవి! తత్రత్యులగు సర్వ దేవతలును
> అనభిహుతములు హవ్యకవ్యములు పొంది
> నా యకర్మిష్ఠిత క్షమించినారు దేవి!
>
> (గిరికుమారుని ప్రేమగీతాలు - 87)

---

41. Poetry hardly functions without the animated association of fair sex. But the conventions in this regard looked mere animation and no more. So he left the traditions with due defference and approached nature to kindle his new candle. There he found and revealed the graceful girl, affectionate sister, faithfull friend and loving mother. It was those direct reactions and intimate emotions to whom poet gave local habitation and colour in the new Poetry.

— Fifty years of Modern Telugu Literature. (Unpubliseed essay) Rayaprolu Subba Rao.

రాయప్రోలు ఈ సిద్ధాంత స్వరూపమును రూపనవనీతములో (1953) విశదముగా చర్చించాడు.

"పురుషుడు శిక్షాకైంకర్యమై బ్రహ్మచర్యను పరిత్యాగం చేస్తున్నాడు. స్త్రీ కూడా పితృగోత్రంతోపాటు అక్షయమైన కన్యాసౌభాగ్యమును విసర్జిస్తున్నది. ఉభయ త్యాగ భాగధేయమే దాంపత్యం" (పే. 46).

"ఉద్వాహ ప్రయోజనం తీరగానే దంపతీ సాంగత్యం స్నేహసాహచర్యంగా మారుతుంది. మారవలె" (పే. 47).

"శుచిమంతమైన మిథునాంతర్మథనంలో చిత్సుఖోదయం అవుతుంది. అది అమలినమైన స్మృతిలో అనుజ్జ్వల దీపనంగా భాసిస్తుంది. ఆ భావమును నిలుపుకునేవారు ఏతత్పునరావృత్తిని పర్యుషితంగా పరిత్యజిస్తారు. కాగా జీవిత ఖేలనం తనూత్సంగమును విడిచి భావాంబరంలో విస్తరిస్తుంది. (పే. 48).

"ప్రణవమూ ప్రణయమూ ఈ రెండూ యోగుల సాధనలోనివే. శారీరకంగా సంయమనములో అనుతప్తమైన ఇంద్రియాచాలనం ప్రణయ రూపమును పొందింది. ఇంద్రియాతపములో ఉన్ముక్తమైన విషయ సహస్రారస్పందనం ప్రణవ రుచిగా భాసించింది. ఒకటి అంగజాతము, ఒకటి భావభూతము" (పే. 198).

కొంచెం దీర్ఘమైనా పైన ఉట్టంకించిన వాక్యాలు దంపతీనిష్ఠమైన ప్రణయ స్వరూపమును విస్పుటంగా వ్యక్తం చేస్తున్నవి. రూపనవనీతమన్న ఈ రూపకం ఈ సిద్ధాంతమును రూపొందించేందుకు విస్తరించిన రచన.

దంపతినిష్ఠ శృంగారంలోనూ మిథునకామం అపత్యనైమిత్తికమె కాని తరువాత తరువాత దాని అవసరము లేకుండా పోతుంది.[42] అక్కడ స్నేహమే ప్రాచుర్యం వహిస్తుంది.

---

42 "ప్రజార్థము కాని యట్టి భార్యారతి చూడ పాశవము కన్నను హీనము" విశ్వనాథ- రామాయణ కల్పవృక్షము- బాల 1.35.

ఈ విధంగా తన శృంగార మీమాంసలో దంపతినిష్ఠ శృంగార స్వరూప చర్చచేసి దీని విస్తృతిని చూపిస్తాడు కవి. పూర్వకవులు విప్రలంభ సంభోగముల్ విస్తరించి శృంగార శాఖలయిన స్నేహవత్సలాదుల సంగ్రహించిరనీ వాటికి కూడా రస స్థాయిని కలిగిస్తున్నట్లుగా ఆయన పేర్కొంటాడు. వీటిల్లో ఒక దానికి ప్రాధాన్యమూ మిగిలిన వాని కప్రాధాన్యమూ అనేవి లేవు. ఈ త్రివిధ మయిన స్నేహ గంగా ప్రవాహానికి శిఖరం ప్రేమ. ఈ ప్రవాహాలు పైకెక్క దలచిన వారికి సోపానాలు కూడా. ఇవన్నీ అంగములైతే ప్రేమయే అంగి రసము.[43] శృంగార రస సమగ్రమూర్తి ప్రేమతత్త్వంలోనే ఉన్నది. భోజుని శృంగార ప్రకాశం ఇలా చెప్పతున్నది:

> ఆత్మస్థితం గుణవిశేష మహంకృతస్య
> శృంగార మాహురిహ జీవిత మాత్మయోనేః
> తస్యాత్మశక్తి రసనీయతయా రసత్వం
> యుక్తస్యయేన రసికోఽయమితి ప్రవాదః

రసనీయతయే రసమునకు కారణము. ఇది ఒక్క శృంగారానికే చెందుతుందని భోజుని మతం. రసనాద్రసమూమనామః అంటాడు. రాయప్రోలు భోజుని మతాన్ని పూర్తిగా అంగీకరించినవాడు కాదు. ఆయనకు దీనితోపాటు కరుణమూ ప్రధాన రసమే:

రమ్యాలోకంలో ప్రపంచించిన ఈ రెండు రసముల సిద్ధాంతమును బట్టి ఈ విధమైన వివేచన చేసికోవచ్చును. జీవుడు పంచభూత సూక్ష్మలతోనూ కర్మసంబంధంతోనూ ఈ శరీరంలో ప్రవేశిస్తాడు. అతనికి మనస్సుతో సంబంధం అహంకారం ద్వారా సంభవిస్తుంది. ఈ అహంకారం సాత్త్విక రాజస తామస రూపంగా మూడు విధాలు. రాజసాహంకారం ప్రవృత్తి హేతువు. సాత్త్వికాహంకారం నుంచి మనః ప్రసన్నత, జ్ఞానము దీప్తివై పుగా సాగుతుంది. ఇది శృంగారానికి స్థానం. తామసాహంకారం వాస్తవాన్ని భిన్నభిన్నంగా చూపిస్తుంది. వైవిధ్యం, భ్రాంతి మొదలైనవి దుఃఖహేతువులు. ఇదే కరుణ

---

43. ప్రేమసురత వాత్సల్యముల్ జీవితమున ప్రేమ కంగంబులగు అంగి ప్రేమ యొకడె ప్రేమ శిఖరావరోహణాభిజ్ఞులయిన మృదు సహృదయుల కివియెల్ల మెట్లులగును. (రమ్యాలోకము).

రసమూలం. ఈ రెండూ సాగినప్పుడు మిగిలిన రసములుగా విచిత్రమైన పరిణామం పొందుతాయి. శృంగార రసం పరిధిలోనుంచి వీరము, హాస్యము, అద్భుతము కలుగుతవి. కరుణరస పరిధిలోనుంచి రౌద్ర, భయానక, బీభత్సాలు కలుగుతవి. ఈ పరిణామంలో శాంతమునకు స్థానం ఉండదు. అయితే శృంగార కరుణాలు రసానుభవ కేంద్రం వైపుగా పయనించినప్పుడు చేరుకునే సౌందర్య బిందువు శాంతమే కావచ్చును.

> సుందరంబెల్ల శివమయి శోభజెందు
> శివమయంబెల్ల శాంతమై సిద్ధినొందు,
> సాంగసుందర శివమయస్వాదువయిన
> కవికళాకృతి శాంతమున్ శివము నగును.

## 5

నవ్యకవిత్వారంభము మొదటి ఇరవై సంవత్సరాల తరువాతనే ఒక ఉద్యమ స్ఫూర్తి పొందింది. 1918-19 లలో సాహితీ సమితి స్థాపించబడ్డది. ఇంతదాకా గురజాడ, రాయప్రోలు, అబ్బూరి, దువ్వూరి, వేంకట పార్వతీశ్వర కవులు ఈ ప్రవాహాన్ని కొనసాగిస్తూ వచ్చినవారు. ప్రధానంగా రాయప్రోలుతో నవ్యకవిత్వం నాలుగు భాగాలుగానే ప్రారంభం అయినా క్రమక్రమంగా ఎన్నో అంతర్విభేదాలు ఏర్పడుతూ వచ్చాయి. ప్రణయం, జాతీయోద్యమం, ప్రకృతి కవిత, రహస్యవాద కవిత ఇవి నాలుగు ప్రధాన మార్గాలు.

అయితే ఈ కవిత్వానికంతా మూలభూతమైన లక్షణం ఏది? "భావనా శక్తి (Imagination) బుద్ధిసూక్ష్మత కాదు. దానికంటె ఘనతరము భావనా శక్తి. ఇది కనబడని వస్తువుల కాంచగలదు. వినబడని ధ్వనుల వినగలదు.... భవన యోగ్యత, భావోద్రేకము దీనికి తోడుగావలయును" అని ఏకాంతసేవ పీఠికలో కృష్ణశాస్త్రి చెప్పినాడు.[44] ఈ భావనాశక్తి స్థూలంగా భావించవలసి

---

44. వెంకట పార్వతీశ్వర కవులు- ఏకాంత సేవ- పీఠిక (1922) కట్టమంచి రామలింగారెడ్డి కవిత్వ తత్త్వవిచారములో ఈ భావనాశక్తిని గూర్చి ఈ విధంగా నిర్వచించాడు: "పాత్రోచితములైన మాటలం బ్రయోగించియు, విషయమునకుం దగినరీతిని సొగసైన వర్ణనలం జేసియు, వృత్తములు సాక్షాత్తుగ నెదుట కన్నులకుగట్టినట్లు చేయుట" (పే 19) ఈ నిర్వచనము ఆధునిక కవులకు ఎంతో బలాన్నీ ప్రేరణనూ యిచ్చిందని భావించవచ్చును.

వస్తే లాక్షణికులు చెప్పిన భావయిత్రీశక్తి. ప్రతిభను ప్రాచీనాలంకారికులు కారయిత్రీశక్తిగా భావయిత్రీశక్తిగా విభజించడం జరిగింది కారయిత్రీశక్తి రచనాశక్తి. కావ్యములోని అనేక అంశములను ఒక కట్టుబాటులో ఒదిగించి కరుగబోసి సుందరమైన రూపచిత్రాన్ని నిర్మించే కౌశలము భావనాశక్తి ఈ అంశాలలో ఒకటి కాదు. ఇది ఉత్ప్రేక్షాదిరూపమూ, అతిశయోక్తి భరితమూ ఊహాశక్తికి పట్టాభిషేకం చేసే కల్పనమాత్రం కాదు. రామలింగారెడ్డి కవిత్వ తత్త్వ విచారంలో విమర్శకు అంతకూ మూలపీఠమైంది ఈ భావనాశక్తి.[45] అయితే భావకవిత్వం ఆరంభంలో ఏదో ఒక కథాసూత్రాన్ని ఆలంబంగా స్వీకరించినా క్రమంగా దాన్ని పరిత్యజించింది. ఆత్మాశ్రయమైన అభివ్యక్తీకరణ ఈ 'భావనాశక్తి'. ఈ రెండూ ఈ క్రొత్త కవిత్వాన్ని పాఠకులకు కొంచెం దూరంగా ఉంచాయి. "ఇరుల తెరలు, కలల బరువులు వంటి అపరిచిత పదములను వాడటమున్నూ, కొత్త కొత్త కవి సమయములను సృష్టించుకోవడమున్నూ కొత్త రకపు వ్యర్థపదములను కూర్చుకోవడమున్నూ కొంతవరకు ఈ కాలపు కొందరి పద్యములు అర్థము కాకపోవడమునకు కారణము"[46] అంటున్నారు చింతా దీక్షితులు. నవ్యకవిత్వారంభంలో కావ్యభాషలో వచ్చిన మార్పులను పరిశీలించేందుకు ప్రత్యేకమైన కృషి జరగవలసేవున్నది. కావ్యభాషలో మార్పు కూడా రెండు స్థాయులలో జరిగింది. కావ్యభాషకూ వ్యవహారభాషకూ నడుమ ఉన్న అంతరాన్ని తొలగించేందుకు గురజాడ ప్రభృతులు చేసినకృషి[47] వ్యావహారిక శబ్దజాలాన్ని స్వీకరించడం పలుకుబడిలోకూడా సాధ్యమైనంత సజీవ

---

45. ఈ రోజుల్లో (1914) కట్టమంచి రామలింగారెడ్డి తమ కవిత్వ తత్వ విచారము రాసి విమర్శపంథాల్లో గొప్ప దృక్పథము కలిగించి నవ్య సాహిత్యానికి క్రొత్త బోదెలు త్రవ్వారు. —విశ్వనాథ-నవ్యసాహిత్య పరిషత్ సప్తమ వార్షికోత్సవ అధ్యక్షోపన్యాసం- భారతి, ఏప్రిల్ 1940.
46. సహదేవ సూర్యప్రకాశరావు—వకుళమాల (పరిచయము) 1932 పే 7.
47. వ్యావహారికాన్ని స్వీకరించక పోయినా కావ్యభాషలో వ్యావహారికానికి అతిసన్నిహితంగా మార్పు తెచ్చిన కవులు తిరుపతి వేంకటకవులు. 'తెలుగునకున్న వ్యాకరణదీపము చిన్నది'అని వ్యాకరణశాస్త్రం యొక్క అసమగ్రతను చెప్పింది వారే.

భాషాస్వత్వాలయిన కాకువు, నానుడి, జాతీయమూ వాడుకోవడం. ఇలాసాగిన ఈ కృషికి తరువాతితరంలో ముత్యాలసరాలు ఇలా ఇతరమాత్రాచ్ఛందస్సులు వ్రాసిన కవులందరూ దోహదం చేశారు. ఇంకా కొన్ని అడుగులు ముందుకు పోయి జానపదుల వ్యవహారాన్ని కావ్యస్థం చేసే ప్రయత్నం నండూరి సుబ్బారావు యెంకిపాటల్లో జరిగింది. ఇది వెలువడినప్పుడు చెలరేగిన గాలిదుమారంలో చాలా ప్రధానకారణం దీనిలోని జానపద భాషే. ఇది మొదటి స్థాయిలో జరిగిన కృషి. రెండవస్థాయిలో జరిగిన కృషి భాషయొక్క ప్రధానమైన క్రియాదిరూపాల్లో మార్పు అంతగా కోరకుండా ఉన్న పరిధిలోనే శబ్దజాలాన్ని ఓతప్రోతంగా పూర్తిగా మార్చేసి కొత్త భావాలకు, వస్తువులకు, వర్ణనలకు కావలసిన నూతన శబ్దసామగ్రిని సృష్టిచేసుకుని చేసిన మార్పు. ఈ మార్పును తెచ్చింది రాయప్రోలు. మొదటి మార్పు ప్రధానంగా ధాతుక్రియా ప్రత్యయాలను ఆశ్రయించి ఉంటుంది. ఈ మార్పులో సారళ్యం ఉన్నమాట నిజమే కాని యిది సరిపోదు సంపన్నతకు. అందుకై నూతన అభివ్యక్తి సామగ్రి కావాలి. నూతన చైతన్యంలో స్పందించే శబ్దపల్లవము[48] చిగిరించాలి.

మన భాష అదృష్టం కొద్దీ ఈ రెండు పరిణామాలు ఏకకాలంలో సంభవించాయి. అయితే ఈ రెంటి సమ్మేళనము కొంత తరువాతికాలంలో ప్రగతివాద కవిత్వంలో కానవచ్చింది. అయితే శబ్దజాలంలో మౌలికంగా చాలా భేదం నవ్యకవిత—దానిననుసరించిన భావకవిత్వమునకూ—ప్రగతివాదానికీ ఉన్నది.

వాక్కు మనుష్యులలో సారభూతమైందని రసమనీ ఉపనిషత్తులు పేర్కొంటున్నాయి. తేజస్సుయొక్క ఉత్తమ భాగమే వాక్కునికూడా అక్కడ

---

48. భాష యెప్పటికిని భావముకంటె వెనుకబడి యుండును. భావములు మారినంత సులువుగా భాష మారదు— దువ్వూరి రామిరెడ్డి— కవికోకిల గ్రంథావళి-4. (1959) పే. 186.

పేర్కొనబడ్డది. అందుకే కవి కలమంత్ర[49] పరాఋణుడు. కలము అవ్యక్త మధురధ్వని. ఇది మంత్రమగుటకు ఉన్నత మనోభూమికలనుండి తేజోరూపమైన వాక్కు దర్శనం ఇవ్వవలసి ఉంటుంది. వేదములలో ఈ మంత్రము సదవాత్ ఋతస్య—అని ఎక్కడనో ఆ సత్య లోకములోనుండి అవతరించవలసినదని చెప్పబడ్డది.

ఈ అమృత శబ్దావతారమే నవ్యకవి ఆశ్రయించవలసింది ఋషుల యందు ఋతమును. కవులయందు యీ శబ్దము సౌందర్యమును ప్రతిబింబింప చేస్తుంది. ఒక దశలో ఈ ఋతసౌందర్యములకు అభేదముకూడా చెప్పవలసి ఉంటుంది. అప్పుడు కవులను సత్యశ్రుతులు అని చెప్పవలసి ఉంటుంది.

అభినవ కవితా దర్శనం చేసిన రాయప్రోలు ఈ వాగ్దేవీ తత్త్వము రమ్యాలోకంలో విలక్షణంగా విచక్షణ చేశాడు. సత్తపస్వులయిన ఋషీశ్వరుల తన్మయత్వదశలో అధికృతస్వరసంహితయై యీ అమృతశబ్దం రూపొందింది.

'భాషకంటె నవ్యులకు తపస్సు లేదు.' అని భాషారూపమైన ఉపాసనా పద్ధతిని ఆయన ప్రవచించాడు లోకములో ధర్మార్థ కామ మోక్షముల సాధ

---

49 Mantra is a word of power and light that comes from over-mind inspiration or some very high place of inspiration —SRI AUROBINDO.
What the Vedic Poets meant by Mantra was an inspired and revealed seeing and visioned thinking, attended by a realisation, to use the ponderous but necessary modern word, of some innermost truth of God and self and man and Nature and cosmas and life and thing and thought and experience and deed. It was a thinking that came on the wings of a great soul rhythm "chhandas...." —Sri Aurobindo, Future Poetry (1953) P. 280.

నానికి - అన్ని పరమార్థాలకు ప్రధాన సూత్రము భాషయే. ఈ సూత్రం మానవుడి బహిరింద్రియాలు విషయాలు మొదలైన బాహిరచైతన్యానికి-ఆ మనస్సు దాటిన జీవచైతన్యానికి నడిమి అనుబంధం, దీని రంగస్థలం ప్రధానంగా మనస్సు. ఈ మనస్సులో ఊహ ధరించే మొదటి రూపం భాషయే - అదీ మాతృభాష. నిరంతరం మనస్సుకీ ఇంద్రియాలకూ నడుమ భావ ప్రసారం యీ వాక్కు ద్వారానే సంభవిస్తుంది. ఈ వాగ్ధార జీవుణ్ణి మనిషిగా తీర్చిదిద్దుతుంది. తొలి ఊహనాటినుంచి మరణ పర్యంతము మనోవాక్కులు రెండూ అవినాభావస్థితిలో కొనసాగిపోతూ వుంటవి.

తొలి తెలుగు కవి నన్నయభట్టు కావ్యంలో అక్షర రమ్యతను ప్రతిపాదించాడు. కావ్యములో వాక్కు దాని కూర్పు మధురముగా సుందరముగా ఉండవలెనని ఆయన సిద్ధాంతము. ఈ వాఙ్మాధుర్యము, శబ్దముల నెన్నుకొనుటలో, వానిలోని అక్షరముల ఘటనము నెరుగుటలో, పదముల సంఘటించుటలో, సమాస నిర్మాణములో, పద్య రచనలో అనుస్యూతిగా ప్రవహించే ఒక మాధుర్యధారగా పేర్కొనవచ్చు, ఆయన 'గ్రసితాఖిల శబ్దబ్రహ్మ సమజ్ఞాపరుడు'. భారతాన్ని ఆయన 'అసదృశ మధుర గ్రథన ప్రసన్నము'గా తీర్చినాడు. శబ్ద బ్రహ్మోపాసనా సంప్రదాయం సంస్కృత కవుల త్రోవ. మురారి, భవభూతి మొదలైన కవులు ఈ విషయం స్పష్టంగా పేర్కొన్నారు. ఈ కవులు శబ్దాన్ని కేవలం ఒక ఉపకరణంగా కాక చైతన్యమయమైన భావకేంద్రంగా భావించారు. తరువాతి కాలంలో కవులకు శబ్దం కేవలం నిర్జీవ ధ్వని సమాహారమైంది. నన్నయభట్టు ఈవిధంగా శబ్దగతి చైతన్యావిష్కారానికి మార్గం ఏర్పాటు చేశాడు. శబ్దముల మేళనతంత్రం ఒకవి లక్షణమైన ప్రక్రియ. దానిని పల్కరించి దాని గుండె గుసగుసలను కవి వినగలిగి ఉండాలి. దాని రంగూ రుచీ వాసనా గుర్తుపట్టాలి.[50] పాతవడ్డ మాటలను విడిచిపెట్టాలి. ఇలా

50. "శాస్త్రిగారు తన తెలుగును చెక్కుతారు. దానికి నగిషీపడతారు. మెరుగుపెడతారు పద్యంలోనూ గద్యంలోనూ ఆయన అభిరుచి మహోన్నతమైనది ఆయన మనస్సులో ఎక్కడో అసలైన తెలుగు భాషకు నమూనా వుంది." కృష్ణశాస్త్రిని గూర్చి ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి - కృష్ణశాస్త్రి కృతులు - బహుకాల దర్శనం (విశ్వోదయ, కావలి 1965).

వ్యస్తాలుగా నానార్థవ్యంజకాలైన శబ్దాలను కూర్చి కవి వాటి కూర్పువల్ల అపూర్వ సౌందర్యాన్నీ, అనిదంపూర్వమైన భావాభివ్యక్తినీ సమకూరుస్తున్నాడు. నూతన సృష్టి ఏర్పడుతుంది. అందువల్లనే 'కవుల కుశల ప్రయోగ కౌశలము కొలది పరిణమింప దెప్పుడు కావ్యభాషగాగ' - యీ కుశల ప్రయోగమే సామాన్యులనుంచి కవులను వేరుచేస్తుంది.[51]

భావము అమూర్తము; శబ్దము మూర్తము. మానుషదశలోనే యీ శబ్దం చైతన్య రంగంలోకి అవతరించింది. అమూర్తమైన భావనా విశేషాన్ని అందుకొనేందుకు ఈ శబ్దం ఆరంభంనించీ యత్నిస్తూనే వున్నది. అయితే ఈ ప్రయత్నంలో అది క్రమంగా ఎదుగుతూవే ఉన్నది. ఈ విధంగా 'వాగర్థ శోభన వివృతికలన' కారణంగా శబ్దవాద మనంతమై శాఖసాగె.

అయితే శబ్దంకంటే ముందు నాదం పూర్వరూపం. అది ఈ భావాభివ్యక్తికోసమే ఉదయించింది. ఆకాశంలో ఉదయించిన ఈ అవ్యక్తనాద భంగతరంగాలే క్రమంగా స్వరంగానూ శబ్దంగానూ రూపొందడం జరిగింది. స్వరం మ్రోగుతూ వుంటుంది. శబ్దం సాగుతూ వుంటుంది. ఈరెంటికీ నడుమ అవ్యక్తానికీ వ్యక్తానికీ నడిమి దూరం ఉన్నది. అయితే వ్యక్తం అవ్యక్త వైపుకూ, అవ్యక్తం వ్యక్తం వైపుకూ ప్రయాణం చేయడం సృష్టి లక్షణం. అవ్యక్తతాలక్షణంగల స్వరం వ్యక్తమౌ లక్షణం ఉన్న సాహిత్యం ద్వారా ఇంకా స్పష్టాభివ్యక్తికోసం ప్రయత్నం చేస్తూవుంటే - తనకు స్పష్టత ఉన్నా తన శక్తి పరిధిని ఇంకా విస్తరించుకోవడంకోసం, అవ్యక్తంలో దోబూచులాడే వింత అనుభూతులను పట్టుకోవడం కోసం ఈ శబ్దం ప్రయత్నం చేస్తూనే వున్నది. అందువల్లనే శబ్దం సంగీత సంబంధాన్నీ, స్వరం సాహిత్యానుబంధాన్నీ ఎప్పుడూ ఆకాంక్షిస్తూ పంగ్వంధ న్యాయంగా వీలైన ఒకానొక సమృద్ధిని సాధించే ప్రయత్నం చేస్తూ వున్నవి

---

51. మహాకవియందు భాష యౌచిత్య సంపాదకమై దాని స్వరూపము రసమయమై యుండును. ఇచట నిది సంస్కృత, మిది తెలుగు, ఇది యర్థవివరిణామము. ఇది లక్షణ మొదలైన విమర్శలు పనికిరావు. - విశ్వనాథ సత్యనారాయణ-నన్నయగారి ప్రసన్న కథాకలితార్థయుక్తి (1954) పే. 179.

రాచికుండైన కవి రుచిప్రసన్న
పదమృదూపగూహన శయ్య బన్నగలడు
పద్యమందు గేయచ్ఛాయ, ప్రౌఢమయిన
కృతికళల సాధ్యమగు స్వరోద్గీతియందు. (రమ్యాలోకం)

పదసంబంధిపద్యము. పద్యము ఆరంభంలోనే ఒకానొక స్వరధర్మాన్ని మేళవించే ఉంటుంది. అయితే ఈ స్వరధర్మం 'నామవాచ్యంబుగాక అనాహతంబు సంచరిం చంతరింద్రియ స్థానమందు' ఈ అంతరింద్రియాలను స్పందింపజేసే ఈ నాదం కవిలో భావనకు రూపుదిద్దుకొనేవేళ ఒక క్రమరూపం తాలుస్తుంది. అదే పద్యం ఔతుంది. ఈ పద్యంలో స్వరధర్మం-కొందరు కవుల చైతన్య ధర్మాన్ని బట్టి సంగీత ధర్మం సుప్తంగానూ మరికొందరిలో జాగ్రద్దశలోనూ ఉంటుంది తొలి దశలో కవుల్లో శబ్దం ప్రధానంగా దానిలోనుంచే పలుకుతూ ఉంటుంది. రెండవ దశ కవుల్లో శబ్దం దాని అడుగున నిలచిన స్వర ప్రవాహంతో సాగుతూ పాకుతూ వుంటుంది. తెలుగు కవుల్లో తిక్కన మొదటి మార్గానికీ, నన్నయగారు రెండో మార్గానికీ ప్రాధాన్యం వహిస్తారు. ఆధునిక కాలంలో కాల్పనిక కవులు రెండో మార్గాన్ని ఆశ్రయించి, కవిత్వంలో సంగీత సాతత్యలక్షణాన్ని ప్రధానంగా ఉపాసించారు. బసవరాజు అప్పారావు గీతాలు, ఎంకిపాటలు, కిన్నెరసాని పాటలు మొదలైనవి ఈ మార్గంలో పరాకాష్ఠను అందుకొన్న రచనలు

రమ్యాలోకంలో శబ్దవిషయం మరికొంతకూడా ప్రస్తరింపబడ్డది. శబ్దాలు భిన్న భిన్న పరిమాణం కలిగి, సరళ పరుష స్వర వ్యంజనభేదంగల వర్ణాల సముదాయంగా రూపొందికూడా పద్యంలో గణరూపంగా నిబద్ధంఅయి ఆరోహణావరోహణలలో స్వరాలు పొందే సౌభాగ్యాన్ని పొందుతవి. మృదులసరళాక్షరముల సమ్మేళనంచేత ఆర్ద్రనవనీతలక్షణం శబ్దజాలానికి సంక్రమిస్తుంది. కావ్యానికి బహిస్సౌందర్యం శ్రవస్సౌభాగ్యంవల్లనే సిద్ధిస్తుంది. కుంతకుడు సుకుమార, చిత్ర మధ్యమార్గాలని మూడు పద్ధతులు పేర్కొన్నాడు. ఇక్కడ రాయప్రోలు పేర్కొన్నది ప్రధానంగా సుకుమార మార్గలక్షణైక దేశం. 'పదలరీ వృత్త పదమృదుబంధమెందు నవ్యలు రసవద్వాక్య సంధానమందు.' ఈ రసవద్వాక్యం మృదుబంధప్రచురమే. అందువలననే ఈ కవి రచనా

విషయంలో శ్రవణదారుణములైన పదాలను, సుకుమార భావాలను బాధించే పదాలను, రసభంజకాలైన పదాలనూ నిషేధించాడు సుకవిసూక్తంలో. అయితే యిక్కడ పైన పేర్కొన్న మూడు లక్షణాలు ఒకే పదమందు ఉన్నప్పుడా? వ్యస్తంగా ఉన్నప్పుడా? అన్నది ప్రశ్న. ఈ విషమశబ్దస్నేహం నిషేధించడం ప్రధానంగా రసభంజకవేళలోనే అని భావించే అవకాశం ఉన్నది. కాని ఆధునిక కావ్యాలన్నీ రసప్రధానాలు కావు. కొన్ని కేవలం సమాసాది వాక్యాలు. భావ సహకారులు, మృదుసంగీతమధురాలు. వీటికి శ్రవణ దారుణత్వమే నిషేధ్యతను కలిపిస్తుంది. చాలావరకు ఖండకావ్యాలు భావప్రధానాలైనవి. వీటిలో భావాను గుణమైన రచన ఉండాలి. ఆ రీతి, శబ్దఘటన భావభంజకము కారాదు రస ప్రచురాలైన కావ్యాలు— వీటిల్లో రసభంజక శబ్దసంయోగం విషిద్ధం. ఈ విధంగా ఈ పద్యంలో త్రివిధ రచనలు ఉపలక్షింపబడ్డాయి.

ఈ త్రివిధరచనల అంతస్స్వరూపము వాటి ప్రాణలక్షణమూ విశదీకరించి వాటి శరీరనిర్మాణ వైవిధ్యం చర్చించడం జరిగింది.

కవిత్వంలో శబ్దాలు అర్థాలు ఒక సమ్మోహనబంధంలో సహజీవనం చేస్తాయి. వచనంలోలాగా కవిత్వంలో భాష ఏదో ఒక అంశాన్ని స్పష్టంగా చెప్పడం కోసం ప్రయోగింపబడదు. కవిత్వంలో ప్రతి శబ్దమూ మార్చడానికి వీల్లేకుండా ప్రయోగింపబడుతుంది. కవిత్వంలో శబ్దం రమణీయార్థ ప్రతిపాదన విషయంలో స్వయం సంపూర్ణంగానే ఉంటుంది. అది ఏ ఇతర పదార్థాపేక్ష వహించదు. నడకలో, నాట్యంలో పాదవిన్యాసానికి ఉండే భేదమే వచనంలోను కవిత్వంలోనూ ఉంటుందని పాల్ వాలెరీ ఒకచోట చెప్పాడు.[52]

---

52. Walking, like prose, aimes at the attainment of perfectly a definite objective. It is an activity directed towards reaching a specific end. Dancing consists in a means of actions, but their objective lies within themselves. It leads nowhere. It does envisage an end, but this end exists only as an ideal state of mind (A) Poem is designed expressly to be reborn from its ashes to become once more what it has just succeeded in being — Paul Valery - The Art of Poetry- Quoted from 'Response to Poetry' Dr. G.B. Mohan (1968) P. 34.

నవ్యకవులు పద్యంలో పదబంధాన్ని గూర్చి ఎంతో జాగ్రత్త తీసుకోవడం కారణంగా భాషాస్వరూపం సంపూర్ణంగా మార్పు పొందింది. అయితే నవ్యకవుల ఈ సాధన కొద్దికాలంలోనే కొన్ని పరిమితులకు లోబడిపోయింది. ఈ పరిమితి ప్రధానంగా భావనకు, వస్తువుకూ సంబంధించింది. అందుచేత ఈ కవుల్లో చాలా మంది ఆ వస్తువును వర్ణించడం పూర్తయిందనిపించగానే అస్త్రసన్యాసం చేయ వలసివచ్చింది. ఎప్పటికప్పుడు తమ వస్తుపరిధిని విస్తరిస్తూ సమగ్రజీవన దృక్పథాన్ని పెంపొందించుకొన్న కవులు మాత్రం తరువాతి కాలంలో తమ రచన కొనసాగిస్తూ వచ్చారు.

రాయప్రోలు సుబ్బారావు ప్రారంభించిన ఈ శబ్దబ్రహ్మోపాసనమే నవ్యకవితకు ఒక దీప్తిని, వైలక్షణ్యాన్ని కలిపించింది. తెలుగు కవిత్వ పరిధులను విస్తరింపజేసింది.

## 6

నవ్యకవికి స్వేచ్ఛాప్రియత్వము ప్రాణస్థానీయమైంది. ఆధునికకాల లక్షణాన్ని స్వాయత్తీకరించుకొన్న కవి అంతర్బహిః ప్రేరణలన్నింటివల్ల సజాగరూకుడై తన బంధనాలన్నింటినీ త్రెంచుకోయత్నించాడు. ఈ విష యంలో భారతదేశంలో నాడు ప్రవర్తితమౌతూవున్న స్వేచ్ఛాసమరంలో కవీ భాగం పంచుకోవలసి వచ్చింది. బంకించంద్ర ఛటర్జీ, రవీంద్రుడు మొదలైన సారస్వతస్రష్టలు స్వరాజ్య సిద్ధికోసం రచనలు చేయడం - ఆ సమరాన్ని తమ రచనల ద్వారా ప్రేరేపించడం చేశారు.

బంకించంద్రుని వందేమాతరం గీతం వేద ఋషి వాక్కువలె - అగ్ని జ్వాలవలె-చైతన్య సూర్య తేజస్సువలె దేశం అంతటా వ్యాపిస్తూ తన మాటతో పాటు స్వేచ్ఛా పిపాసను ప్రజ్వలింపజేస్తూ ప్రసరించింది. జాతి యావత్తూ నిద్రనుంచి మేల్కొని దారిద్ర్యక్షుబ్ధమై, వర్ణభేద దురాచారక్లిన్నమై, విస్మృతౌ దార్యమైయున్న వర్తమాన దేశపటంలో లోతుల్లో సుజలాం సుఫలాం అనీ తుమివిద్యా తుమిధర్మ ఇత్యాదిగా జాతి భౌతిక మానసిక ఆధ్యాత్మిక శక్తు లన్నింటికీ కేంద్రంగా మాతృ దేశ రూపం సాక్షాత్కరించుకొన్నది.

తెలుగుదేశంలో చిలకమర్తి కవి 'భరతఖండబు చక్కని పాడియావు' అనే పద్యంలో నాటి దుర్దశ వర్ణింపబడ్డది. కవులకు స్వాతంత్ర్యోద్యమం పరమోత్కృష్టమైన ఆశయం అయింది. వ్యష్టిజీవనంనుంచి సమష్టిజీవనందాకా అన్ని అంశాలకూ లక్ష్యం స్వరాజ్యప్రాప్తిగా స్వధర్మ ఆచరణగా నిర్దేశింపబడ్డది.

ఈ దశలో తెలుగు కవిత్వంలో దేశభక్తి రచనలు రావడం ప్రారంభం అయింది.

ఈ రచన వెనుక ఉన్న ప్రేరణలు రకరకాలు. జాతి సంస్కరణాభిలాష ప్రధానంగా మనిషి కేంద్రంగా - నవ్యసృష్టి చైతన్యమే సమాజపురోగమనానికి హేతువని భావించే దృష్టి ఒకటి. ఈ దృష్టిలో వచ్చిందే "దేశభక్తి" అన్న గురజాడవారి రచన. ఈ గేయానికి వ్యక్తి కేంద్రం. తనలో మంచితనాన్ని పెంచడం, తద్వారా సమాజాన్ని పరివర్తింపజేయడం యీ గేయం నిర్దేశిస్తున్నది. 'సొంతలాభం కొంతమానుకు పొరుగువారికి తోడుపడవోయ్ అన్నదమ్ములవలెను జాతులు మతములన్నీ మెలగవలెనోయ్' అని వ్యక్తి ఎలా ఎదిగి ఇతరులయెడ తన బాధ్యతను నిర్వహించాలో నిర్దేశించడం జరిగింది. అంతేకాక, మతములుకూడా వ్యక్తుల సమూహాలేకాబట్టి వాటిలోనూ సంస్కారం అన్నదమ్ముల సఖ్యం ఆధారంగా సాగవలెనని చెప్పబడింది.

ఈ గేయమంతా యీ విధంగా మనిషిని కేంద్రంగా సమష్టిలో వ్యష్టి ప్రాధాన్యాన్ని భావించేదిగా రూపొందింది. అందుకే ఆయన దేశమంటే మనుషులేనని మట్టికాదని చెప్పవలసి వచ్చింది. ఇక్కడ దేశం అంటే ఒక సమాజ సమష్టిభావరూపంకంటే - ప్రత్యక్షంగా మనుష్యుల సమష్టిగానే భావించవలెననీ ఆయన భావం. కవిని ప్రేరేచింది సంస్కరణోద్యమమేకాని స్వాతంత్ర్యోద్యమం కాకపోవడంవల్ల ఆయన దేశభక్తి వ్యక్తినిష్ఠగా రూపొందింది.[53]

---

53. వీరి రచనలన్నింటిలోనూ వీరేశలింగం మానవోద్యమ ప్రభావమే కనబడుతుంది. దేశభక్తి అనే కావ్యంలోనూ హైందవజాతీయోద్యమపు దేశభక్తి స్ఫురించదు. — దేవులపల్లి కృష్ణశాస్త్రి - పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము - భారతి, జనవరి 1949.

ఈ గేయానికి సరిగ్గా ఎదురూగ్గా నిలువగలది రాయప్రోలు 'జన్మ భూమి'. ఈ రచన ప్రధానంగా వర్తమానోద్యమ చైతన్యాన్ని ఆశ్రయించింది. సమష్టి మాతృస్వరూప సందర్శనంలో వందేమాతరం పోలిక తెచ్చే వీలులేక పోయినా జాతి చైతన్యం ప్రేరేపించేందుకు చరిత్రలోని గొప్పతనాన్ని ఆధారంగా స్వీకరించింది. 'మహితాభిమాన దివ్యదీక్షా సుఖస్ఫూర్తి, నాటి వస్తువు. అందుకే 'ఏ పూర్వపుణ్యమో ఏ యోగబలమో జనియించినాడవీ స్వర్గఖండమున'. ఈ స్వర్గఖండం పూర్వపుణ్య కర్మఫలం. ఈ భావం వెనకాల కేవలం యీ భూమిలో పుట్టడం అపూర్వ తపః ఫలమే అయితే మనం ఎంత గొప్ప వాళ్ళం. ఇది అనంతభూతలిపై ఆద్యంతముల ప్రసక్తి లేకుండా సృష్టితోపాటు సాగి వచ్చే నేల. ఇది నాటి జాతికి కలిగించవలసిన స్వాభిమానదృష్టి.

ఈ గీతం వెనకాల ఉన్న మనోలక్షణం ఏమిటి? జాతి దురహంకార లక్షణమా- అంటే కాదు. స్వాత్మవిస్మృతిపొంది తననుగూర్చిన హైన్యభావంతో లోలోతుల్లో కుదించుకుపోతున్న భారతీయుణ్ణి వెన్నుతట్టిలేపి స్వరూపాన్ని దర్శింపజేసి ఆత్మవిశ్వాసాన్ని కలిగించే యత్నంయిది.[54] అందువల్లనే గేయం మొదట 'ఏదేశమేగినా ఎందుకాలిడినా ఏ పీఠమెక్కినా ఎవ్వరెదురైనా పొగడరా నీ తల్లి భూమి భారతిని నిలువరా నీ జాతి నిండు గౌరవము'అని పరదేశీయుల యెదుట క్రుంగిపోవలసిన అవసరం లేదని చెప్పుతూ ఉన్నాడు కవి. అందు వల్లనే గేయం చివర 'భరతపుత్రుడనంచు భక్తితో పలుక అవమానమేలరా అనుమానమేల' అని అడుగుతున్నాడు. ఈ గేయం వెనుక ఉన్న మనోలక్షణం యిది. కాని కవికి ఉన్న విశ్వమానవ చైతన్య దృక్పథం ఉన్నట్లు సాక్ష్యం అక్కడక్కడా గోచరిస్తుంది.[55]

---

54. ప్రతి జాతికీ ఒక ప్రత్యేక చైతన్యముంటుంది. దాని వికాసానికి ప్రత్యేక మయిన స్వభావ లక్షణాలు ఉంటాయి. తన పరిసరాల ద్వారా గ్రహించినదాన్నంతా తనకనుకూలంగా మార్చుకుంటుంది. ఆత్మా విష్కారం దీనికనుబంధించి ఉంటుంది — శ్రీ అరవిందులు—కవిత్వము- జాతీయ చైతన్యము(అను) జనధర్మ—6, (1969) పే. 142.

55. విరియునే జాతుల విద్వేషతమమెల్ల / అఱునే దేశాల అర్థదాహ మొకింత మాతృదేశంబిచ్చు మధురాన్నపానాల / స్వేచ్ఛగా సుఖియింతురే యెల్ల ప్రజలు ఆ యనంతులీల లనుభవించుచును.
'రవీంద్ర కవి' - ఆంధ్రావళి.

ఆయనకు దర్శనమిచ్చిన భారతభూమి చల్లనితల్లి, స్వర్గఖండము, అనితరసాధ్యమైన సాధన వల్లనే లభించే పుణ్యభూమి. ఇక్కడ ఋషులు, రాజులు, కవులు, భక్తులు సంగీత సాహిత్యములు రత్నమౌక్తికాదులైన ఐశ్వర్యాలు ఇవన్నీ వర్ణించి పుణ్యదేశము, దివ్య విశ్వము అని నిరూపించి చిట్టచివర సర్వజగత్తుతో అభేదాన్ని ప్రతిపాదించాడు కవి. జాతికి స్వేచ్ఛా సమర రంగంలో దూకేందుకు కావలసిన ప్రేరణ యిచ్చిన రచన యిది.

భారతజాతి చైతన్యంలో ఉండే - దేశకాలాతీతంగా మానవ జీవనానికి కేంద్రంగా ఈ పృథివిని భావించడం అబ్బూరి రామకృష్ణారావు 'పృథివీ ప్రశంస' గేయంలో కానవస్తుంది ఈయనకు పృథ్వి సర్వదేవతాస్థానము, కర్మస్థానము, జన్మస్థానము. రామకృష్ణారావుగారు ఈ గేయం రచించేనాటికి ఆయన మీద రవీంద్ర అరవిందుల ప్రభావం ఉన్నది.[56] ఈయన పృథ్వి - విశాలావని. శోభాతిపావని, కాంతికల్లోలిని, వైభవశాలిని, ధవళ యశోవతి, స్నిగ్ధతేజోవతి, నవమోహిని, దయావాహిని. ఈ ఎనిమిది విశేషణాలు సామాన్యమైన భూఖండం యెడల కంటే ఆమెను సౌందర్య కేంద్రంగా చైతన్యస్ఫూర్తిగా, దేవతామూర్తిగా భావించడం తెలుపుతవి. ఈ పృథివి ఈశ్వరుని సృష్టి. సృష్ట్యారంభంలో ఈశుడు ఇక్కడికి విసరివేశాడు ఈ ఖండాన్ని. సృష్టిక్రమం కూడా ఆకాశాద్వాయుః వాయోరగ్నిః ఇత్యాదిగా పైనించి క్రిందికి వచ్చేదే కావడంవల్ల ఈ పృథివి ఈశ్వరుని లీలావసరంగా విసరివేయబడ్డదే. కవి యిక్కడ ఈ భూమిమీది నుంచి ఆకాశం దాకా ఒక

---

56. **1917 - 19** మధ్యకాలం గురుదేవులు రవీంద్రనాథఠాకూర్ సన్నిధిలో శాంతినికేతనంలో గడిచిపోయింది. వంగభాషా సాహిత్యాధ్యయనంతో పాటు అరవింద రవీంద్రుల బహుముఖ శేముషీవిభవాన్ని స్వాయత్తం చేసుకునే ప్రయత్నం కూడా జరిగింది. అశేష భారతీయ కవులతో, దేశభక్తులతో వారి పరిచయ స్నేహాలు అక్కడే పల్లవించాయి. ఆనాటిదే 'ఊహాగానం' - అబ్బూరి రామకృష్ణారావు - ఊహాగానము ఇతర కృతులు (**1973**) లో బూదరాజు రాధాకృష్ణ, ఏల్చూరి సుబ్రహ్మణ్యం వ్రాసిన పరిచయంలో.

తేజశ్చక్రాన్ని నిర్మిస్తూ వున్నాడు. ఆరంభ పుణ్యక్షణాలు - నాటి సౌభాగ్యాన్ని భావిస్తూ వున్నాడు. ఈ రచన మధ్యాక్కరలతో ప్రయోగం. దానిలోని నిద్రించే గేయలక్షణాన్ని మేల్కొలిపినాడు కవి ఈ గీతంలో. భూదేవి శాటిపై ఆకుపచ్చని ఆకులు పండు వెల్తురు రేకలు దర్శిస్తున్నాడు కవి. ఆకుల్లో పచ్చదనమంతా సూర్యకిరణాలవల్ల సంభవించేదే. అది జీవశక్తి. భూమండలం మీదికి దిగింది. ఈ రెంటికీ అభేదం చెప్పుతున్నాడు కవి. ఈ చైతన్య విలాస వేళలో ఆమె సౌందర్యం ఒక పాటగా ప్రసరించింది. సంస్కృతి యొక్క తొలి వికాసం ఇది.

జగత్తు అనుక్షణవికాసశీలమైంది. దినదినాపూర్వమై పొలుచుదావకీన విభాతకేళి - ఇది అడుగడుగునా పురోగమనశీలమైంది.[57] ఈ భూమి ప్రాణ శక్తిచేత (అశ్వక్రాంతే) మనశ్శక్తిచేత (రథక్రాంతే) ఆత్మశక్తిచేత (విష్ణుక్రాంతే) క్రమక్రమంగా ఉన్నతోన్నత దివ్యభూమికలను అవతరింపజేసు కొంటున్నది. ఒక యుగం యొక్క చివర వేరొక యుగానికి ఆరంభమే అవుతున్నది. అందువల్లనే 'ప్రాభాత గానమ్ములా, నీ యస్తమానమ్ములా ఏవి సుందరతరమ్ములొక్కొ' అని ప్రశ్నవేస్తున్నాడు. ఆరంభ గీతంలో భూమి అవతరణాన్ని దానిపై జీవశక్తి విలాసాన్ని చూపి అది క్రమక్రమంగా ఎలా వికసిస్తూ అనార్తవంగా ఎలా నిలిచిందీ చూపించాడు. సీతాసతీవేణిలోని పూవుతో పోల్చడంతో జగత్తులో జీవన విధిలో ప్రాథమికావసరాలకు మించిన వ్యక్తి శీలము వికాసము ప్రారంభమయినట్లు సూచన. ఇందుకు సీతాదేవిని చూపడం. ఆమె భూమిలో ఉన్న శక్తికి ప్రతీక. ఆమె భూపుత్రి. భూమిని చీల్చుకొని పైకి లేచివచ్చిన ప్రకృతిశక్తి. పూవు భూమిలో కలిగే సుందర తరమైన పరిణామానికి ప్రతీక. అంతఃప్రేరణ పరిణామమూ అనుసంధింప బడుతూ సాగిపోతున్నవి. అదే మానవజాతికి పురోగతికి సూచన. అదే గీతాపరిమళము.

---

57. అశ్వక్రాంతే రథక్రాంతే విష్ణుక్రాంతే వసుంధరా
శిరసా ధారయిష్యామి రక్షస్వ మాం పదేపదే.
(మృత్తికాస్నాన మంత్రం)

తరువాత అనూహ్యమైన ఆశ్చర్యదాయియైన ప్రకృతి సౌందర్యాన్ని వర్ణిస్తూ వున్నాడు కవి. గాలులు, వాగులు, వెదుళ్ళు అన్నీ సచేతనులుగా భావిస్తూవున్నవి. అయితే మానవుడు పరమప్రేమ రూపిణియైన ఆ భూదేవి ఒడిలో నదగి అల్లరిలేక విన్నాడట. మానవుడు తన అహంకారం పెంచుకొని ప్రకృతిని జయించడానికి ఎప్పుడైతే పూనుకున్నాడో అప్పుడు ఇక్కడి సౌందర్యం అతని దృశ్యపరిధిలోనుంచి తొలగిపోతున్నది.

చివరిభాగంలో కవి స్వేచ్ఛను కోరుతున్నాడు. ఈ స్వేచ్ఛ అన్నిరకాల బంధనాలనుంచి, అన్నింటినీ విడిచి తాను మళ్ళీ భూదేవి ఒడిలో ఒదిగి ఆ సౌందర్యానుభవం పొందేందుకు సిద్ధంగా ఉన్నాడు. శృంఖలములు సుందర ములై కానవస్తున్నవి. వీటిని త్రెంచి అన్ని ప్రాకారాలను దాటివచ్చి నీ మధుర విపంచిని వింటానని అతని కోరిక. ఈ ప్రాకారాలన్నీ నాగరకతచేత, ఇతర కారణాలచేతా ఏర్పడ్డవి. కాని కవి చివరకు కోరుకునేది మృత్తికారేణువును, ఇది సకలమునకు జన్మస్థానము. దీన్ని విడిచి ఎంతదూరం సాగినా మళ్ళీ ఇక్కడికి రాకతప్పదు.

ఈ విధంగా సాగిన పృథివీ ప్రశంస కవి భావనాశక్తికి ప్రతీకగా ఉన్నది. గురజాడలో వ్యక్తిదగ్గర ప్రారంభమై, రాయప్రోలువద్ద దేశందాకా విస్తరించి అబ్బూరి రచనలో సకల విశ్వముగా రూపొందింది జాతీయభావ వస్తువు. ఈ గేయంలో ప్రస్తావింపబడ్డ ఎనిమిది విశేషణాలతో రచన అంతా పృథివిని ఒక చైతన్యమయమైన దేవీ మూర్తిగా నిరూపిస్తున్నది. భూసూక్తం ఇదే విషయాన్ని రూపిస్తున్నది.[58] ఈ గేయం అడుగున విశ్వమానవ చైతన్యభావన ప్రకాశిస్తు న్నది. ప్రకృతి ఉపాసనకు మౌలికతత్త్వం నిరూపింపబడుతూవున్నది. 'తల్లిగా ధాత్రిగా దేవతామతల్లిగా సమస్త పరాపర కామ్యములకు[59] చెప్పబడ్డ పృథివియే యిక్కడ వస్తువయింది.

---

58. దేవీ హిరణ్యగర్భిణీ దేవీ ప్రసూదరీ సదనే సత్యాయనేసీద సముద్ర వతీ సావిత్రీ! అనోదేవీ మహ్యంగీ మహోధరణీ, మహోధ్యతిష్ఠతు శృంగే యజ్ఞే యజ్ఞే విభీషిణీ! ఇంద్రపత్నీ వ్యాపినీ సరసిజ ఇహ! వాయుమతీ జలశయనీ స్వయంధారాజా సత్యంవోపరిమేదినీ - భూసూక్తం.

59. రమ్యాలోకం.

ఈ గేయం భావనచేత సౌందర్యం చేత అంతస్తరంగితమయ్యే చైతన్య లక్షణం చేత తెలుగుభాషలోనే ఒక అపూర్వమైన రచనగా పేర్కొనాలిసింది.

తరువాత జాతీయోద్యమ సంబంధంతో కవిత వ్రాసిన కవి దువ్వూరి రామిరెడ్డి. ఈయన ప్రారంభరచనల్లో మాతృశతకమనే రచనవున్నది[60] ఈ రచనలు 1916-18ల నాటివి. ఈ రచనల్లో నాటి జాతీయోద్యమపు తీవ్రత ధ్వనిస్తుంది. ప్రాచీన చారిత్రకౌన్నత్యము. ఇక్కడివీరులు, శిల్పులు ఇత్యాదిగా ప్రశంస ఉన్నది. ఈ రచనలో కచకుచాదివర్ణనచేసే కవులపై నిరసన కూడా వ్యక్తం చేయబడ్డది 'స్వాతంత్ర్యంబను శక్తి నీ హృదయ దేశంబందు మున్ బుట్టి గ్రీస్ చేతస్సున్ రగిలించి, రోమనులకున్ సిద్ధించి, యాంగ్లేయ హృద్ద్యోతంబై యటుపై జపానుచయినాయుం బారసీకంబు దీప్సాతిన్ లేక బునః ప్రయాణగతి నీపై వ్రాలెనో మాతరో' అని స్వాతంత్ర్యభావం కూడా ఈ దేశంలోనే ఉద్భవించిందని ఇక్కడినుంచే సర్వదేశాలకూ వ్యాపించిందని చెప్పుతాడు. నాటి దేశీయులను గూర్చి విద్యాహీనులౌ పుత్రులుంటే లేకేమి? అని ప్రశ్నించి దేశం విజ్ఞానమయంకావాలని కాంక్షిస్తాడు. ఈ రచనలో కవి ప్రధానంగా వీరరసభావాన్ని ప్రబోధిస్తాడు. అందువల్లనే పరశురాముణ్ని, ఖరాదులను సంహరించిన రాముణ్ని ప్రస్తుతిస్తాడు. జగత్తంతా అజ్ఞానంలో అనాగరకంగా ఉండగా 'నీకా కాలంబున మించె నాగరక విద్యాసంపదల్ మాతరో' అని స్వాభిమానాన్ని స్వాహంకారాన్ని ప్రశంసిస్తాడు.[61] ఈ భాగంలోనిదే 'దేశమాతృస్తవము'. ఇది రాయప్రోలువారి రచనల ప్రభావంతో రచింపబడినట్లుగా కానవస్తున్నది. ప్రధానంగా పూర్వచరిత్ర స్మరణ చేస్తూ 'స్వాతంత్ర్య బలివేది సన్నిధి నాత్మలర్పించునట్లుగా నాత్మ శక్తి కృప చేయుమని ప్రతిపక్ష వీరసంహార ఘోర భీకర కరాళరూపిణియైన తల్లిని ప్రార్థించాడు. అతనికి దేశమాత దివ్య శక్తి ప్రపూతగా దర్శనం యిచ్చింది. తరువాత నక్షత్రమాల అన్న సంపుటిలో జాతీయ గీతము, రాట్నపు పాట అన్న రచనలు ఉన్నవి.

---

60. కవికోకిల గ్రంథావళి - 2. దువ్వూరి రామిరెడ్డి.
61. "వరతత్త్వ ప్రకృతి ప్రభావముల నుత్పాదించు వేదంబులం.
ఖోరి వ్రాక్కుచ్చిరి కారె నీ కొమరు లింపుల్ మీఱగన్" పే. 314 (పై గ్రంథము).

దేశమాతృ సంకీర్తనం తొలి రచనలో ప్రధానాంశం. 'నీ పదపీఠిని ప్రాణ సుమంబులు నిల్పి భజించెదము. గర్హిత దాస్యభవంబును మాన్పి సుఖంబులు మాకిడుము' అని ప్రార్థిస్తాడు. ఈ భావమే నాడు సర్వత్ర జాతీయోద్యమాన్ని ప్రేరణ కలిగించినది. రాట్నపు పాట నాటి ఉద్యమంలో ప్రవేశించి గాంధీగారి ప్రభావపరిధికి లోబడి రచించిన రచన.[62] మొత్తంమీద ఈ రచనలన్నీ ప్రధాన జాతీయభావ వాహినిలో అంతర్భవించేవే.

జాతీయోద్యమపు ప్రేరణకు మించి రామిరెడ్డిగారు జగద్వ్యవహారాన్ని సమష్టిగా ఆలోచించిన సన్నివేశం లేకపోలేదు. ప్రథమ ప్రపంచ సంగ్రామంతో లోకం అట్టుడికి పోతున్న రోజులు అవి. జాతీయోద్యమ భావాలవెనుక ప్రపంచ శాంతి సౌభాగ్యాల ఊహలు కూడా పోరాడుతూ వున్నాయి. శాంతి అహింసలు ప్రధానాంశాలుగా సాగిన గాంధీ ఉద్యమం యుద్ధ వ్యతిరేకతను స్పష్టంగా ప్రకటించకుండా ఊరుకోలేదు. అప్పుడు ఈ స్వాతంత్ర్యం యుద్ధము, హింస లేని ఒక శాంతిస్వరంగా భావించబడ్డది. జాతీయత, అంతర్జాతీయత ఈ రెండూ పరస్పర విరుద్ధాలు కావనీ, ఒక భావానికి రెండో భావం పోషకమని స్ఫురించింది. ఈ మహాభావం ప్రచురంగా మేల్కొన్న రచన రామిరెడ్డిగారి స్వాతంత్ర్య రథము.

కవి స్వాతంత్ర్య రథావతరణాన్ని పరమ రమణీయంగా భావించాడు. మేఘాలన్నీ అమృతాన్ని ప్రసరింపజేస్తూ వున్నవి. ఇంద్రచాపతోరణం ప్రకాశిస్తున్నది. మెరుపులు చుట్టూ మెరుస్తున్నవి. ఈవేళ స్వాతంత్ర్యరథం ఆకాశంలో వెడలింది. అవతరిస్తున్నది. అమృతము జీవశక్తి అంటే సత్పదార్థము ఇంద్రచాపతోరణం ఆకాశంలో సూర్యకిరణాల పరిణామంవల్ల ఏర్పడేది. ఇది చైతన్య శక్తి. మెరుపులు ఆనందరూపమైన శక్తికి సూచకాలు.

---

62. గాంధి దేవుడై యవతరించె నన్నారు. ఆయనయే కృష్ణుడు. రాటమే వేణువు. తన్మధురధ్వని వంశీనాదము. భారతదేశము బృందావనము. ప్రజలు గోపికలై యాయన చెప్పినట్లే కోట్లకుకోట్లు జనులు గుమిగూడి యవలంబింపజొచ్చిరి- విశ్వనాథ సత్యనారాయణ - వేయి పడగలు (1939) పే. 116

స్వాతంత్ర్య రథావతారం సచ్చిదానంద త్రిపుటితో దిగివస్తున్నది. ఈ త్రిపుటి సన్నిధిలో దుఃఖము లేదు. దోషము లేదు. అది సూర్యుడిలాగా దిగివస్తున్నదని దానివల్ల 'నవీన జీవనము' లోకములో వింతగా నింపబడిందని ఆయన వివరించాడు. స్వాతంత్ర్యం కేవలం అధికారం మార్పుకాదు. నూతన జీవన కవాటాలను విస్ఫారం చేసింది. సర్వజనులకు శాంతినీ, సౌఖ్యాన్నీ కలిగించే ఆనందమయ జీవనం అది. అదియే నూతనధర్మం. అందుకే ఆ రథంలో కనుపట్టిన ధర్మజీవనాకారమొ, శాంతిబింబమొ. అకల్మష సత్యనికేతనంబొ, సంసారఫలస్వరూపమొ అని ఉత్ప్రేక్షించాడు కవి. ఈ విశేషణాలు సామాన్యమైనవి కావు. ఆమె సంసార ఫలస్వరూపిణి. ఆమెకు ధర్మజీవనంలో, శాంతితో, సత్యముతో అభేదము ఆమె రూపించిన నూతన జీవనస్వరూపం. అధికారంపేర అన్యాయం చేసే వ్యవస్థలన్నీ కూలిపోవడం సభ్యత పేర జరిగే అన్యాయాలన్నీ చదిసిపోవడం. ఆమె అమృతపాత్ర ఒకచేత, రుధిరపాత్ర ఒకచేతా ధరించింది. ఈ రెండూ అహింసకూ, హింసకూ, ఆనందశోకాలకూ సంకేతాలు. ఆమె ఈ రెంటినీ ఏకం చేసింది. కొందరేమొ అమృతాన్ని మాత్రం సేవిస్తూ మిగతావాళ్ళు రక్త పంకంలో పడివుండరాదని ఆమె శాసనం. ఆమె మహిమచేత అమృతపాత్రలో నివేశింపబడ్డ రక్తం దివ్యదుగ్ధంగా మారింది. ఈ దివ్యదుగ్ధమే భావి మానవాళికి అందించింది ఆమె ఆ రథం అనర్గళంగా సాగిపోతూ వున్నది. పూర్వ సింహాసనమ్ములు, మణిమయ కిరీటములు, భోగమందిరములు అన్నీ నేలమట్టమైపోయినయ్. నేలంతా బంగారుపంట పండింది. చక్రనేములు తాకిన జాడలు సస్యలక్ష్మికి కల్యాణ స్థానాలయినవి. ఆమె చివరకు శాంతి శాంతియని శాంతిపాఠాన్ని చెప్పింది. ఈ శాంతిపాఠం వెనుక సర్వజగత్ క్షేమాన్ని ఆశించే ఉపనిషన్మంత్రస్ఫూర్తి కలదు. 'సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై, మావిద్విషావహై' ఇత్యాదిగా మంత్రములన్నీ సర్వమానవ క్షేమానుకరమై ఒక ఆనంద వ్యవస్థను దర్శనం చేస్తూ వున్నవి. రామిరెడ్డి తన రచనలోనూ, 'లేవు దివ్యతురంగముల్, లేవు కరులు, ప్రజలె యా తేరుమోకుల బట్టువారు' అని తాను భావించే ప్రజాస్వామ్య వ్యవస్థ స్వరూపాన్ని విస్పష్టం చేస్తాడు ఈ రచనలో.

రామిరెడ్డిగారి వరకూ వచ్చిన ఉపాసనాలక్షణంలోనించి జాతీయ కవిత భవిష్యద్దర్శనంవైపు దృష్టి ప్రసారించింది. భారతదేశానికి లక్ష్యమైన ప్రజాస్వామ్య వ్యవస్థను విస్పష్టమైన దర్శనం చేశారు ఆయన.

వ్యక్తినుంచి జాతికీ, జాతినుంచి సర్వమానవాళికీ, అక్కడనుంచి ఉజ్జ్వల మైన భవిష్యత్తుకూ బాటలువేస్తూ తెలుగులో జాతీయ భావన కొనసాగింది.

అయితే ఈ జాతీయ భావనలోనే అంతర్భాగంగా ఆంధ్రరాష్ట్ర భావో ద్యమంకూడా కొనసాగింది. ఈ రాష్ట్ర ఉద్యమం దేశం ఎత్తుకొన్న మహో సంగ్రామంలో ఒక భాగమే. అందువల్ల కవులు ఆంధ్రజాతిని కీర్తించినా, తెలుగు చరిత్రలో ఘట్టాలను స్తుతించినా అది అంతా ఈ ప్రధాన భావనా వాహిని అంతర్భాగంగానే. కాని ఈ రాష్ట్రవాదం వెంట స్వాభిమానం పెరిగి, ఇతర భాషా భాషీయులయిన భారతీయులను నిందించడం, అల్పంగా నెంచడం వంటి భావాలుకూడా అక్కడక్కడా లేకపోలేదు. ఈ దురభిమానం ఎక్కడో కానవచ్చిన మొత్తం రచనకు ఈ దోషం అంటగట్టేందుకు వీలులేదు.

## 7

గత శతాబ్దం చివరి దశకం నిజంగా తెలుగుదేశానికి బంగారుపంట తెచ్చిన కాలం. ఈ శతాబ్దంలో మూర్ధన్యస్థానంలో నిలువబడ్డ ఆధునిక కవు లంతా ఈ కాలంలో ఉద్భవించినవారే. రాయప్రోలు సుబ్బారావు, శివశంకర స్వామి, అబ్బూరి రామకృష్ణరావు, అనంతకృష్ణశర్మ, దువ్వూరి రామిరెడ్డి, బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, పింగళి - కాటూరులు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, అడవి బాపిరాజు, వేదుల సత్యనారాయణశాస్త్రి, కొడాలి సుబ్బారావు, కొడాలి ఆంజనేయులు, నోరి నరసింహశాస్త్రి, నాయని సుబ్బారావు యిలా ఎంత మందిని చెప్పాలి- ఇందరూ మరి కొందరూ ఈ పది సంవత్సరాల కాలంలో ప్రభవించినవారే.

రాయప్రోలుతో రూపుకట్టిన అభినవ కవితా రూపం అక్కడక్కడా వ్యస్తంగా సాధన చేయబడుతూ వచ్చింది. కొన్ని కొన్ని పత్రికలు ప్రోత్స హిస్తున్నవి కూడా. అయితే దీనికి ఇంకా విస్తృతమైన ఉద్యమరూపం రాలేదు. తృణకంకణం రచించాక రాయప్రోలు శాంతినికేతనం వెళ్ళిరావడం, తరువాత హైదరాబాదులో తెలుగు శాఖాధ్యక్షులుగా నియమింపబడటం జరిగింది. ఒక విధంగా ఆయన తెలుగు కవిత్వ ఉద్యమస్థానానికి కొంచెం దూరంగా ఉండ వలసివచ్చింది. అబ్బూరి రామకృష్ణరావు, దువ్వూరి రామిరెడ్డి మొదలైన వారు

కూడా ఎక్కడో ఎక్కడో ఉంది ఈ నూతన కవితా ప్రయోగాలు చేస్తూ వున్నారు.

బందరులో తాను అధిష్ఠించిన శతావధాన కవితాసింహాసనాన్ని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి వదలివేశాడు. గిరతము, గుంటూరు సీమలతో కవిత్వంలో అవధానాల ఫ్యాషన్ తెరమగుకుపోవడం మొదలైంది. వేగాతివేగోక్తి దుర్వ్యసనం కవులను వదలివేయడం ప్రారంభించింది. బందరులో యువకవులు క్రమంగా తిరుపతి కవుల ప్రభావ పరిధినుంచి విడివడటం మొదలైంది. ఇంకా అక్కడ అక్కడా కొత్తగా చదువుకున్న యువకులు నూతన కవిత్వంతో ప్రయోగాలు చేయడం మొదలెట్టారు. పిఠాపురంలో ఆస్థానకవుల పుత్రుడు కృష్ణశాస్త్రి బ్రాహ్మ సంప్రదాయ బలంతో తన మనస్సును దిద్దుకుంటున్నాడు. వేంకట పార్వతీశ్వరకవులు ప్రాచీన మార్గాన్నుంచి సాగివచ్చి నూతన కవితామార్గంలో సాధన ప్రారంభించారు. కవికొండల వేంకటరావు గోదావరితీరంలో కొత్త కొత్త పాటలను రచిస్తూ వున్నాడు. మదరాసులో నండూరి సుబ్బారావు, బసవ రాజు అప్పారావుల కృషి సాగుతూ వున్నది. తెలుగు దేశం అంతా యువకవుల్లో ఈ భావ ప్రసారం పరిచితంగానో, అపరిచితంగానో నూతనత్వానికి అభిముఖంగా కొనసాగుతూ వచ్చింది. కవిత్వ పాఠకులలోనూ ఈ కొత్తదనానికి అనుకూల్యం ఏర్పడుతున్నది.

ఈ సన్నివేశంలో పుట్టింది సాహితీ సమితి. సాహితీ సమితితో నవ్య కవిత్వం ఉద్యమస్థాయినందుకున్నది.

సాహితీసమితి తెనాలిలో స్థాపింపబడ్డది 1919 లో కవిత్వమూ, లలిత కళలూ అంటే అభిమానంకల యువకులందరూ ఒకచోట సమావేశమయ్యేవారు. వీరందరూ ఆధునిక విద్యాసంపత్తి కలవారు. అందరూ ఇంగ్లీషువాఙ్మయంలోని ధోరణులను అవగాహన చేసుకున్నవారు, అంతేకాదు, ఫ్రెంచి మొదలైన పాశ్చాత్య భాషాసారస్వతాలతో కూడా వీరిలో కొందరికి పరిచయం ఉండేది. ఎప్పటికప్పుడు కొత్త పుస్తకాలు చదవడం కొత్త ధోరణులతో అవగాహన కల్పించుకోవడం వీళ్ళ ప్రవృత్తి. బెంగాలీ, హిందీ, మరాఠీ మొదలైన వాఙ్మ

యాలను అధ్యయనంచేసి ఆ కావ్యాలను చదివేవాళ్ళు కూడా వీరు.[63] వీళ్ళకు సామాన్య సంబంధము సాహిత్యమే మైత్రికూడా ఇంకా ప్రధానంగా ఉండేది వీళ్ళమధ్య. ఈ సాహితీసమితికి కేంద్రబిందువు శివశంకరశాస్త్రి[64] క్రమంగా సాహితీసమితిలో చాలామంది సభ్యులుగా చేరడం జరిగింది. తెనాలి, గుంటూరు, బందరు, కాకినాడలు సమితికి ముఖ్యకేంద్రాలుగా ఏర్పడ్డవి. అందరు సభ్యులూ ఎక్కడో ఒకచోట కలుసుకోవడమూ, తమ తమ కొత్త రచనలు వినిపించు కోవడమూ, చర్చలు సాగించటమూ చేస్తూ వచ్చారు. దేవులపల్లి కృష్ణశాస్త్రివంటి వారు తమ రచనలేకాక ఇతరుల రచనలనుకూడా ఆత్మీయతతో మధురమైన కంఠంతో నూతన యువకులకు వినిపిస్తూ నవ్యకవిత్వానికి అనన్యమైన ప్రచారం సాధించిపెట్టారు.[65] సాహితీసమితి క్రమంగా సాహితి, సఖి అనే పత్రికలను కూడా నిర్వహించింది. రచనలోనేకాక ముద్రణలోనూ ఒక వైశిష్ట్యాన్ని ఈ కవులు చూపించారు.

---

63. నవ్యాంధ్ర సాహిత్యవీథులు. పే. 297.
64. సాహితీసమితి సభ్యత్వాన్నిగూర్చి శివశంకరశాస్త్రి ఇలా రాశారు: "బహు కాల పరిచయము, అన్యోన్య ఆదరానురాగములు, మనస్సుల కలయిక, భారతీయ సంస్కృతీ సంప్రదాయ విద్యలపై లక్ష్యము, శాంతచిత్తముతో వినయముతో పనిచేయు స్వభావము, కళ, భాష, విజ్ఞానశాస్త్రాదులలో దేనియందైన ప్రావీణ్యము, అమంగళకరములు జుగుప్సాకరములైన వానిని పరిహరించి ఉదాత్తములు విజ్ఞానదాయకములైన కృషుల నెరవేర్పగలవారితో ఈ సోదరవర్గము సాహితీసమితిగా వర్ధిల్లుతున్నది." శివశంకరశాస్త్రి - ఆంధ్ర పత్రిక మే 7, 1947 (న. సా. వీ. 296 పే. నుంచి).
65. ఎలాంటి మధురగాఢమైన బంధం మమ్మల్ని అందర్నీ పెనవేసి పట్టుకున్నది. ఒకరికొకరం మా కావ్యాలను గూర్చి, కష్టసుఖాల్నిగూర్చీ ఉత్తరాలు వ్రాసుకునే వారం. అన్యోన్యము మెచ్చుకునే సంఘము వీళ్ళది అని కొందరు మమ్మల్ని అనేవారేమో. కాని ఆ మాట అన్యాయం. అప్పుడు అమాయకపు ప్రాయం మాది కీర్తికామమూ స్వార్థమూ అహంకారమూ మా మనస్సుల్ని కలుషితం చేయలేదప్పుడు.-కృష్ణశాస్త్రి: పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము (1949)

సాహితీసమితి కృషి ఆరంభంలో ఎవరూ ఇంత ప్రధానమైందవుతుందని భావించకపోయినా క్రమంగా తెలుగు సాహిత్యంలో మలుపుతెచ్చిన ఉద్యమంగా రూపొందింది. ఇలాంటి ఉద్యమమే కర్నాటక భాషలోనూ 'గెలెయరగుంపు' చేసింది[66].

సాహితీసమితి కృషి తెలుగులో ఆధునిక సాహిత్యంలో ఎన్నో శాఖల వికాసానికి దోహదం చేసింది.[67] ఎన్నో ప్రయోగాలు చేసే యువకులను వెన్నుతట్టి నిలబెట్టింది. ఆ సాహిత్యంమీద విమర్శను వెలయించింది. పండితులచేత ప్రాచీన సాహిత్యపరుల చేత ఔనని అంగీకరింపచేసింది

సమితి ఏర్పడ్డ తరువాతనే నవ్యకవిత్వం - అభినవకవిత - భావకవితగా రూపొందింది.

---

66 The Gumpu was a Circle of Kannada literary men who grew together as friends first and foremost. The Gumpu stepped in at a very crucial moment in the life of renassant Karnataka. It has been producing much good work in various directions ever since 1922. - V. K Gokak-Bendre, Poet and seer (1970) P. 37.

67. ఖండకావ్యం, కథానిక, నాటిక, విమర్శ, నవల ఇతర భాషలనుంచి అనువాదాలు ఈ విధంగా ఎన్నో క్రొత్త క్రొత్త రచనలతో సాహిత్యం సంపన్నమయింది ఈ సమితి పరిధిలో.

# వర్తమాన కవిత్వ దర్శనము

అభ్యుదయ కవిత్వానంతరం తెలుగు కవితారంగంలో వచ్చిన ధోర ణులను, కవిత్వాన్ని అంచనా వేయడం ఈ సంధానం ఉద్దేశ్యం. స్థూలంగా భారత స్వాతంత్రం వచ్చిన తర్వాత కవితారంగాన్ని అంచనా వేయడంగా భావించవచ్చు.

భారతదేశానికి స్వాతంత్రం వచ్చిన తరువాత - తత్పూర్వం ఉన్న స్వరూపం - ఆదర్శం - లక్ష్యం అన్నీ మారిపోయాయి. ఒక జాతీయాదర్శం పరపాలన నుంచి విముక్తిని పొందడం అప్పటి లక్ష్యమై - తరువాత స్వతంత్ర మైన జాతి స్వేచ్ఛగా భౌతిక, సామాజిక, సాంస్కృతిక రంగాలలో స్వస్థితినీ, సుస్థితినీ పొందే ప్రయత్నాలు ఆరంభమైనాయి. అయితే స్వాతంత్ర్యంతో పాటు దేశ విభజన జరగడం - జాతి చైతన్యంలో ఆత్మవిశ్వాసానికి బదులు పరాజయ భావాన్ని నెలకొల్పింది. ఈ పరాజయ భావం సంకుచితత్వానికీ, భయానికీ, పిరికితనానికీ హేతువైంది. ఆ గుణాలు తెచ్చే అవగుణాలు అన్నీ జాతికి సంక్రమించినాయి.

దాదాపు నూటయాభై సంవత్సరాలనుంచీ కొనసాగుతూ వచ్చిన భారత జాతీయ పునరుజ్జీవనోద్యమం ఆగిపోయినట్లే కనిపించినా జాతి అంతర్గత చైతన్యంలో అంతర్వాహినిగా కొనసాగుతూ వస్తున్నది. చైతన్యభూమికలోని ఈ విరుద్ధ శక్తుల సంఘర్షణ మన చరిత్రగా కొనసాగుతూ వచ్చింది. మన సాంస్కృతికరంగంలో ఈ సంఘర్షణ ప్రధాన వస్తువైంది.

అన్ని రంగాలలోనూ రాజకీయరంగం ప్రాధాన్యం వహించింది. మన దేశ చరిత్రలో రాజకీయాలకు ఇంత ప్రాధాన్యం ఇంతకుముందెన్నడూ లేదు. పరాయి పాలన కొనసాగిన ఇన్ని వందల యేళ్ళలో కూడా సాంస్కృతిక రంగం స్వతంత్రమై జాతి భావుకతకు, సజీవమైన అనుస్యూతికి పట్టం కట్టింది. అయితే స్వాతంత్ర్యోదయం తరవాత ఈ భావ ప్రవాహం మందగించింది.

సాంస్కృతిక నాయకత్వం లోపించింది. అన్ని రంగాలూ పదవీ దాహం కలవాళ్ళూ, ధనకాంక్షాపరులూ ఆవరించారు.

తెలుగు సాహిత్యం విషయం వస్తే స్వాతంత్ర్య సన్నివేశం ఒక మలుపును తెచ్చింది. కవి స్వాతంత్ర్యం క్రమంగా ప్రభుత్వోత్సవాలకూ, ఆకాశవాణి మొదలైన సంస్థలకూ ఒదిగిపోతూ వచ్చింది. బహుళ ప్రచారం పొందుతూ వచ్చిన పత్రికలు వారి ఇష్టానిష్టాల మీద రచయితను నిలబెట్టడం, నిరాకరించడం చేస్తూ వచ్చాయి. కవులు చాలామంది తమకు తెలియకుండానే ఈ మయసభలో విభ్రాంతులౌతూ వచ్చారు.

అప్పటికే కాల్పనిక సాహిత్యోద్యమం క్రమంగా వస్తు సమాప్తి పొందడం జరిగింది. తద్వారా నవ్యసంప్రదాయ సాహిత్యంగా రూపుకడుతూ వచ్చింది. ఈ నవ్యసంప్రదాయంలో - కాల్పనికోద్యమంలోని వాగర్థసౌందర్య సంధానం సంప్రదాయ సాహిత్యం తనలోకి చేర్చుకున్నది. జాతీయోద్యమ పునరుజ్జీవన భావధార - సంప్రదాయాన్ని సజీవంగా, అవిచ్ఛిన్నంగా నిలబెడుతూ వచ్చింది. కేవల భావ శబలతను చిత్రించే ఖండకావ్యం నుంచి దాన్ని మానవ జీవనంలో అనుభవలోకంలో ప్రతిఫలింపజేసి రసోదయానికి మార్గాన్ని సుగమం చేసిందీ నవ్యసంప్రదాయ సాహిత్యం.

అయితే వేరొక వైపు ఈ నవ్యతాస్పర్శ లేకుండా ప్రాచీన ధోరణిలోనే కొయ్యబొమ్మల వంటి రచనలు చేసేవాళ్ళూ కొంతమంది లేకపోలేదు. అట్లాగే ప్రయోగాల పేరుతో నిష్ప్రయోజనమైన నిరర్థకమైన సుదూరకళావాదాల సార్థవాహులూ లేకపోలేదు. సాహిత్యక్షేత్రం అనేకముఖమై శ్లథమైపోతున్న దశ అది. ఈ దశ సాహిత్యంలో విశృంఖలతనూ, అలసదృష్టినీ ప్రవేశపెట్టింది.

కృష్ణశాస్త్రి 1949 లో (ఈ ఆరంభవేళలో) ఇలా అంచనా వేశాడు - "సమాజానికి దూరమై కొందరు కవులం నిర్జీవ రచనలు చేస్తాం. కొందరం కేవలం చమత్కారం, చురుకుదనం చూపించి మిరుమిట్లు గొలుపబోయి వికాసమూ ఆనందమూ ఇవ్వలేకపోతాము. కొందరం 'ప్రజలు, ప్రజలు' అంటూనే ప్రజాలోకానికి దూరంగా ఉంటూ దాని స్వరూపమూ, సంప్రదాయమూ జీవద్భాషా గ్రహింపలేక విజాతీయ సమాజంలోనుంచి వచ్చిన రచన

లను మన కంఠాలనుంచి వదులుతాం. కొందరం కేవలం కొత్తదనం చూపించి ప్రముఖులు కావడానికి ఉత్త ఓటిబొమ్మల చుట్టూ కొత్తదుస్తులు అతుకుతాం."

కృష్ణశాస్త్రి వాక్యాలను విశ్లేషణ చేస్తే మనకు స్థూలంగా గోచరించే అంశాలు ఇవి :

* నవ్యతా స్ఫురణలేకుండా గతానుగతికంగా సాగే ప్రాచీన కావ్య ధోరణులు పురాణానువాదాలూ, ప్రబంధరచనలు, క్షేత్రమాహాత్మ్యాదులూ, చిత్రకావ్యాలూ—
* చమత్కారం ప్రధానమై శబ్దాలగారడితో తళుక్కుమనిపించే ముక్తకాదులు—
* ప్రజాసాహిత్యం పేర ఈ దేశపు స్వభావానికీ పరిస్థితికీ సంబంధం లేని వైదేశిక భావప్రేరిత రచనలూ, సుఖాసన (ఈజీచైర్) సిద్ధాంతుల ధోరణులూ—
* ప్రపంచ యుద్ధంవల్ల నిరాశా నిస్పృహలకు లోనైన యూరోపియ కళారంగాలలో ప్రభవించిన విధ్వంసక, కళామూల్యచ్ఛేదక, వైయక్తిక కళావాదాలైన అధివాస్తవిక, దాదాయిస్టు ధోరణులు—

వీటన్నింటినీ కృష్ణశాస్త్రి తిరస్కరిస్తున్నాడు. అయితే సమష్టి ప్రయత్నం ద్వారా ఒక వినూతనోజ్జ్వల యుగాన్ని నిర్మించ వచ్చుననే ధోరణి ఆయనలో స్ఫుటమవుతున్నది.

> "కాని మనలో కొందరు గొప్ప కవిబ్రహ్మలూ ఉన్నారు. జీవవంతమైన సృష్టి చేసినవారూ చేయగలవారూనూ, వీరందరూ వెంకటశాస్త్రి మొదలుకొని అతినవ్యకవిదాకా ఒక మహా పరిషత్తులో సమావేశమయి కవిప్రాజాపత్యము స్థిరపరిస్తే బావుండును. ఆ మహామేళనంలో నుంచి జగత్తంత మానవాలయం కట్టగల ఏ తెలుగునాటి వ్యాసుడు పుట్టుకొని వస్తాడో! అంతవరకూ నవ్య కవితోద్యమం సాగవలసిందే!"

కృష్ణశాస్త్రి పై మాటల్లో — జగత్తంత మానవాలయం కట్టగల - ఒక మహాకవి కోసం నిరీక్షణ కనబడుతున్నది. ఇంత పెద్ద భావానుకలనం విశ్వ

జనీనమైన ఏ మహేతిహాసమో చేయదగింది. కాని స్వల్ప పరిధిగల ఖండ కావ్యాలలో సాధ్యమయ్యేది కాదు.

ఇప్పటికి తెలుగులో ప్రగతివాద కవితోద్యమం పశ్చిమ శిఖరాని కెక్కింది. సర్రియలిస్టు దాదాయిస్టు ధోరణులు ఒక్కసారి మెరుపు మెరిసినట్లు మెరిసినా త్వరలోనే అంతర్హితమయ్యాయి.

లండన్‌లో 1935 లో ఏర్పడ్డ భారతీయ ప్రగతిశీల రచయితల సంఘ ప్రణాళికలో ఎక్కడా మార్క్సిస్టు సిద్ధాంతాలకు అనుబద్ధం కావలసిన అంశం లేదు.

It is the duty of Indian Writers to give expression to the changes taking place in Indian life and to assist the spirit of progress in the country. Indian literature, since the breakdown of classical culture, has had the fatal tendancy to escape from the actualities of life.

పైన పేర్కొన్న ప్రణాళికాంశాలనుబట్టి చూస్తే ఉదాత్త సంస్కృతి (క్లాసికల్ కల్చర్) విచ్ఛిన్నమయిన తరువాత దేశంలో ఒక పలాయన ప్రవృత్తి ఏర్పడినట్లు చెప్పబడ్డది. ఈ క్లాసికల్ సంస్కృతి అంటే ఏమిటో ప్రగతివాద ఉద్యమం ఎప్పుడూ స్పష్టంగా పేర్కొనలేదు. ఈ ప్రణాళికలోనే ఉన్న Such literature was produced particularly during the past two centuries, one of the most unhappy periods of our history, a period of disintegrating feaudalism and of acute misery and degradation for the Indian people as a whole అన్న వాక్యాలవల్ల జన జీవనంలోని శైథిల్యం పలాయన ప్రవృత్తి వలస పాలనవల్ల మనకు సంక్రమించిందని స్పష్టపడుతున్నది. అయితే తెలుగు దేశంలో ప్రగతి వాదోద్యమం ఎప్పుడూ దేశీయ సంస్కృతినీ, జాతి ఉపలబ్ధినీ కించపరిచే ధోరణినే వ్యక్తం చేసింది. మీదు మిక్కిలి తెలుగు దేశంలో ఈ ఉద్యమం నిర్వహించిన అభ్యుదయ రచయితల సంఘం ఆవిర్భావం వెనుక జస్టిస్ పార్టీ వ్యాపింపజేసిన భావ బీజాల అంకురాలు ఉన్నాయ్. జస్టిస్ పార్టీ

జన్మతః ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలం కావడంవల్ల - మంచి గతమున కొంచెమేనోయ్, కన్నుగానని వస్తుతత్త్వము కాంచ నేర్పరు లింగిరీజులు, దేశ మంటే మట్టికాదోయ్, అన్న - ఇంగిలేయుల ధర్మరాజ్యము వర్ధిల్లాలని కోరిన గురజాడ ఈ ప్రగతివాద ఉద్యమానికి ఆదిపురుషుడు కావడం, జాతీయోద్యమ ప్రబోధకమైన రాయప్రోలు వంటి వారి సాహిత్యం సంకుచిత ధోరణిని వ్యక్తం చేసేదిగా భావింపబడడమూ జరిగింది.

భారత దేశంలోని మిగిలిన ప్రాంతాలలో ప్రగతివాద కవిత్వోద్యమానికి ఉన్నంత వైశాల్యమూ, సంప్రదాయానుబంధమూ తెలుగు దేశంలో కనిపించదు. హిందీలో నిరాలా, పంత్, అజ్ఞేయ్‌ల స్థానం విలక్షణమైంది. అఖిల భారత ప్రగతిశీల రచయితల మహాసభలకు 1930 లో అధ్యక్షత వహించిన ప్రేమ్ చంద్‌లో సంప్రదాయ ప్రగతిశీల ధోరణుల అనుస్యూతీ, సమన్వయమూ కానవస్తుంది. తమిళంలో సుబ్రహ్మణ్య భారతి నుంచి ఈనాటి వరకూ, కన్నడంలో బెంద్రే, కువెంపుల నుంచి గోపాలకృష్ణ అడిగదాకా, మళయాళంలో కుమారన్ అశన్ నుంచి ఈనాటి అయ్యప్ప పణిక్కర్ దాకా పరంపరా విచ్ఛేదం ఉద్దిష్టం కాలేదు.

కాని తెలుగులో సంప్రదాయ విచ్ఛేదం ప్రధానాంశంగా ప్రగతివాదోద్య మంగా సాక్షాత్కరిస్తుంది. తెనాలిలో మొదటి అభ్యుదయ రచయితల సంఘం మహాసభల్లో అధ్యక్షుడు తాపీ ధర్మారావు – "మన పూర్వ సాహిత్య మంతా జనసామాన్యానికి ద్రోహం చేస్తూ ఉందన్న మాట తేటపడుతుంది. అదంతా స్వార్థపరులు చేసిన మోసం అని బోధపడుతుంది. నిజాన్ని మభ్యపరచి, ప్రజలను చిన్నపరచిన వాఙ్మయం, అబద్ధాలకు చేయూత నిచ్చి అధికులను బలపరిచే సాహిత్యం కల్లలకు కటికతనానికి పట్టుగొమ్మ" అని వివరించడం జరిగింది. మన పూర్వ సాహిత్యమంతా అని చేసిన అంచనా వెనుక జాతిని విచ్ఛిన్నం చేయడానికి ఆంగ్లేయులు నాటిన ఆర్య - ద్రావిడ, బ్రాహ్మణ - అబ్రాహ్మణ బీజాలు తెలుగు దేశంలోని ఈ ఉద్యమం పునాదుల్లోకి ప్రవేశిం చాయి. అందుకే తెలుగు సాహిత్యంలో ప్రగతివాదోద్యమం ప్రధాన సాహిత్య ప్రవాహానికి దూరంగా ఉంటూ వచ్చింది. రక్ష్యాగరుధూపంతో రమణీయపు శివమెత్తిన రణాచారి గణాచారి రణగుణాల ధ్వనులతో, గంతులతో సాగిపో యింది.

అందువల్లనే ఈ ఉద్యమంతో ఎప్పుడూ సంప్రదాయ సాహిత్య చైతన్యాన్ని జీర్ణించుకున్న శ్రీశ్రీ ఇమిడి ఉండలేదు. మహాప్రస్థానంలో చాలా గీతాలు మార్క్సియ పరిధిలోనికి ఇమిడి పోలేనివే. వ్యత్యాసం దేశ చరిత్రలు రాసే రోజుల్లోనే - రాజకీయాలలో నానాజాతి సమితి ఎటువంటిదో కళా ప్రపంచంలో స్రరియలిజం అట్టిదని చెప్పాలి (1935) అంటాడు. అరసం ఉద్యమం తెనాలిలో ప్రారంభమైనా రాయిస్టులు ఎవరూ ఇందులో పాల్గొనలేదు. శ్రీశ్రీ కూడా రాజమండ్రిలో 1946 ప్రాంతంలో జరిగిన మూడవ మహాసభలో, విజయవాడలో 1955 లో జరిగిన ఐదవ మహాసభల్లో మాత్రమే పాల్గొన్నాడు. మధ్యలో నైజాం కొలువు చేశాడు. 1950 లలో మేమేలాంటి అనార్కిస్టు రచన చేయడం ఆయన నిబద్ధత ఏ మేరకు ఉందో స్పష్టం చేస్తుంది. ఆరుద్ర ఒకచోట ఇలా అన్నాడు – "తొలి రెండు మహాసభలకూ శ్రీరంగం శ్రీనివాసరావు రాలేదు. అప్పటికింకా ఆయన తాను అనార్కిస్టుననీ స్రరియలిస్టు ననీ చాటుకునేవాడు. పాశ్చాత్య దేశాలలో స్రరియలిజం వైఫల్యాలను గురించి శెట్టి ఈశ్వరరావు చక్కని వ్యాసం రాశాడు. దానిమీద శ్రీరంగం శ్రీనివాసరావు కోపం తెచ్చుకున్నాడు. ఈ రా. కు రాసిన ఒక కార్డులో ఇంతకు నువ్వు కమ్యూనిస్టువు కదా! అని శ్రీనివాసరావు ఎత్తిపొడిచాడు." (ఆరుద్ర - ప్రజా కళలూ ప్రగతివాదులూ - పుట. 167).

అయితే స్వాతంత్ర్యోదయ వేళలో తెలంగాణం నుంచి వెలువడ్డ ఒక విలక్షణమైన గొంతులో జాతీయ ప్రజాస్వామ్య ప్రగతివాద ధోరణుల సమన్వయం గోచరించింది-

'నా తెలంగాణ కోటి రత్నాల వీణ'

'ప్రాణములొడ్డి ఘోర గహనాటవులన్ వడగొట్టి మంచి మా

గాణములన్ సృజించి........

తెలంగాణము రైతుదే

ముసలి నక్కకు రాచరికంబు దక్కునే.'

'జెండా ఒక్కటి మూడు వన్నెలది

దేశం బొక్కటే భారతా ఖండా సేతు హిమాచలోర్వర'

తెలంగాణం అనే మూలం నుంచి దాశరథి ప్రపంచం నలుమూలలకూ ప్రాకే మహావృక్షంగా తన కవితాదర్శనం చేశాడు. దాశరథి తెలంగాణం భౌగోళిక ఖండానికి పరిమితం కాదు. కాని అది అతడు మొలకెత్తిన నేల. 'మూడు కోటుల నొక్కటే ముడి బిగించి పాడినాడ మహాంధ్ర సౌభాగ్యగీతి' అని మహాంధ్రాన్ని ఆహ్వానించి

'ముక్కన శాంతి బీజములు మోయుచు బోయి
విశాల భూమి నల్దిక్కుల చల్లి వచ్చితిమి'

—అని ప్రపంచ శాంతి సందేశాన్ని ప్రసరింపజేశాడు.

స్వాతంత్ర్యోదయంతో ప్రగతివాద కవిత్వోద్యమంలో ఒక మలువు వచ్చింది. దాశరథి దాన్ని ప్రధాన ప్రవాహంతో అనుసంధించే ప్రయత్నం చేశాడు.

ఒకవైపు ప్రగతివాదంలో ఈ పరిణామం సంభవింపగా, మరొకవైపు నవ్యసంప్రదాయ కవిత్వం తెలుగు కవిత్వంలో నూతన వసంతాన్ని తెచ్చి పెట్టింది. కాల్పనిక కవిత్వం రోజులలోనే ఈ ఉద్యమానికి కారణంబులు, ఉద్బోధకములు ఏర్పడ్డాయి. ఆంధ్రోద్యమ స్ఫూర్తితో 'ఆంధ్ర పౌరుషం' రచించిన విశ్వనాథ (1917) భారత జాతీయ సంస్కృతీ పరివేషంలో వస్తు సాంద్ర సంయోజనలో ఆంధ్ర ప్రశస్తిని 1925లో రచించినాడు. సర్వధర్మ బీజముగా ప్రణయాన్ని కులపాలికా ప్రణయంగా తీర్చిదిద్ది గిరికుమారుని ప్రేమ గీతాలు పాడాడు. ప్రణయ వివాహాల నడిమి సంఘర్షణను కిన్నెరసాని పాటలలో అనార్కలిలో ప్రపంచించాడు. కిన్నెరసానిలో ప్రకృతి మానుష చైతన్యంతో ప్రకాశించింది. మానుష దైవ ప్రణయం శృంగార వీధిలో వస్తువైంది. ప్రణయం పేరుతో విశృంఖల కామచారం తిరస్కరింపబడ్డది.

ఈ భూమిక మీద పింగళి- కాటూరుల సౌందరనందము (1932) వచ్చింది. సౌందరనందంలో ప్రణయం వైయక్తిక జీవన సంవేదనలకు పరిమితం కాకుండా సమాజ జీవనంలో అంతర్భాగమై కారుణ్యములో సేవలో పర్యవసించవలసిన అవసరం వ్యాఖ్యానింపబడ్డది. ఇందులో సుందరీనందులు

సమాజ సంబంధంలేని వైయక్తిక ప్రణయోపాసకులైతే బుద్ధ దేవుడాతనిని ఆ పరిధి నుంచి బయటకు లాగి సమాజ కార్యంలో సంలీనం అయ్యేందుకు సిద్ధం చేయడం ఇందులో ఇతివృత్తం. మహాత్ముని జీవన తత్వం బుద్ధుని ముఖాన సువ్యక్తం అయింది.

ఇంచుమించు ఇదేకాలంలో రాణా ప్రతాపసింహ చరిత్ర వచ్చింది. రాజశేఖర కవిరచనలో స్వాతంత్ర్య సంగ్రామప్రేరణ అంతర్గర్భితంగా ఉన్నది. రాణా ప్రతాపుడు ఆనాటి భారతీయ స్వరాజ్య కాంక్షకు ప్రతీక అయినాడు. కొద్ది సంవత్సరాలలో శివభారత కావ్యమూ ఆవిర్భవించింది. దీని వెనుక ప్రేరణమూ స్వధర్మ స్వరాజ్య సంస్థాపనము. వర్తమాన సమాజ సంవేదనలకు ఇతిహాస రంగభూమి మీద పాత్ర కల్పన చేయడం వీటిల్లో జరిగింది. ఈ రచనలు రెండూ రాయలసీమ నుంచి వచ్చినవే. అక్కడ కవుల మీద కాల్పనికోద్యమ ప్రభావం దాదాపు మృగ్యమనే చెప్పాలి. అందువల్ల ఈ రచనల్లో కవిత్రయ భారత రచనా ప్రాబల్యం ఎక్కువ. కాల్పనికోద్యమాభివ్యక్తిలోని తళతళలు తక్కువ.

ఇదే కాలంలో తెలుగు కవితారంగంలో ప్రచురంగా ప్రకాశించిన కవి జాషువా. జాషువా మీద జాతీయోద్యమం ప్రభావం వేసినంతగా కాల్పనిక కవిత్వంలోని ప్రణయ భావాభివ్యక్తులు ప్రతిఫలించలేదు. తిరుపతి వేంకట కవుల ధారాశుద్ధి మార్గంలోంచి పుట్టుకు వచ్చిన కవి. అయితే ఆ రచనలో ఆధునిక జీవన చైతన్యం ఉన్నది. సమకాలీన ఉద్యమాల ప్రాచుర్యం ఉన్నది. దానిలోంచి పుట్టిన కావ్యాలే గబ్బిలమూ, ఫిరదౌసి.

ఈ కాలంలో శిఖరాయమానంగా నవ్య సంప్రదాయ కవిత్వం యొక్క సర్వతోముఖాభివ్యక్తిగా వచ్చిన ఆధునికేతిహాసం శ్రీమద్రామాయణ కల్పవృక్షం. ఈ మహాగ్రంథం 1934 లో ప్రారంభమయినా 1961 దాకా రచన కొనసాగింది. కృష్ణశాస్త్రి గారన్నట్లు ఇది తెలుగు నాటి వ్యాసుని రచన అయింది. అందుకే కె. ఆర్. శ్రీనివాస అయ్యంగార్ విశ్వనాథను 'అభినవ వ్యాసుడు' అని ప్రస్తుతించారు.

కల్పవృక్షం సమకాలీన సంవేదనలలో నుంచి పుట్టి- సార్వకాలీన సంవేదనలను వ్యక్తం చేసింది. సంప్రదాయంలోని కథాంశాన్ని స్వీకరించి త్రికాలాలకు చెందిన మానవీయ చైతన్యాన్ని ఆవిష్కరించింది. ప్రాచీన ఛందోరూపం గ్రహించి కాల్పనికోద్యమంలోని నూతనాభివ్యక్తిని సంయోజించి విశిష్ట లక్షణాన్ని సంతరించుకున్నది. తన ఆవిర్భావంతో పూర్వ కవులను గూర్చిన అంచనాలను పరివర్తింపజేసింది. ఆధునిక వ్యవహారంలోని పలుకుబడినీ, కాకువునీ, వాక్యక్రమాన్నీ ఇతిహాసంలో నిక్షేపించి నూతన శైలిని నిర్మించింది.

కల్పవృక్షంలో శ్రీరాముడు 'మనుజుడను నేను మనుజ ధర్మంబు నాది' అని స్పష్టంగా పేర్కొంటాడు. కల్పవృక్షంలో వివాహ వ్యవస్థ సమాజ సుస్థితికి ఎట్లా మూలమో, దానిని కాదన్న కామం ఎంత విధ్వంసకారియో నిరూపింపబడింది. అందుకే శూర్పణఖ, రావణుడు ఈ సిద్ధాంతాలకు ప్రతినిధులుగా కానిపిస్తారు.

కల్పవృక్షం ప్రాచీన వేద విజ్ఞానాన్నీ, పూర్వోత్తరమీమాంసలనూ, దర్శనాలనూ, తంత్రశాస్త్రాన్నీ ఇతర ప్రాచీన భారతీయ విజ్ఞానాన్నంతా తనలో పొదువుకున్నది. అట్లాగే ఆధునిక విజ్ఞానశాస్త్రం, మనస్తత్వశాస్త్రం, మృగయాది విద్యలూ ఇవన్నింటినీ తనలో లీనం చేసుకున్నది.

కల్పవృక్షానికి కేంద్రం సృష్టిలో అనాదిగా కొనసాగే దేవాసుర సంఘర్షణ. ఇది ఈ సృష్టిని భౌతిక దశనుంచి దివ్యదశకు పరిణమింప జేయడంలో అడుగడుగునా - దాని క్రమానికి వేగం పెంచే ప్రధాన సాధనం. దీనిలో పాత్రలన్నీ ఈ దిశను ప్రదీప్తం చేస్తూ కావ్యంలో ప్రవర్తిస్తాయి. అంతేకాక పాత్రలలోని దేవాసుర సంపత్తికి అట్టడుగున ఒక ప్రాథమిక చైతన్యం గొంతు వినిపిస్తూ ఉంటుంది. ఆ ప్రాథమిక చైతన్య స్పందాన్ని కవి 'జీవుని వేదన' అన్నాడు. కావ్యంలో రెండంచులూ ఉపరితలంలోని కథాంశాన్ని - వివేచనాశీలం చేస్తున్నవి. ఈ వివేచనాశీలం ఆధునిక కాలం లక్షణం. ఈ లక్షణమే ఈ కావ్యాన్ని నేటి కావ్యం చేస్తున్నది.

కల్పవృక్షంలోని దేవాసుర సంఘర్షణకు సీతా రావణులను ప్రధాన ప్రతీకలుగా నిర్మించడం జరిగింది. దైవం మూలప్రకృతి - అవికృతమైంది. సత్త్వమయమైంది. అది తమోమయంగా పరిణమించేసరికి అసురమైంది.

* జనకజాత శరీర నిష్ఠంబొనర్ప
కడకవ్యవసాయియగు పంక్తికంఠరుండు
రావణుని బోధ దేవభావావృతునిగ
చేతకు గడంగు పూతధాత్రీతనూజ.

* దైత్యధాత్రికి వచ్చిన ధరణిజాత
దైత్యభావము కనునని దైత్యరాజు
దైత్యధారుణి పెకలించి దైవగుణము
తాసముద్భిన్నమగునని ధరణి జాత.

* ఆమె ఖండించి తినియైన నసురగుణము
కాల్చి లువగా ద్రొక్కగా పంక్తికంఠరుండు
నఖిలమును నాశనము చేసియైనగాని
దైవగుణము ప్రతిష్ఠింప జనకజాత.

ఈ విధంగా కల్పవృక్షం విశ్వజనీనంగా ఎదిగి శాఖోపశాఖలుగా విస్తరించి దేశకాలాలకు అతీతంగా పెరిగింది.

స్వాతంత్ర్యోద్యమ వేళకు నవ్య సంప్రదాయ మార్గం బలపడుతూ వచ్చింది. ఈ మార్గంలో ఇతిహాసమూ, పురాణమూ, కావ్యాలూ, ఖండ కావ్యాలూ ఇట్లా అనేక రచనలూ వచ్చాయి. రచనల్లో వైవిధ్యం - రచయితల వైయక్తికానుభవాల మూలంనుంచి సమష్టి జాతీయ చైతన్య ప్రకటనం చేసే లక్షణం వల్ల వీటిల్లో అనంతమైన సృజనాత్మక కవితా వికాసం సాధ్యమైంది.

ఇప్పటికే - శ్రీశ్రీ సమకాలికులైన కొందరు కవులు తమగొంతుకలు విప్పి రచనలు చేయడం ఆరంభించారు. నండూరి రామకృష్ణమాచార్యుల 'తారాతోరణం', జంధ్యాల పాపయ్యశాస్త్రి 'విజయశ్రీ', పుట్టపర్తి నారాయణాచార్యుల 'శివతాండవం', మేఘదూతం మొదలైన కావ్యాలు క్రమంగా ఈ మార్గాన్ని సుసంపన్నం చేస్తూ వెలువడటం ప్రారంభించాయి.

కాల్పనిక కవిత్వంలోని సౌకుమార్యం బెజ్వారి శ్రీనివాసమూర్తి రచనల్లో సాక్షాత్కరించింది. తుమ్మలవారి ఆత్మకథ స్వచ్ఛమైన క్లాసికతను, ఆధునిక కథను మేళవించింది.

ప్రగతి వాదోద్యమం క్రమంగా తెరమరుగవుతున్న దృశ్యం యిది. తరువాత బహుముఖీనమైన నవ్యసంప్రదాయ మార్గం ప్రక్కగా చెదరుమదురుగా కొన్ని చిన్నచిన్న ధోరణులు వ్యక్తమౌతూ వస్తున్నాయి. ఈ ఉద్యమాల రాపిడిలో నవ్యసంప్రదాయం కొత్తకొత్త అంశాలను చేర్చుకుంటూ వచ్చింది.

నాటినుంచి నేటివరకూ నవ్యసంప్రదాయ మార్గంలో వచ్చిన రచనలు వైవిధ్యం వల్లా, ప్రయోగ బాహుళ్యం వల్లా ఈ వ్యాసపరిధిలో సమగ్రంగా చర్చించే వీలివ్వడం లేదు.

'ఏమానందము భూమీ తలమున శివతాండవమట శివలాస్యంబట' అని ప్రారంభించి శివతాండవ కావ్యం సృష్టిలో ఉన్న అంతర్గతలయనూ, అంతరికమైన ఏకసూత్రాన్నీ స్పష్టంగా వ్యాఖ్యానించింది. స్వామి తాండవంలో ప్రకృతీ, చరాచరజగత్తూ, దేవమనుష్యతిర్యక్కులూ, సురాసురులూ, బ్రహ్మ, విష్ణువూ, సర్వదేవతలూ పాల్గొన్నారు. సమస్త సృష్టి చైతన్యం స్వామి తాండవంలో తల్లిలాస్యంలో ప్రతిఫలించింది. ఈ ఆత్యంతికమైన సృష్టి రహస్యాన్ని ఈ కావ్యం మనోహరంగా విశదం చేసింది.

తరువాత వెలువడిన ఈ మార్గ రచనల్లో - బోయి భీమన్న దీపసభ, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి దక్షారామం, కీర్తితోరణం - బాడాల రామయ్య కృష్ణ కథా విపంచి, లేపాక్షి - విద్వాన్ విశ్వం పెన్నేటి పాట - దాశరథి మహేంద్రోదయం, మహాబోధి - నారాయణరెడ్డి కర్పూర వసంత రాయలు - గుడిమెళ్ళ రామానుజాచార్యుల శబరి - గడియారం వేంకట శేషశాస్త్రి రఘునాథీయము - తుమ్మలవారి మహాత్మకథ - వానమామలై వరదాచార్యుల పోతన చరిత్రము - బెళ్లూరి శ్రీనివాసమూర్తి కొండవీటిరెడ్డి రాజ్యమహోదయము - ముదివర్తి కొండమాచార్యుల పూర్ణాహుతి - బీర్నీడి ప్రసన్న పృథ్వీ భాగవతము - వివియల్ నరసింహారావు ఆనందభిక్షువు - విశ్వనాథ వేంకటేశ్వరుల కాళిందీ పరిణయము - చాగంటి గోపాలకృష్ణమూర్తి హేమమాలి - కోటగిరి విశ్వనాథరావు ఖడ్గ నారాయణము, ముదిగొండ వీరభద్రమూర్తి వందేమాతరం - దుర్గానంద్ మధూలిక, భీతాంగన - నాయని సుబ్బారావు జన్మభూమి - వానమామలై జగన్నాథాచార్యుల రైతు రామాయణం, ఎక్కిరాల

కృష్ణమాచార్యుల గోదా వైభవము - తుమ్మపూడి కోటీశ్వరావు కుమారభారతి- ఇలా ఎన్నో రచనలు పేర్కొనవలసినవి ఉన్నవి.

ఈ కావ్యాలన్నీ రూపంలోగానీ, అంతర్యంలోగానీ ఒకే రకం రచనలు కావు. వీటిమీద ఆధునిక యుగపుటొత్తిడి ఉన్నది. భావకవిత్వంలోని జిలుగు ఉన్నది. సమకాలీన చారిత్రక అవసరాల స్పృహ ఉన్నది. సంప్రదాయచ్ఛందో రూపం సామాన్యమే అయినా కథాకథనంలో నిర్మాణంలో బింబకల్పనలో వస్తు భావ నిర్దేశంలో ఎంతో వైవిధ్యాన్ని సంతరించుకొన్నవి.

విశ్వనాథ కల్పవృక్షం రచిస్తూనే శ్రీకుమారాభ్యుదయము, ఝాన్సీరాణి శివార్పణము మొదలైన కావ్యాలు మధ్య మధ్య రచిస్తూనే ఉన్నారు. ఆరవ దశకం మధ్యనుంచీ ఆయన మధ్యాక్కరలలో శతకాలు రచిస్తూ వచ్చారు. ఈ శతకాలలో వచన ధోరణీ - వివేచనా లక్షణమూ ప్రకటితమైనవి. ఈ ప్రోద్బలంవల్ల ప్రయోగవాద కవుల కాలంలో ప్రయోగంగా ప్రారంభమైన వచన పద్యం ఒక ధోరణిగా తెలుగులో స్థిరపడ్డది. కవిత్వంలోని పద్యమూ, గేయమూ గ్రాంథికభాషా పరిమితులలోనే ఉండిపోయినై, ప్రజల వాడుక భాషను యథాతథంగా వ్యక్తదశలోకి తెచ్చింది వచన పద్యం మాత్రమే. సరళమూ నిరలంకృతమూ సర్వసామాన్యమూ అయిన వచన కవితా రూపం ఒక విధంగా 'అకవితా' ఉద్యమం లాంటిదే. అయితే కవులకు పాత వాసనలు పోలేదు. వచన పాదాలలోని వచన లక్షణాన్ని విరిచివేసే ప్రయత్నం జరిగింది.

శిష్లా, నారాయణబాబు, శ్రీశ్రీలు ఈ రూపానికి ఆరంభకులే అయినా 1960 తరువాతనే దీనికి ప్రాచుర్యం లభించడం ప్రారంభమయింది. 1960 దాకా దీన్ని తీసుకువచ్చిన వారు పిఠాపురం యువరాజా, పఠాభి, ఆరుద్ర, కుందుర్తి, దాశరథి - ఐదుగురూ. అయితే 1960 నుంచీ వచన రూపంలో కవిత ఉండాలనే ఒక రూపవాదాన్ని నిలబెట్టే ప్రయత్నం కుందుర్తి చేపట్టారు. క్రమంగా యువతరంలో ఈ రూపం ప్రాచుర్యాన్ని బాహుళ్యాన్ని పొందింది.

వచన కవితలో ఆరంభంలో ప్రగతివాద ప్రయోగ వాదాలు వాటి భావాలూ ప్రాధాన్యం పొందాయి. క్రమంగా వైయక్తికానుభూతుల పరిధిలో

కాల్పనిక కవిత్వ ప్రభావం చూపడం ప్రారంభించింది. కాల్పనిక ధోరణి సంగమించిన ఈ దశలో ఇది త్రివేణి అయింది.

కవుల వైయక్తిక సామాజిక సంవేదనలు దీనిద్వారా వ్యక్తం కావడం ప్రారంభించాయి. సరళమైన వచనం క్రమంగా అంత్యప్రాసలనూ, నూతన శబ్దభావ చిత్రాలనూ, కొత్త వాక్యపు విరుపులనూ స్వీకరించి అభివ్యక్తిలోని నవ్యత్వాన్ని సంతరించుకొన్నది. ఈ విధంగా వచన కవిత్వం కవుల స్వేచ్ఛా ప్రయోగాలకు ఇష్ట భూమిక అయింది. మానవకారుణ్యవాదమూ - మార్క్సిజమూ - మర్మవాదమూ ప్రేమవాదమూ, అనుభవాల చిత్రణమూ - దీని వస్తువు లయినవి. శిక్షితులకు విస్తృతంగా రెక్కలు చాచడానికీ, అశిక్షితులకు సులభంగా ప్రవేశించడానికీ వచన కవిత్వం దోహదం చేసింది.

ఈ కాలంలో వచన కవిత్వాన్ని ప్రకటించిన కవుల్లో సోమసుందర్, తిలక్, బైరాగి, మాదిరాజు రంగారావు, గోపాల చక్రవర్తి, దుర్గానంద్, అరిపిరాల విశ్వం, మోహన ప్రసాద్, ఇస్మాయిల్, రంధి సోమరాజు, నగ్నముని, చేతనావర్తకవులూ, శివారెడ్డి, కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ శేషేంద్ర మొదలైన వాళ్ళను పేర్కొనవచ్చు.

వచన కవిత్వం మార్క్సిజం బంధాలను ప్రగతివాద కవిత్వంనించి వదులుచేసి ముందుకు వచ్చింది. ఈ బంధంనుంచి విముక్తుడైన కవి స్వేచ్ఛకు ఆత్మాభివ్యక్తికి నిబద్ధుడైనాడు. వీళ్ళమీద ఎలియట్ బాదిలేర్ మల్లార్మే వంటి కవుల అభివ్యక్తి ముద్రలు బలంగా కానవచ్చాయి.

ఏడో దశకం నడుమ నుంచీ ఒకటి రెండుసార్లు చీకటి వర్షం కురిసింది. కవిత్వంపేర అశ్లీలాన్నీ, జుగుప్సనూ సమకూర్చిన దిగంబర కవులు వచ్చిన దారినే వెళ్ళిపోయారు. ఆ దశకం పూర్తయ్యేసరికి సాయుధ పోరాటం ద్వారా సమాజపు మార్పుని ఆహ్వానించే వి.ర.సం. ఆవిర్భవించింది. క్రమంగా ఈ ధోరణి గేయాలను ప్రధాన వ్యక్తీకరణ మార్గంగా స్వీకరించింది. వస్తుతః ప్రగతివాద కవిత్వంతో తత్త్వంలోగానీ, దాని ఎత్తుగడలో గానీ దీనికి భేదం లేదు. మధ్యలో ఉన్న కాలపు అంతర్యాన్ని బట్టి భిన్నంగా వ్యవహరించడం కేవలం సౌకర్యం కోసమే.

ఆధునిక కాలంలో తెలుగు సాహిత్యంలో . ముఖ్యంగా కవిత్వంలో ప్రవర్తిల్లిన అంశాలు నాలుగు క్లాసికత, కాల్పనికత, ప్రగతివాదం, ప్రయోగవాదం. స్థూలంగా ఇవి వేర్వేరుగా కనిపించినా అమిశితంగా విడిగా ఏ అంశమూ కనిపించదు. అనేక సందర్భాలలో ఈ సమ్మేళన వైవిధ్యం స్పష్టంగా కానవస్తుంది.

| వాదం | రూపం | వస్తువు | లక్షణాలు |
|---|---|---|---|
| క్లాసికత | సంప్రదాయ ఛందోరూపం | కథా వస్తు సంగతి | విశ్వజనీనత మానవీయ మూల్యాలు<br>జాతీయ సాంస్కృతిక విలువలు |
| కాల్పనికత | గీతీ లక్షణం | వైయక్తికానుభవ అభివ్యక్తి | ప్రకృతి తాదాత్మ్యం<br>వ్యక్తిస్వేచ్ఛ, విషాదం,<br>జాతీయాభిమానం<br>ప్రణయభావం |
| ప్రయోగవాదం | ఛందోవిచ్ఛేదం | అసంప్రదాయ ధోరణి | వ్యవస్థా విచ్ఛేదం<br>పరంపరావిచ్ఛేదం<br>బాధ్యతారాహిత్యం |
| ప్రగతివాదం | ప్రజాగేయ రూపం | సమాజ పరివర్తనం | వర్గ చైతన్యం<br>గతి తర్కం<br>భౌతిక వాదం<br>జాతీయాతీత దృష్టి |

క్లాసికరూపం - కథాకావ్యం ప్రధానంగా దాని అభివ్యక్తి సరళమైన కథన లక్షణం కలిగినది. దాదాపు పౌరాణికమైంది. కాల్పనిక ధోరణి ప్రధాన రూపం ఖండకావ్యం. దీని అభివ్యక్తి విలక్షణమైంది. క్లాసిక శైలికన్నా భిన్నమైంది. లలితమూ, మధురమూ విలక్షణమూ అయిన రూపకోపమాన సామగ్రి. పద సంయోజనలే కాకుండా రచన అంతరమైన సంగీత సాంతత్యం కలిగి ఉంటుంది. ఈ సంగీత సాంతత్యం వలన భావం మనస్సులో మెలగుతూ

ప్రమోగుతూ క్రమంగా అంతర్లయతోపాటుగా లీనమవుతున్నది. ప్రయోగవాదంలో కాల్పనికతలో ఉన్న సౌందర్య దృష్టిలేదు. ప్రకృతితోడి తాదాత్మ్యం లేదు. ప్రపంచ యుద్ధాలవల్ల కలిగిన క్షోభవల్ల, యాంత్రికీకరణవల్ల తనకు తానే వేరై పోతున్న మానవుడు - తన క్షోభలోంచి, కసిలోంచి వ్యక్తీకరించుకున్న రూపం ఇది. భాషలో, ఛందస్సులో, వస్తువులో, భావ వ్యక్తీకరణలో ఉన్న అన్ని మర్యాదలను ఛేదించడమే దీని లక్ష్యం. కృష్ణశాస్త్రి రచనలనూ వఠాభి రచనలనూ పోల్చుకుంటే మనకు ఈ పోలిక స్పష్టపడుతుంది. 'అర్థాన్ని అధ్వాన్నపు టడవిలో వదిలేసి పద్యానికి గద్యానికి పెళ్ళి చేద్దాం' అన్నప్పుడు ఇదే ధోరణి స్పష్టమవుతుంది. ప్రయోగవాదం సంప్రదాయ దూరమైన పదబంధాలను చించి సామగ్రిని కల్పించే మాట యథార్థమే.

నవ్య సంప్రదాయ కావ్యాలకు ప్రధాన చిహ్నం క్లాసికరూపం - సంప్రదాయచ్ఛందోరూపం - కథాకావ్యత్వం. దీనితోపాటు కాల్పనిక అభివ్యక్తిని కలిగి ఉండడం. కాల్పనిక యుగ లక్షణాలైన ప్రకృతి తాదాత్మ్యది లక్షణాలను తనలో పొదివికొని ఉండటం. ఈ లక్షణాలన్నిగానీ కొన్నిగానీ ప్రాధాన్యం వహించి కావ్య భావభూమికను ఆక్రమించినప్పుడు అది నవ్యసంప్రదాయ రూపంగా ఏర్పడుతున్నది.

ఈ ధోరణి మూలపు పాదుల్లో క్లాసికత - లక్షణాలైన జాతి పరంపరగా అందించే సాంస్కృతిక మూల్యాలు - కావ్యానికి మానవీయ చేతన, విశ్వజనీన లక్షణం కలిగించి ఈ కావ్యాలను దేశకాలాలకు అతీతంగా తీర్చిదిద్దుతున్నవి. ఈ రెండు అంశాలను అంతర్గర్భీకరించుకోకుండా ఎంతగా ప్రాచీనరూపం కలిగిఉన్నా, కాల్పనికాభివ్యక్తిని సంతరించుకున్నా అది తాత్కాలిక రచన అవుతుందేగాని నవ్యసంప్రదాయ రచనల్లో మిగిలి ఉండదు. అంటే కాల పరీక్షకు నిలిచే శక్తిని పొందజాలదు.

నవ్యసంప్రదాయమంటే గతానుగతికంగా వచ్చే సంప్రదాయ సాహిత్యంగా భ్రమించే వీలులేదు. దీనివల్ల సమగ్రావగాహన కలుగదు. పరంపరగా వచ్చే విశ్వసనీయములైన పురాణేతిహాసములైన అనువాదములేవీ నవ్య సంప్రదాయములో చేరవు. ఎందుకంటే వీటిల్లో సమకాలీన స్పందం చేరలేదు.

నవ్య సంప్రదాయంలోని అంశాలలో సంప్రదాయ కావ్యచ్ఛందోరూపం వదలి వచ్చిన కావ్యాలుకూడా వస్తూ ఉన్నవి. వీటిల్లో క్లాసికతలోని లక్షణాలు, కాల్పనికతలోని లక్షణాలు కలిసి ఉంటున్నవి. అయితే ఇక్కడ కథ లోపించడం వల్ల వ్యక్తి కేంద్రంగా విశ్వజనీనమైన అనుభూతిని వెల్లడించే ప్రయత్నం జరుగుతున్నది. రసానుభవవేళలో సాధారణీకరణం పొందినపుడు రామాదుల పరివేషాలు తొలగి కేవలం వ్యక్తి మాత్రం మిగిలిన దశలోని అనుభవలక్షణం ఇదే కావచ్చును. ఈ లక్షణాన్నే ఇటీవల అనుభూతి వాదంగా పిలుస్తూ వున్నారు. అనుభూతి వాదాన్ని ఇట్లా అంచనా వేసుకోవచ్చు:

| | | | |
|---|---|---|---|
| అనుభూతివాదం | ఖండకావ్యరూపం<br>వచన ఛందస్సు | ఆత్మాశ్రయ<br>ధోరణి | క్లాసిక<br>కాల్పనిక<br>లక్షణాలు |

అయితే ఈ ధోరణిలో ఈ పరిమితులు దాటి ప్రగతివాద లక్షణాలు చేరడమూ కద్దు. వైలక్షణ్యంకోసం వైచిత్రికోసం ప్రయోగవాద ధోరణులు కూడా కానరావడం కద్దు.

ఈ ధోరణితో వచ్చే కవిత్వం నవ్యకవిత్వం అనవచ్చునేమో. ఆధునిక కవిత్వంలో ఇప్పటి ధోరణి ఇది. ఒక విధంగా ఆధునిక కాలంలోని భావ ధోరణులు చాలా వరకు దీనిలో సంగమించడం కనిపిస్తుంది.

అరిపిరాల విశ్వం, మాదిరాజు రంగారావు, చేతనావర్త కవులు, నారాయణ రెడ్డి, శేషేంద్ర, మోహనప్రసాద్, ఇస్మాయిల్, శ్రీకాంతశర్మ మొదలైన కవులందరూ ఈ మార్గంలోనివారే అనవచ్చును.

ఒకవైపు నవ్య సంప్రదాయమూ, వేరొకవైపు నవ్య కవితా ధోరణీ ఈనాడు స్పష్టంగా కానవస్తున్నవి. ఋతంభర, నా దేశం - నా ప్రజలు, చితీ-చింతా, వెలుతురు పిట్టలు, అనుభూతి గీతాలు, విశ్వంభర ఈ మార్గంలో వెలువడ్డ ప్రధాన గ్రంథాలు. క్రమంగా ప్రగతివాద ధోరణి దీనిలో సంగమిస్తున్నది. శివారెడ్డి నేత్ర ధనుస్సు దీని కుదాహరణ.

అయితే అరవైలలో వేరొక వాదం వచ్చింది. వచన కవితలో కూడా కథా కావ్యం రావాలని. కథా కావ్యమైతేనే పరిమిత వలయం నుంచి దాటి కవిత్వం ఎక్కువ మందికి చేరుతుందనీ, చేరువవుతుందనీ, ఈ వాదాన్ని కుందుర్తి ప్రారంభించగా తిలక్ ప్రభృతులు తిరస్కరించారు. తిలక్ ప్రభృతుల వాదం ఏమంటే - ప్రాచీనకాలంలో కథా కథనానికి వేరే రూపాలు లేవు. అన్నింటికీ ప్రధాన భూమిక కావ్యమే. కాని ఈనాడు నవల, కథ మొదలైన కథా రూపాలు విడిగా ఏర్పడ్డవి. అందువల్ల కావ్యంలో కథా కథనం ప్రయోజన రహితమనీ, కావ్యం కేవలం అనుభూతి వ్యంజకంగానే మిగిలిపోవాలనీ.

కానీ ఇతిహాస మహాకావ్యాలకు కథాకావ్యాలకు కథారూపాలు ప్రత్యామ్నాయం కాగలవా? అన్నది పరిప్రశ్న. కథారూపం మానుషేతివృత్తాన్ని వ్యక్తం చేస్తుంది. రసానుభవానికి భూమిక మానుషేతి వృత్తమే. ఇతివృత్తరహితంగా రసస్ఫురణ లేదు. కథ - కవిత్వంలోని భావ శబలతాదులచేత రస స్ఫోరకం అవుతున్నది. కథారహితంగా కేవల భావప్రసారం చేసే కవిత్వం - శబ్ద భావ బింబాలతో ఎంత అందంగా తీర్చబడినా రసలోకానికి దూరం కావడం లేదా అన్నది ప్రశ్న. అంటే కవిత్వం - కాల్పనిక యుగం చివరలో కలిగిన వస్తుదారిద్ర్యం వల్ల ఏర్పడ్డ శూన్యంలోకి మళ్ళీ ప్రయాణం చేస్తున్నదని తాత్పర్యం. అంతేకాకుండా భావాన్ని అందుకునే ఆధారంగా మానుషేతివృత్తం ఉండటం ఎంత అవసరమో కాళిదాసాదుల కావ్యాలవల్ల తెలియ వస్తుంది.

ఆధునిక కవితకు రసలోక ద్వారాలను నవ్యసంప్రదాయ వాదం తెరచి గొప్ప ఉపకారం చేసిందని చెప్పాలి. భావోదయంతో కేవలం పరిమిత భావుకులకు చెందిన నేటి కవిత మానుషేతివృత్త కథనం వల్ల మధ్య తరగతి దాకా దిగి వస్తున్నదని చెప్పవలసి వస్తున్నది. మామూలు కథకు కవిత్వం లేనపుడు రసదీప్తి ఉండదు. కవిత్వం వరుసవేదిలాగా కథను బంగారం చేస్తున్నది. 'కవిత్వం ఒక అల్కెమీ.'

**1970** లో ఏర్పడ్డ విరసం ప్రచార తీవ్రతవల్ల కొన్ని కొన్ని అంశాలను సాహిత్యరంగంలో వ్యాప్తిలోకి తెగలిగింది. వాటిల్లో ముఖ్యమైనవి 'మార్క్సిస్టు దర్శనం పునాదిగా వెలువడే భావాలను ప్రచారం చేస్తూ రచయితలు సామాజిక

చైతన్యాన్ని ఉద్దీపింప జేయాలి.' 'మార్క్సిజాన్ని శాస్త్రంగానే కాక శస్త్రంగానూ ఆమోదిస్తూ రాజకీయ మహోద్యమానికి చేదోడు వాదోడు కావాలి' - 'నూతన ప్రజాతంత్ర విప్లవం లక్ష్యంగా - మార్క్సిజం, లెనినిజం మావో ఆలోచనా విధానం వెలుగులో విప్లవ రచయితల సంఘం సాహిత్య కళారంగాలను తన కార్యక్షేత్రంగా ఎంచుకుంటూంది." ఈ వాక్యాలు గమనించితే ఈ వర్గం క్రమంగా సాహిత్యాన్ని రాజకీయ ప్రసవశాలలో మంత్రసానిగా మార్చివేసిన అంశం స్పష్టమవుతుంది.

ఈ ధోరణి క్రమంగా సృజనాత్మక కృషికి సరిహద్దులు గీచి ఆ పరిమితుల్లో ప్రవర్తింప జేయడం వల్ల - నియతి కృత నియమరహితాం, హ్లాదైకమయీాం, అనన్య పరతంత్రాం - ఇత్యాదిగా నిర్వచింపబడ్డ కవిత్వం ఒక పార్టీకో ముఠాకో దాస్యం చేయవలెననే ధోరణి హెచ్చింది. ఇతివృత్తమూ, ఛందస్సూ, భాషా అన్నీ క్రమంగా నిర్ణయింపబడుతూ వచ్చాయి. వర్గపోరాటం, గేయరూపం, మాండలిక భాషా ఇది నియమం. ఈ నియంత్రణకు నిబద్ధత అనే పేరు పెట్టడం జరిగింది. ఈ విధంగా ప్రగతి వాదమూ, విప్లవ వాదమూ తెలుగు సాహిత్యంలో ఒక ప్రతిభారాహిత్యానికి మూడు దశాబ్దాలు పట్టం కట్టాయి.

సోమసుందర్ ఒకచోట ఇలా అన్నాడు : 'వ్యాసాలనో, రాజకీయ ఉపన్యాసాలనో నడుములు విరిచి వచనపుతుంటలు పేర్చి ఇదీ కవిత్వమంటే అది బలహీనుని ఆక్రందనమే కాని అహ్లాదకవిత్వం కానేరదు. ఆరణ్యక ఆక్రోశాలను కవిత్వమనుకునేవారు మయసభలో ప్రవేశించిన దుర్యోధనులు. ఉత్తమ కవిత్వం ద్రౌపది. అట్టివారి భంగపాటు చూసి నవ్వక యేం చేస్తుంది? (పే. 136) అభ్యుదయ కథా రచనకు కొన్ని ఇతివృత్తాలు మాత్రమే పనికి వస్తాయని చెప్పే శాస్త్రకారులు కళామర్మజ్ఞులు కారు. ఏ ఇతివృత్తం స్వీకరించి రచన చేసినా జీవితంపట్ల గాఢతర మమతాభిమానాలు ప్రదర్శించగలవాడే ఉత్తమ రచయిత. (పే. 107). గతంనుంచి సంక్రమించిన విజ్ఞాన వారసత్వమంతా ఎందుకూ కొరగానిదనీ దాన్ని ధ్వంసింప చేయడం ద్వారానే సుఖమయ భవిష్యత్తు నిర్మాణ సాధ్యమనీ ఒక శూన్యవాదం విధ్వంసవాదం తలెత్తుతూంది. (పే. 114)— కవిత్వం కాలాతీత కాంతిరేఖ' (1984.) పై వాక్యాలలో

దిగంబరకవులు, విప్లవకవులూ ప్రవర్తింపజేసిన విధ్వంస శూన్యవాదాలపట్ల సోమసుందర్ ఆందోళన వెల్లడి అవుతున్నది.

కవిత్వం గురించిన ఒక మీమాంస తలెత్తింది. ఆ కవిత్వం వేషంతో వంది మాగధులతో కోలాహలంతో కవితా రంగంమీద తాండవం చేయడం ఆరంభించింది. కుటుంబరావు వంటివాళ్ళు ఉద్యమాలవల్ల మంచి కవిత్వం రావడం లేదని బాధ పడటం జరిగింది. [పేజి. 75 కవిత్వంలో నిశ్శబ్దం (—వ్యాస సంపుటి) — ఇస్మాయిల్ - 1986.]

ఈ సందర్భంలో వెల్చేరు నారాయణరావు కవిత్వాన్ని ఆనంద కవిత్వం అనీ చైతన్య కవిత్వమనీ రెండు విభాగాలు చేశాడు :

—ఆనందం అలౌకికమైనది. చైతన్యం భౌతికమైనది.

—సమాజం నుంచి శ్రోతల్ని విడదీసి వారి మనసు చుట్టూ ఒక సౌఖ్యావరణాన్ని కల్పిస్తుంది ఆనంద కవిత్వం. సమాజ వ్యవస్థపట్ల జాగృతి కల్పించి అందులో భాగస్వామిగా వ్యక్తిని చైతన్యవంతుణ్ణి చేస్తుంది చైతన్య కవిత్వం. ఆనంద కవిత్వంలో జగత్తు విధి ప్రేరితమైన ప్రత్యామ్నాయ రహిత మైన ఏకైక మార్గంలో నడుస్తుంది. చైతన్య కవిత్వంలో పాఠకుడు కేవల భోక్త. చైతన్య కవిత్వపు జగత్తులో పాఠకుడు భాగస్వామి. పాక్షిక కర్త. ఆనంద కవిత్వపు ఫలం విగళిత వేద్యాంతర విషయత్వం. చైతన్య కవితపు ఫలం క్రియాశీలత, జాగృతి; ఆనంద కవిత్వం బాహ్య పరిస్థితులకు నప్పేలా వ్యక్తి ఆవేశాల్ని మలుస్తుంది. చైతన్య కవిత్వం బాహిర పరిస్థితులను మార్చేలా వ్యక్తి అంతరంగాన్ని పిలుస్తుంది. ఆనంద కవిత్వం సుఖదాయకం. యథాస్థితి రక్షకం. చైతన్య కవిత్వం శక్తిదాయకం. ఆందోళనకారకం విప్లవాత్మకం—

(పుట. 178 తెలుగులో కవితా విప్లవాల స్వరూపం - 1978).

ఈ విభజనను జాగ్రత్తగా గమనించితే రచయిత మెలకువతో ప్రాచీన భారతీయ కవిత్వాన్ని సాహిత్యాన్ని తన దృష్టితో పరిశీలించి దాని లక్షణాలను నిర్దేశించి దానికి విరుద్ధమైన లక్షణాలను ఈనాటి ప్రగతివాద కవిత్వంలో ఉన్నాయని చెప్పడానికి ఉద్దేశించినట్లు తెలియవస్తుంది.

చైతన్య కవిత్వం మార్క్సీయవాద కవిత్వమైతే తదితరమైనదంతా ఆనంద కవిత్వం కావాలి. ఈనాటి మార్క్సిజానికి చెందని ఆధునిక కవిత్వమంతా పైన పేర్కొన్న విధి ప్రేరితమనే సిద్ధాంతాన్ని, యథాస్థితి రక్షణనూ, కేవల సుఖావరణతో తృప్తిపడే లక్షణమూ కలిగివుంటుందనుకోవడం సత్య దృష్టికాదు భారతీయ తత్త్వశాస్త్రం ఎప్పుడూ మానవుని కర్తృత్వాన్ని సృష్టి పరిణామ శీలాన్ని తిరస్కరించలేదు. ఈ పరిణామం పురోగమనం జీవుని సజాగ్రత్ప్రవృత్తి మీద ఆధారపడి ఉంటుంది 'తస్మాదుత్తిష్ఠకౌంతేయ' అని గీత చెప్పినా - 'ఉత్తిష్ఠ జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత' అని ఉపనిషత్తు చెప్పినా మానవుని కర్మశీలుణ్ణి చేసింది.

భారతీయ దృక్పథంలో సాహిత్యం ఎప్పుడూ వ్యక్తి కర్తవ్యాన్ని గురించిన జాగ్రత్తను సంస్కారరూపంలో అందించే సాధనం మాత్రమే. రస సిద్ధాంతం - విశ్వజనీన మానవీయ చైతన్యంలోకి వ్యక్తిని ప్రవేశపెట్టి - అతని సంస్కార పరిధిని విస్తృతం చేస్తున్నది. ఈ 'మెటామార్ఫసిస్' మనకు తెలియకుండానే కావ్యం నిర్వహిస్తున్నది. అందువల్లనే ప్రభు సమ్మితాలైన, మిత్ర సమ్మితాలైన సారస్వతాలకంటే - కాంతా సమ్మితమైన సాహిత్యం శివేతర క్షతికి ఎక్కువగా దోహదం చేసింది. అయితే సమాజంలోని పరిస్థితులు మారినప్పుడు తాత్కాలిక సన్నివేశాలలో సార్వకాలీన సాహిత్య ప్రమాణాలను మనం అందుకోలేకపోవచ్చును. 'విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై పరగుచుండజేసె భారతంబు' అన్నప్పుడు అంతటి ఇతిహాసాన్ని నిర్వహించిన వ్యాసుని చైతన్యం సర్వ సమాజాన్ని వ్యాపించి తనదిగా చేసుకోవడంవల్లనే అతడు విష్ణు సన్నిభుడయినాడు.

మొత్తం మీద ఈ శతాబ్దంలో తెలుగు సాహిత్యం ముఖ్యంగా కవిత్వం యొక్క ప్రధాన ధోరణి పునరుజ్జీవనోద్యమం మార్గంగా - కాల్పనికవాద, నవ్య సంప్రదాయ మార్గాలలో సాగింది. అప్పుడప్పుడూ దీన్ని ఒరిపిడి పెడుతూ ప్రయోగ వాద ప్రగతి వాదాలు కొనసాగాయి. అయితే దీన్ని ఒక అంచనా వేసి చూస్తే ఎక్కడా మూలచ్ఛేదం కాలేదని ప్రధాన ధోరణి జాతీయ చైతన్యం పాదుల్లోంచి విశ్వజనీన పణితిలో విభిన్న దిశలకు కొమ్మలు కొమ్మలుగా కొనసాగిందని పేర్కొన వచ్చును.

## ఉపయోగపడ్డ గ్రంథాలు :


| | |
|---|---|
| అరుద్ర | ప్రజాకళలు-ప్రగతివాదులూ. మద్రాసు. (1985.) |
| కృష్ణశాస్త్రి, దేవులపల్లి | పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వం భారతి. (1949) |
| కె. కె. రంగనాథాచార్యులు (సంపాదకుడు) | ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు – హైదరాబాదు. (1982) |
| సుబ్రహ్మణ్యం జి. వి. | సమాలోచనం, హైదరాబాదు. (1971) |
| సుప్రసన్నాచార్యులు, కోవెల | సాహిత్య వివేచన, వరంగల్. (1971) |
| సోమసుందర్ | కవిత్వం కాలాతీత కాంతిరేఖ పిఠాపురం. (1984) |
| నారాయణరావు, వెల్చేరు | తెలుగులో కవితా విప్లవాల స్వరూపం, విజయవాడ. (1978) |
| ఇస్మాయిల్ | కవిత్వంలో నిశ్శబ్దం, కాకినాడ. (1987) |


(అక్టోబరు 1987, అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు

# తెలుగులో స్మృతికావ్యాలు

వర్చస్సు కోసం బలం కోసం శక్తి కోసం
ఈ మృతవీరుని హస్తం నుంచి ధనుస్సును గ్రహిస్తున్నాను.
మీరూ, మేమూ - మనం విశ్వమంతా నిండిన
వైరి చక్రాన్ని అతిక్రమిస్తాము
ఇతన్ని మాతృభూమి ఒడిలోకి
అధిక వర్చస్సును ప్రసరింప జేసేందుకు చేరుస్తున్నాం
శిరీష కోమలి - ఈ మహిషి ప్రతీకారం జరిగేదాకా
విచ్ఛిత్తి నుంచి రక్షించనీ
పృథివీ! ఇతన్ని బలంగా నొక్కకు
ఊపిరి పీల్చుకోనీ
సులభంగా సుకుమారంగా ప్రవేశించనీ
అవనీ! తల్లి బిడ్డను పొత్తిళ్ళలో
ఒదగినట్లు ఒదిగించుకో. ఋగ్వేదం 18-9,10,11.

ఇది అతి ప్రాచీనమైన స్మృతి గీతము. ఋగ్వేదంలోని దశమ మండలం లోనిది. ఒక వీరుడు మరణిస్తే అతని అనుచరులు ఆ ప్రేరణ అతని మరణం నుండి పొందుతూ అతని అంత్యక్రియలు చేస్తున్న అంశాన్ని వర్ణించేది ఇది.

ఏ స్మృతి కావ్యమైనా మృత్యువు చేత విడదీయబడ్డ వ్యక్తుల అనుబంధాన్ని వ్యక్తం చేసేందుకు ఆవిర్భవించేదే. సృష్టిలో సంసారం సాగే ప్రవాహంలో మృత్యువు ఒక అంతిమ ఘట్టం. మృత్యువు ఎంత అపరిహార్యమైన దని తెలిసినా మళ్ళీ తిరిగిరావడానికి వీలులేని స్థితికావడం వల్ల అది కలిగించే దుఃఖం అపారమైనది. ఒక సుదీర్ఘయాత్రలో హఠాత్తుగా ఏర్పడే అడ్డుగోడ వంటిది ఈ స్థితి. జీవితంలో అనుబంధాలూ, ప్రేమలూ, పగలూ, ఇష్టానిష్టాలూ వీటితో తపించే వ్యక్తులు హఠాత్తుగా తమ మధ్యనుండి వ్యక్తి మాయమవడంతో ఆత్యంతికమైన దుఃఖాన్ని పొందుతారు. లోకంలో ఎన్నిరకాల దుఃఖమున్నా

మృత్యువు వల్ల కలిగే దుఃఖం మిగిలిన అన్ని దుఃఖాల కంటె మిన్నయైనది. మృత్యువు పొందేవారి అనుభవాన్ని గూర్చి మనం ఏమీ చెప్పలేకపోయినా మృతునికి మనకు ఉండే సంబంధాన్ని బట్టి ఈ దుఃఖతీవ్రత వ్యక్తమవు తుంది. జీవితంలో అనుబంధాలు సామాజిక ఆర్థిక కారణాల వల్లనే కాక రక్తసంబంధం వల్ల మిక్కిలి తీవ్రంగా ఏర్పడుతాయి.

ఆదికాలం నుండి మానవుడికి మృత్యువును దాటవలెనని, జయించ వలెననీ, అమృత్యువుగా ఉండవలెననీ కోరికలు ఉంటూ వచ్చాయి. ఈ కోరికల పునాదిపైనే పురాణగాథలు మతాలు తత్త్వశాస్త్రాలు నిర్మితమైన్నాయి. కఠోపనిషత్తులో నచికేతుడు, భారతంలో సావిత్రి, పురాణాలలో మార్కండేయుడు - ఈ మృత్యువుతో ఘర్షణపడినవాళ్ళే. నచికేతుని విషయంలో 'అస్తీత్యేకేనాయ మస్తీతి చైకే' అని ప్రశ్నతో ప్రారంభమై మృత్యువును తరించి బ్రహ్మను పొందే విధము ప్రకటితమైనది. సావిత్రి కథలో మృత్యువుతో ఘర్షణ పడటమూ, మృత్యుగ్రస్తుడైన భర్తను తిరిగితెచ్చుకోవడం అన్న విషయంతో మానవుడి అతి తీవ్రమైన మృత్యుంజయ సంకల్పము వ్యక్త మవుతున్నది. మార్కండేయుని కథలో ఈశ్వరుని దయచేత మృత్యువును జయించడం చెప్పబడింది. ఈ విధంగా ఈ కథలన్నీ మర్త్య అమర్త్యత్వాల నడిమి సంఘర్షణను వివరిస్తున్నాయి.

స్మృతికావ్యాల్లో వస్తువు మృతుని తోడి వ్యక్తికి గల సంబంధాన్ని బట్టి వ్యక్తమవుతుంది. లోకంలో మహా పురుషులు గతించినప్పుడు కలిగే దుఃఖం సమష్టి దుఃఖంలో తన పాలును పంచుకోవడం. గాంధీజీ చనిపోయినప్పుడు దేశం మొత్తం హఠాత్తుగా దిగ్భ్రాంతమై తేరుకోవడం, ఆనాటికి కవియైన ప్రతివాడూ అంతో ఇంతో ఆక్రోశాన్నీ సంవేదననూ వ్యక్తం చేయడం జరిగింది. అయితే సమష్టియైన ఆ దుఃఖము త్వరలోనే ఓదార్పు పొందుతుంది.

కానీ వైయక్తికమైన జీవితంలో కలిగే విషాదం వ్యక్తిని వెంబడిస్తున్నది. అతని భౌతిక జీవన వ్యవహారాన్నీ మనోలోక సీమలనూ మృత్యువు వల్ల కలిగిన శూన్యత ఆవరించి ఒక కల్లోలాన్ని సృష్టిస్తుంది. వ్యక్తి యొక్క సంవేదనా శీలాన్ని పురస్కరించుకొని ఈ దుఃఖ ప్రవాహం అతని చైతన్యంలో

ప్రవహిస్తున్నది. లోకజీవితం సాగడం కోసం సర్దుబాట్లు ఎలాగూ ఉంటవి కాని స్మృతి తీవ్రంగా వెంటాడుతూనే ఉంటుంది. కొన్ని యేండ్ల తర్వాత కూడా జ్ఞాపకం చెలరేగినపుడు గాయం పచ్చిగానే ఉంటుంది.

అవిచ్ఛిన్నంగా సాగే సంసారం కాలంతో పాటు దుఃఖాన్ని కప్పి పుచ్చుతూ ఉంటుంది. కాలమేకాక మనిషికి ఉండే తాత్త్విక స్పృహ, జీవన వైయర్థ్యాన్ని గూర్చిన ఆలోచన, పరలోక చింతన - ఇవన్నీ దుఃఖాన్ని క్రమంగా తగ్గిస్తూపోతవి.

భారతీయ జీవన దృక్పథంలో ఆశ్రమ వ్యవస్థ, పురుషార్థ వ్యవస్థ జీవితాన్ని ఒక సమన్వితమైన ఏకాకారంగా ('ఇంటిగ్రేటెడ్ యూనిట్'గా) చూడటం నేర్పుతుంది. జ్యోతిశ్శాస్త్రం కూడా దశాభేదాల్ని అనుసరించి నూట ఇరవై సంవత్సరాల సంపూర్ణ జీవితాన్ని లక్ష్యంగా పేర్కొంటుంది. బాల్య యౌవన కౌమార వార్ధక్యాలు, ధర్మార్థ కామ మోక్షాలు జీవితాన్ని ఒక బిందువు నుండి ప్రారంభం చేసి ఆ బిందువుకే చేరుకొని సంపూర్ణ వలయంగా నిరూపిస్తాయి. రఘువంశంలో కాళిదాసు 'శైశవేభ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణామ్వార్ధకే ముని వృత్తీనాం యోగేనాం తే తనుత్యజామ్' అని ఈ వలయాకారమైన జీవితాన్ని నిరూపిస్తాడు.

మోక్షం మాట అటుంచి త్రివర్గ సాధనలో జీవించే మానవుడు పొందే దుఃఖము ఎక్కువ తీవ్రంగా ఉంటుంది. యోగసాధన స్వేచ్ఛామరణము సామాన్య జీవన పరిధిలోనివి కాకపోవడం వల్ల బ్రతుకు జనన మరణాల మధ్యలో సాగే పరమార్థంగా భావించే వ్యక్తికి ఆప్త వియోగము అధిక దుఃఖాపాదకము కావడం సత్యం.

అందులో కావ్యం మానుష ప్రపంచంలో సుఖదుఃఖాలే ఇతివృత్తంగా కలిగి ఉండటం, సుఖదుఃఖములు శమించిన శాంతి స్థితి రసలోకానికి దూరమైనది కావడం గ్రహిస్తే స్మృతి కావ్యం కదిలించినట్లుగా మానవ హృదయాన్ని మరే కావ్యమూ కదిలించడం కష్టం. ఉత్తరరామ చరితలోని ఛాయాంకములో

శ్రీరామచంద్రుడి దుఃఖము స్మృతి కవితకు విలక్షణమైన ఉదాహరణ. వ్యక్తిలోని భిన్న పార్శ్వాలూ, వైరుధ్యాలూ అర్థం కావడం కోసమే అక్కడ కవి 'వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి లోకోత్తరాణాం చేతాంసి' అంటాడు. ఈ అనుభూతి మూలం నుండే ఆయన 'ఏకోరసః కరుణ ఏవ' అన్న సిద్ధాంతాన్ని ప్రతిపాదించడం జరిగింది.

స్మృతి కావ్యాలలో ఎన్ని భేదాలుండటానికి వీలున్నా ప్రధానమైనవి రక్త బంధుత్వానికి సంబంధించినవే. వీటిలో మొదటిది తన్ను కన్నవారిని గూర్చి తన తోబుట్టువుల గూర్చి తాను కన్నవారిని గూర్చిన దుఃఖం అది మూడు పాయలు. రెండవది అత్యంత ప్రధానమైన దుఃఖము తన జీవితాన్ని పంచుకొని సాహచర్యంతో తన వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్ది తన వంశాన్ని నిలబెట్టే భార్య లేదా భర్త వియోగానికి సంబంధించిన దుఃఖం.

తెలుగు స్మృతి కావ్య సాహిత్యంలో తొలి రచనలు గత శతాబ్దంలోనే ప్రారంభమైనాయి. వావిలాల వాసుదేవ శాస్త్రి రచనల తరువాత, వడ్డాది సుబ్బారాయకవి 'అద్దికమాత్ర ఫలప్రదముల్గైన' అయిదు వివాహాలవల్ల సతీ స్మృతిని అయిదుసార్లు రచించారు. ఆయన సుత స్మృతి కూడ మరొక విలక్షణమైన రచన. అయితే ఆదునిక కవులలో స్మృతి కావ్యాన్ని రచించిన వారిలో రాయప్రోలు సుబ్బారావు మొదటివారు. తర్వాత దువ్వూరి రామిరెడ్డి, నాయని సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, పెనుమర్తి వెంకటరత్నం, బసవరాజు అప్పారావు, మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి, తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు, కుందుర్తి ఆంజనేయులు, రావూరి భరద్వాజ మొదలైన వారందరూ పితృ, సుత, సతీస్మృతి కావ్యాలు రచించారు. శేషాద్రి రమణ కవులలో ఒకరైన దూపాటి వెంకట రమణాచార్యులు తమ మిత్రులైన 'నీలగిరి' పత్రికా సంపాదకులు షబ్నవీస్ వెంకట రామారావు భార్య జానకీబాయి మృతి చెందగా ఆమె స్మృతి నిమిత్తము ఉదయలక్ష్మి అనే కావ్యాన్ని రచించారు. ఇది కాక దేశ నాయకులు మొదలగువారు చనిపోయినపుడు — తుమ్మల సీతారామమూర్తి గాంధీ స్మృతిగా రచించిన ధర్మజ్యోతి, తిలక్ రచించిన నెహ్రూ స్మృతిగీతం పేర్కొనదగినవి. తమ గురువులైన విశ్వనాథ సత్యనారాయణ స్మృతికి అంకితంగా తుమ్మపూడి కోటీశ్వరరావు 'చితాభస్మము' అనే కావ్యాన్ని రచించారు. ఇది ఇంకా ప్రకటితం కాలేదు.

రాయప్రోలు సుబ్బారావు మొదలుగా సాగిన ఈ స్మృతి కావ్యవాహిని ఒక విలక్షణమైన భారతీయ భావనా భూమికను ఆశ్రయించి రూపుదిద్దుకొన్నది. తాత్త్వికమైన దృష్టి లేనిచోట స్మృతి కావ్యం ఐహికానుబంధాలను స్మరించడంతో ఆగిపోయింది. ముందు వెనుకలుగా చూస్తే దువ్వూరి రామిరెడ్డి 'భగ్న హృదయము' తొలిరచనగా తోస్తున్నది. ఈ కావ్యం విషాద స్ఫురణ గలిగిన ప్రకృతి వర్ణనతోనే ఆరంభమైనది.

> జలధరమాలికా మలినశయ్యను మిత్రుడుగూలె; నేడ్పులా
> ర్పుల బులుగుల్ కులాయముల పొంతలకేగక కొమ్మలెక్కి_ము
> క్కుల దడి లేక యూర్చు; వడగూరిన పోలిక బూల తీగలుం
> దలలను వాంచు; గాలి వెత తాకున మూల్గు సహానుభూతితోన్
>
> కవికోకిల గ్రంథావళి-2, ఖండకావ్యాలు పుట-197

ఈ వర్ణన కవి దుఃఖాన్ని ప్రతిబింబిస్తున్న ప్రకృతి వర్ణనలో ఒక విషాద వాతావరణాన్ని సృష్టిస్తున్నది. పూర్వము కనువందువైన అందమైన వస్తువులన్ని 'వెల్లబోయినగతి బాష్పముల్ దొణక నేడ్చుచు నీరవభాష పల్కు_డున్' అదీ స్థితి. ఆమె తిరిగిరాదని తెలిసి మనసు స్వాప్నిక పథంలో సాగిపోతున్నది. 'గాజులును మెట్టెలెవరివో ఘల్లుమనగ తెలియకుండనె కన్నులు తిరిగి చూచు' అంతటి భావస్థితిలో కవి మిగిలిపోయాడు. 'హృదయమంజూష నాచేతనిడి అదేల తాళపుంజెవి నీయొడి దాచినావు' అని ఆమెను గూర్చిన విషాదాన్ని ప్రకటిస్తాడు. హృదయము దొంగిలించిన రీతిగానే స్మృతిని సైతము నీవు పరిహరింపుమని ప్రార్థిస్తాడు. ఆలోచనలో ఆత్మ నిత్యత్వము, దేహమునకు అనిత్యత్వము స్మరణకు వచ్చి కూడ తన్నుదాను ఓదార్చుకోలేక కవిస్థితి చివరకు—

> వేగుమాంసంబురీతి నావిశ్వవాటి
> నుల్లమున తత్త్వబోధ కాలూనగలదె?
> యూరడింపులు పుండుపై నుప్పుగల్లు;
> ఇంక నేకాంతమే నాకు నేడు గదయ!

ఈ కవి శిశు వియోగము అన్న రచన కూడా ఈ మార్గంలోనే నడుస్తుంది. సతికి అమృతత్వము తన కవితా కళ్యాణ సౌధంలో నెలకొనడంచేత కలిగినదట. చివరకు 'చాలున్ నిల్పుము ఆక్రోశగాన విషజ్వాలల్' అని మళ్ళీ ఐహిక సుఖాలు కలగవలెనని ఆశీర్వదిస్తూ కావ్యాన్ని పూర్తి చేస్తాడు.

బసవరాజు అప్పారావు తన కుమారుడు పోయినప్పుడు 'వేదాద్రి శిఖరాన వెలిగున్న జ్యోతి మినుకు మినుకు మని కాసేపు కునికిపోయింది కాపురమొచ్చిన కన్నపాపాయి ఇల్లు ఖాళీ చేసి వెళ్ళిపోయాడు' అని తీవ్రమైన దుఃఖాన్ని లోలోపలే అణచుకుంటూ కుమిలిపోతాడు. 'ఇల్లు ఖాళీ చేసి వెళ్ళిపోయాడు' అన్న వాక్యం కవిలోని తాత్విక గాఢత్వాన్ని వ్యక్తం చేస్తుంది. శిశువును వేదాద్రి నరసింహునితో అభిన్నుడుగా భావించడం సర్వజగత్తులోని పరమాత్మ అంశాన్ని వ్యక్తం చేయడానికి ఉపకరిస్తుంది.

స్మృతి కావ్యాలలో సమీక్షింపదగినది నాయని సుబ్బారావు మాతృగీతాలు. ఇరువై ఒక్క ఖండాలుగా సాగిన ఈ కావ్యం, ఒక్కొక్క దానిలో మూడు గీత పద్యాలతో కారుణ్య వాహినిగా సాగింది. ప్రథమ ఖండంలో మృత్యువు తల్లిని అపహరించడంతో నిర్ఘాంతమైన చిత్తవృత్తిని అత్యంత ప్రతిభావంతంగా వ్యక్తీకరిస్తాడు.

'అకట! నట్టింటి దీపమ్ము నార్పినాడు'
'కారు చీకట్ల రాసులు గ్రక్కినాడు'

అని ఆ మృత్యుచేష్టను గర్హిస్తాడు. కంటక నిగూఢ విపిన మార్గముల తల్లిలేని బిడ్డను గావించి మానసంపు టాసలిన్నియు అడుగంట కోసిన నిర్దయాత్ము డెవడని ప్రశ్నిస్తాడు. కావ్యాన్ని ఇంత బలమైన భావ చిత్రాలలో చూపి మాతృ వియోగం వల్ల కలిగిన శూన్యాన్ని చిత్రించిన కవి ఈయన మాత్రమే కావచ్చు. తరువాత కావ్యమంతా సుకుమారమైన స్మృతులతో సాగిపోతుంది. ఈ స్మృతి సంపుటి కవి యొక్క 'శైశవలీలా వైభవాన్ని చాటి చూపుతుంది తల్లిని స్మరించేటప్పుడు కవి తన్నుతాను మరచిపోయి శిశువు కావడం అత్యంత సహజమైన సన్నివేశం. ఆమె దేవతామూర్తి వలె మడిగట్టుకొని పూలు పండ్లు తీసుకొని ఎక్కడికో పోయింది. తాను కొంగు పట్టుకొని

వెంట పోలేక కన్నీళ్ళు కారుస్తూ ఉన్నాడు. కవి మరణానంతర కర్మలను కావ్యవస్తువుగా చేసి దానిలోంచి ఆర్ద్రమైన దుఃఖాన్ని పిండుతున్నాడు. పోయినచోట ప్రేత దాహశాంతి కోసం నీళ్ళచెంబు పదిరోజులదాకా పెట్టడం ఆచారం.

నీకు దాహమ్ము లేదుగాక ఎంత
నేను జడుడను నీ పొందనైన లోక
మమృత వారాశి కావలి యంచుగదవె
ఈ చవిటిపట్టి నీరమ్ము లేల వలతు

కర్మకు కర్మాతీతమైన స్థితికి సామాన్యతకు ముముక్షుతకు నడిమి భేదాన్ని సన్నగా సూచిస్తున్నాడు కవి. ఆమె పోయినపుడు పార్వతీదేవి పూల రథము కదలినది. వల్లకాడు పూల వనముగ మారినది. తన జీవితాన్ని తన తల్లి స్మృతికి గుర్తుగా చెక్కబడిన శాసనము తన అంతరంగము. ఆమె విగ్రహము ప్రతిష్ఠితము. సహజంగా తన తల్లిని స్మరిస్తూ కవి చేసిన వర్ణనలు అతి సుకుమారంగా సాగినవి.

'నే నలుగుచుందు నన్నమ్మ నీవు కలిపి
తెచ్చినా నోటిలో కూరి తినకయున్న
నెత్తిపై మొట్టి తినిపింతు నిలువకుబుకు
చీరచెరగున నాదు కన్నీరు తుడిచి'

'అచట నీవేమి చేయుదు వచట యెచట
నాకు చెప్పవటే తల్లి! నాకు గడువ
రాని దైనది యీ నీవులేని బ్రతుకు
నేను నీ పూజ కర్హమ్మురాను చెప్పు.'

తల్లి వాత్సల్యాన్ని తాను పొందిన శైశవ భావాన్ని ఇక్కడ ఎంతో అందంగా మూర్తి కట్టించాడు కవి.

తన ప్రణయయాత్ర సఫలమై విరహవేదన తొలగించుకునే దశలో ఈ మాతృవియోగ దుఃఖము కవిని ఖిన్నుణ్ణి చేసింది. జీవితం ఆనంద యోగంలో ప్రియాప్రియులు లగ్నమయే వేళ పిడుగుపాటు వంటి ఈ మాతృ వియోగం దుఃఖాన్ని ఎంతగా కలిగించిందో కవి ఇలా చిత్రిస్తాడు:

చివరకది చేతిలో పడునవసరమున
నీవు నవ్వులకటవె నా జీవితమున
పొనుపడని చిచ్చు రగిలించిపోయినావు
కాలసంద్రపు చెలియలికట్టదాటి

మాతృ గీతాల్లో నాయని సుబ్బారావు వాత్సల్య ప్రేమయొక్క విశ్వ రూపాన్ని దర్శింపజేసుకున్నాడు. మాతృ వియోగంవల్ల ఐహిక జీవనంలో కలిగిన శూన్యాన్ని ఒకవైపు చూపిస్తూనే తల్లిపొందిన పరమపద ప్రాప్తిని భావించి తృప్తిపడటం కనిపిస్తుంది.

పెనుమర్తి వెంకటరత్నం రచించిన మాతృదేవి అన్న స్మృతి కావ్యం విలక్షణమైనది. ఈ కవి మధురమైన సుకుమారమైన కవిత్వాన్ని రచిస్తూనే ఇరవై మూడవ ఏట అకాల మృత్యువు పాలైనాడు. 1927లో రచించిన ఈ విషాదకావ్యం ఎనిమిది ఖండాలుగా రచింపబడినది. తల్లి స్మృతులచేత మధుర శబ్దజ్యోతి వెల్గింతునని కవి భావిస్తాడు.

'మము నిదురబుచ్చి అమృతరాగము స్రవించు
జోలలను బాడి నీ చనుబాల నిచ్చి
ఇన్నినాళులు బ్రదికించి ఇప్పుడేగి
యేద్వ వలదన్న నెట్టుల నేడ్వకుందు.'

ఇన్నాళ్ళు తమను బ్రదికించిన తల్లి ఇపుడు వీడిపోవడంవల్ల ఎవరు ఏడ్వవద్దన్నా ఏడ్వకుండా ఉండలేరు. ఎన్నో జన్మలనాటి తన ఋణాన్ని తీర్చుకోలేని సుతులను మోసగించి రాత్రివేళలోని స్వప్నకథలాగా ఆమె అనంతాకాశాలలోకి ప్రయాణం చేసింది.

వెంకటరత్నం కవిత్వంలోకూడ శైశవ భావమే ఆవరించింది. అందు వల్లనే అతి సహజంగా ఈ స్మృతికావ్యం ఉన్నత శిఖరాలను అధిరోహిస్తుంది. తాను సృష్టి అంతా రాత్రి తల్లి ఒడిలో నిద్రిస్తుండగా వీడిపోవని దుఃఖమే తోడురాగా మేలుకొన్నాడట. తల్లీ నాకు జోలపాడమని ప్రార్థిస్తున్నాడు. తల్లి మరణించి కాలం గడిచినా మళ్ళీ వస్తున్నదని భావిస్తున్నాడు. 'నీ మృతి అబద్ధ మేమొ' అని భావన చేస్తున్నాడు. తాత్త్వికమైన మలుపు రాగానే—

ఈ యనంతావధికి నంతమెక్కడమ్మ
నీకు నాకు మధ్య గలట్టి నిశ్చలాబ్ధి
పారమున తీరమెచట చేకూరుతల్లి!

ఈ ఆలోచనలూ, సృష్టి దాని ఆద్యంతములు పరలోకమునకు ఈ లోకమునకు గల భేదము మొదలగు అనేకాంశాలు విచారణలోకి వచ్చాయి. అందుకే ఏ పూర్వ జన్మలోని దురదృష్టమో వచ్చి తనను తల్లిలేని బిడ్డగా చేసింది. కర్మఫలములు వేయి లక్షలును వచ్చి హృదయ పటములో నిన్ను మాయింపలేదు. హృదయ గతమయిన మాతృముద్రను చెరపడానికి ఏ శక్తికీ సాధ్యం కాదనీ కవి తన మాతృభక్తిని వెల్లడించినాడు.

విశ్వనాథ సత్యనారాయణ 'వరలక్ష్మీ త్రిశతి' తెలుగులోని స్మృతి కావ్యాల్లో గోపురంవంటి కావ్యం. కావ్య నిర్మాణంలో ఒక స్వతంత్ర రీతి అవలంబించి తాత్త్వికత, భావుకత, రసనిర్భరత మూర్తీభవించిన ఈ కావ్యాన్ని ఆయన నిర్మించాడు. సతీ వియోగం వల్ల కలిగిన దుఃఖము దీనికి ఆధారమైనా, కవి తాత్త్విక భూమిక కారణంగా ఇది మూడు శతకాలుగా రూపు కట్టింది. కర్మశతకం మరణానంతర కర్మల సందర్భంలో కవి పొందిన దుఃఖావేశం వ్యక్తం చేయడానికి రచింపబడ్డది. మత సంబంధంగా నిర్వహించే కర్మకలాపాన్ని అనుభూతి మార్గంతో జోడించి వియోగదుఃఖాన్ని పదిరెట్లుగా, వందరెట్లుగా ఉద్వేలపరుస్తాడు అందుకే కావ్యారంభానికి ముందు ప్రియభార్యా వియోగ మెరుగనట్టి-పాఠకుడా! నీవు కర్మ శతకము చదువకు నీ వెఱుగవు దానిలోనిదగు మర్మ మూతి అని ఆ దుఃఖ స్వరూపం నిర్వచింపకుండానే పద్యం మధ్యలో ఆపేస్తాడు.

తర్వాత స్మృతి శతకము కాలము గడచిన కొద్దీ కవి తన దుఃఖాన్ని మనసులో స్మరించుకుంటూ పొందిన భావనా తరంగాలను, ఆలోచనలను విచారణలను తీర్చిదిద్దుతాడు. నిత్య శతకము చేరేటప్పటికి కవి దుఃఖ వైరాగ్యములకు నడుమ నిలిచి ఉంటాడు. దుఃఖ కర్మల నిత్యత్వాన్నీ, నిత్యతా స్వరూపాన్నీ నిర్ణయించి ఉపనిషత్ తత్వాన్ని వ్యాఖ్యానించి శాంతి పాఠంతో కావ్యాన్ని ముగిస్తాడు కవి.

ఈ రచన ప్రణాళికలో మెట్లుమెట్లుగా కవి దుఃఖంలోని విభిన్నమైన అంతరాలను, అంతస్తులను దాటు సౌభాగ్య మార్గంలో సాగి 'నాలోన నేన నేనయ్యెదను' అన్నదశకు చేరుకొని 'శాంతిశ్శాంతి, శాంతి' అని కావ్యాన్ని ముగించి స్మృతికావ్యాలకు సహజమైన కరుణరసాన్ని అంగముగా చేసి శాంత రసములో విలీనం చేసి స్మృతి కావ్య స్వరూపానికి కొత్త కట్టుబడి యేర్పాటు చేస్తాడు.

తన భార్య ప్రాణోత్క్రమణవేళను వర్ణిస్తూ కావ్యం ఆరంభిస్తాడు. నారాయణ స్మరణలో మృత్యువేళ శరీరాన్ని విడిచిపెట్టే జీవుడికి పరమాత్మ స్మరణ కలిగించే ప్రయత్నమిది. ప్రయాణకాలంలో నన్ను స్మరించమని గీతలో భగవంతుడు చెప్పిన అంశం ఇక్కడ స్మరింపదగినది. తత్కాలమందు తనకు కలిగిన స్తబ్ధిభావాన్ని వర్ణించి అతివేలమైన దుఃఖాన్ని అనుభవిస్తాడు.

'నా కులాంగన యాననము చెక్కులద్దనిం
దకట నన్నడ్డు పెట్టకుడు మీరు
నా ప్రియురాలి కంఠము కౌగిలించనిం
డీ కరమ్ములు లాగబోకు డీరు'

ఈ దుఃఖాతిశయం 'వేయిపడగ'ల్లో అరుంధతీదేవి మరణించినపుడు ధర్మారావు పొందినట్లుగా పేర్కొంటాడు. మమకారం ఆధిక్యం చేత మున్ను దుర్ఘటమైనట్టి స్పర్శపు సుఖంబును గూర్చిన ఆ దేహాన్ని చూచి నాడు మదంబును పొందిన నాదు చేతము ఇచట శవదృష్టి పొందదు - అని తన చిత్త స్థితిని వెల్లడిస్తాడు.

ప్రాయశ్చిత్త ఘట్టంలో ఆమె శీలాన్ని తన యొక్క అశక్తతను వర్ణిస్తాడు. ఆమె సురలోక ఆరాధనీయాచ్ఛశిల. వేల్పుటూరి వే వెలుగు రేఖ. తాను కేవలము మృదాకృతి. అమె సాహచర్యము తన జీవితాన్నే ఎట్లా ఉన్నత దిశలకు తీసుకొని పోయిందో దీనిలో వర్ణన ఉంది. తాను ఆమె వాత్సల్య ప్రవాహంలో మునుగుతూ చితాగ్ని వెలిగించే సందర్భంలో నేను భర్తనా? కొడుకునా? అని ప్రశ్నిస్తాడు. అందుకే—

ప్రేమోరూపము దాల్చి వచ్చినది గౌరీదేవి నా యింటికిన్
నా యజ్ఞానము చేత గొన్ని దినముల్ నా లేమిచే గొన్ని నా
శ్కా యానంద తరంగ పూజలకు గానైతిన్ జ్ఞాతా జ్ఞానుడై
శ్రీయుక్తుండయినంతలో గుపిత చేరెన్ గౌరి కైలాసమున్.

తన సతియందు దేవీ భావన చేయడం వరలక్ష్మీ త్రిశతి కంటె ముందు గిరికుమారుని ప్రేమగీతాలలోనే కనిపిస్తున్నది. శ్రీదమై శాంతమై సమీచీనమైన యవ్యయ పదంబునందు సింహాసనమున నీ వధిష్ఠాత్రి వేలుచున్నావు. కమల పవనములు వీచు నీ పదాబ్జముల నుండి సంయోగ వియోగాలలోనూ కవి పొందిన సమానమైన అనుభూతి దీనితో వ్యక్తమవుతుంది. అదే కాలంలో వ్రాసిన మరొక ఖండకావ్యం 'ధర్మపత్ని' లో నన్ననుసరించుకొనుచు వెంటబడి వచ్చు నీ తపోరాశిచేత పునీతుడైతి' అంటాడు. భార్యాభర్తృ భావము, పరస్పర అనురాగము, ఆరాధన సమర్పణము అన్న మూడు అంశాలతో ఎలా శిఖరాలనందుకో గలదో ఈ ఘట్టాలు నిరూపిస్తాయి. కులపాలికా ప్రణయం బ్రతికియున్నప్పుడు తర్వాత కూడా ఎట్లా అవిచ్ఛిన్నంగా సమన్వితంగా ఒక సాధనా విశేషంగా సాగుతుందో ఈ రచనలు నిరూపిస్తాయి.

'నా కనుల యెట్టయెదుట నా శరీర
వామ వామార్థమైన ఈ భాగమెల్ల
పెడపెడ దహించుకొని పోవ విడిసిపడెడు
గ్రుడ్లు పెట్టుకనే జూచుకొంచునుంటి'

తన పత్ని వరలక్ష్మీదేవి దహనవేళలో తన శరీరంలో కొంత భాగం తగలబడి పోతుండగా తాను నిస్సహాయంగా ఎలా నిలిచిపోయాడో వర్ణిస్తాడు.

'ఈమె యోగిని కనులందె యెల్ల బ్రతుకు బ్రతికె కనులందె ప్రాణముల్ వదలి పెట్టె', అని వర్ణించి ఆమె ప్రవృత్తిలోని లోతులను వ్యాఖ్యానిస్తాడు. కర్మ శతకంలో మిగిలిన ఘట్టాలు ఇలా హృదయవిదారకమైనవే. ఒక గౌరీ పూజలో మాత్రం ఆమెకు ప్రాప్తించనున్న గౌరీ లోకాన్ని దాని వైభవాన్ని కవి వర్ణిస్తూ తన దివ్యలోక భావనా పారమ్యానికి పదును పెట్టుకుంటాడు. ప్రళయరహిత గౌరి లోకమును చేరుతున్న తన సతి ఉత్తమ స్థితిని భావించి తన్నుతాను ఓదార్చుకుంటాడు.

'కష్టార్పణంలో మిగిలినది యొక్కటే నాకు మేరువంత బరువు నా గుండెలో మధ్యభాగమందు అంతె పేరునకంతె భార్యాస్థిగాని నా శరీరాస్థి నిజము కృష్ణార్పణమ్మ' అని తనకూ ఆమెకూ ఉన్న అభిన్నతను వ్యాఖ్యానిస్తాడు. స్మృతి శతకం భావవాదనలో సాగిన విచారం ఆధారంగా చేయబడ్డ రచన. తన స్వభావాన్ని తనలోని రజస్తమోగుణాలను ఆమె సత్త్వ గుణంచేత ఎలా పరిణమింపజేసిందో వెల్లడిస్తాడు. తన అఖిల ప్రశస్త కవనానికి ఆమె పట్టభద్రురాలు. ఆమె లేకుంటే అదునికమైన తన చిత్తవృత్తిలేదు. ఇంద్రియముల మీది తన అధికారం లేదు. చివరకు బ్రతుకే లేదు.

'నీవఖిలోహ మార్గముల నిండిన జానకివై రఘూద్వహంగా వెలయించి నావు నను' తన ముప్పైఆరు సంవత్సరాల జీవితాన్ని ఆమె ఆవరించి తమ దాంపత్యాన్ని సీతారాముల దాంపత్యంగా తీర్చిదిద్దిన విషయం పేర్కొంటాడు.

> నీ వొక పెద్ద వెల్గువయి నీ వెలుగారిన నాదు జీవిత
> వ్యావృత్తి యీ కవిత్వ మనునట్టి విచిత్రపు నీడ పారెనో
> దేవి! యరుంధతీ ప్రముఖ దివ్యమహః పరిలీనమూర్తి అ
> నీ వెలుగుల్ పరోక్షమయి నేటికి నీడలు పారజొచ్చెడున్.

తన కవిత్వమంతా ఆమె పా:ంచిన వెలుగునీడలే. ఆమె చైతన్యం కవి అంతస్సును పరిపాలిస్తూనే ఉన్నది. అందువల్ల మరల వివాహమాడియును మానిని నీవు గతించి ఒక్క పుష్కరమును దాటికూడ ఆమె స్మరణ ప్రత్యగ్రంగానే కవిని వరించి ఉన్నది. కవి తన దుఃఖాన్ని, తన భావ సిద్ధిని, విచారణాశీలాన్ని ఆధ్యాత్మిక దృక్పథాన్ని సమన్వయించి ఈ కావ్య నిర్మాణం

చేశాడు. ఉగ్రబాధా దీప్తంబగు దుఃఖమందున పురాతత్త్వాఖ్య భావంబు సంపాదించును. అందువల్ల దుఃఖములు కూడ ఇష్టమగు కాదే అని భావిస్తాడు. విసము మింగిన వేలుపు వెక్కసంపు దుఃఖమును మింగడామె ఆ దుఃఖమెంత మనసునకు ఇష్టమైనట్టి దినుసో కాని దీని తత్త్వము తెలిసియు తెలియరాదు. అందువల్ల 'శాంతిపాఠ మొక్కటే దిక్కు సంసృతి చిక్కు మతికి' అని నిశ్చయించి నిత్య శతకాన్ని ఔపనిషదికమయిన మృత్యుజీవ విచారంలో నిర్మించి శాంతి పాఠంతో కావ్యాన్ని పూర్తి చేస్తాడు.

తర్వాతి కాలంలో వచ్చిన ప్రముఖమైన వియోగ రచన రాయప్రోలు సుబ్బారావుగారి నందా! అనే ఖండిక. పదారేళ్ళు జీవించిన చిదానందుడనే తన కుమారుడు 1948 లో మరణించగా అతని స్మృతికి కవి పట్టిన బాష్పాంజలి యిది. ముప్పైమూడు కంద పద్యాల్లో చిదానందుని స్మరిస్తూ రచయిత తన వేదనను వెల్లడిస్తాడు. వయస్సుకు మించిన చదువు చదివిన చిదానందుడు శ్రీరామచంద్రుని నిత్యము జపించేవాడు. అందుకే కవి 'యోగభ్రష్టుడవై నా యీ గృహమున బుట్టితి వంటాడు. అతని ప్రాణోత్క్రమణవేళని వర్ణిస్తూ-

సుప్త క్షీర సరస్సున
తృప్తాంతఃకరణ సుఖ రతిన్ దేలెడిది
వ్యాప్త మరాళము వలె ని
ర్లిప్తుడవై సకలమును మరిచితో నందా!
మూలాధార సముద్గమ
లీలా రవమై అమృత విలీన స్వరమై
వేలెను రామ స్మృతిసీ
లాలిత రసనా మృణాల లతికను నందా!

ఇంతటి పరిపక్వత కలిగిన చిదానందుని మరణము భౌతిక అనుబంధానికి సంబంధించిన దుఃఖంకంటే భావ సంబంధమైన అతని ఔన్నత్యాన్ని గూర్చిన భావంతో ఒక ఓదార్పును కలిగిస్తున్నది. అందువల్ల నీ నిర్మలాత్మ అమృత విధాన బ్రహ్మైక్యమంది తనియగ అంటూ ఈ ఖండకావ్యాన్ని పూర్తి చేస్తాడు కవి.

తర్వాత వచ్చిన స్మృతి కావ్యాల్లో నాయని సుబ్బారావు విషాదమోహనం ముఖ్యమైనది. రాయప్రోలు వారి సుతస్మృతికి నాయనివారి సుతస్మృతికి కొన్ని సామ్యాలున్నా భేదాలు కూడా ఉన్నాయి. ఇద్దరి కవుల పుత్రులూ ఆధ్యాత్మికమైన సాధన చేసుకునేవాళ్ళే. చిదానందుడిలాగా కాక నాయని వారి కుమారుడు మోహనకృష్ణుడు ఏకైక పుత్రుడు. ఏకపుత్ర వియోగము వృద్ధాప్యము రెండూ ఏకకాలంలో సంభవించి కవిని సంపూర్ణంగా కృంగదీస్తాయి.

మాతృ గీతాలకూ విషాదమోహనానికి నడుమ నలభై సంవత్సరాలపైన వ్యవధానమున్నది. కవి పొందిన భావపరిణతి జీవన పరిపాకము వేదనా వాసుదేవాది కావ్యాల ద్వారా సాధించిన ఆధ్యాత్మికానుభవము అంతకుముందే వెలువడి ప్రసిద్ధి పొందిన వరలక్ష్మీ త్రిశతి ఈ కావ్య స్వరూపాన్ని ఏర్పరించింది. విషాదమోహనం కవి ఆర్తిని వెల్లడించడానికి మధ్యాక్కర ప్రబలమైన అభివ్యక్తి రూపంగా సిద్ధమైంది. అసంకల్పితంగానే కవి 'మోహనా! మోహనా! మోహనాకార మోహనశీల!' అని ప్రారంభించి ఛందస్సులోకి సాగిపోయినాడు. విషాద మోహనంలో కర్మకాండ కవి దుఃఖాన్ని ఎలా రెచ్చగొట్టిందో ఆరంభ ఖండాలు వ్యక్తం చేస్తాయి. 'ఒక ఈ అమావాస్య ఒక్కటే తిథి ఇచట మాకిపుడు' అని తమ జీవితం ఎలా అంధకార బంధురమైందో వెల్లడిస్తాడు.

కుమారుని ఖననం చేసినపుడు కవి పొందిన దుఃఖం హృదయవిదారకమైనది. తనకు తలకొరివి పెట్టవలసిన కుమారుని తాను తన చేతులతో మట్టి కప్పడం ఎంత దుష్టమైన సన్నివేశం!

ఆ మట్టియును కూరుకొనగ నా తండ్రి
అందచందాల
నీ ముక్కుగోళుల నీ కనుంగవ
నీ నోట నూర్పు
నేమాఱు నాడక యెంత యుక్కిరి
బిక్కిరైనావొ
నా మోహనా యంచు నేడ్చినాడన
జ్ఞాన మోహితుడ!

స్మృతి దుఃఖంలో మృతిని గూర్చిన జీవద్భావనా చాలావరకు సహజమైనదే. తొలి ఖండాలలో మరణవేళ స్మృతిని వర్ణించి నెమ్మదిగా అతనితోడి కొన్ని సన్నివేశాలు స్మరిస్తూ స్మృతి దుఃఖాన్ని ప్రకాశింపజేస్తాడు కవి. తనకు గడియారాన్ని కొడుకు కొనిస్తానంటే దాని అవసరం లేదని తాను చెప్పి, ఇప్పుడు అతని గడియారాన్ని తాను ధరించవలసి వచ్చినప్పుడు కలిగే భావోద్వేగాన్ని ఇలా వర్ణిస్తాడు.

ఈనాడు నీ గడియార మిట్లు ధ
        రించినా తండ్రి!
ఆనాటి నీ కోర్కి తీర్చగంటిరా
        యశ్రువుల్ తొరుగ
దీనిని ధరియించలేను వలదంచు
        తీయను లేను
దీని యాగని కొట్టుకొనుట నీ గుండె
        తీరై ధ్వనించి!

గడియారం కొట్టుకోవడం కుమారుని గుండె కొట్టుకోవడంగా చూపించడం కవి తనచుట్టుపట్లఉన్న సర్వ ప్రపంచంలోని తన కుమారుని దర్శించడం చూడవచ్చు. అన్నము ముందర కూర్చుని అలవాటు చొప్పున మోహనుడు రా దేమి అనబోయి అంతలోనే ఆగిపోయి అన్నము మ్రింగుడు పడక కన్నీళ్ళు కారుస్తున్నాడు. అక్కడ నీకు అన్నం ఎవరు పెడతారు? అని ప్రశ్నించి వెంటనే వివేకం మేల్కొని 'ఆవరించిన పంచకోశముల నించి యమృతముగన్న జీవుడా! ఆకలి దప్పులెట్లు స్పృశించురా నిన్ను!' అని భావిస్తాడు. అయినా దుఃఖము తప్పదు. మునినాదులకే తప్పని దుఃఖము మనుజ మాత్రులము మేము సహింపగలమా? అంటాడు. ఇరవైనాల్గవ ఖండంలో తాను జన్మభూమి కావ్యాన్ని రాసేటపుడు శక్తి తత్వాన్ని తన కుమారుడు వివరించిన అంశాన్ని తెలిపి కార్తికేయునికి శివునికిగల గురుశిష్య సంబంధాన్ని స్మరింపజేస్తాడు కవి. చదువుల పరమార్థ మెరిగిన వివేకము తనకు ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది.

పుత్ర వియోగం తర్వాత జీవితం గడుస్తూనే ఉంది. పగలేదో లోక వ్యవహారాలలో నిద్రపట్టినా రాత్రి వత్సలా, తానూ మిగిలిపోయి పుత్ర స్మృతిలో వివశులై ఉంటారు. ఈ సన్నివేశాన్ని కవి వర్ణించిన విధమిది:

ఒకరినొక్కరు చూచుకొనుచు సంతాప
యుత వీ క్షణముల
ఒకరినొక్కరు పిల్చి పల్కరించుకో
నుద్యుక్తులగుచు
ఒకరి మేనొకరు నిమురుచు దురదృష్ట
మోడు హ స్తముల
ఒకరి బాష్పముల నొకరు తుడుచుచు
నూఱడిల్లెదము

ఇది హృదయ విదారకరమైన చిత్రము. ఇంకొక విధమైన సన్నివేశంలో భవభూతి 'రాత్రిరేవ వ్యరంసీత్' అన్న వర్ణన తోడి మాత్రము దీనికి సామ్యముగ చెప్పుకోవచ్చునేమో! క్రమంగా స్మృతి నుండి తట్టుకొని పుత్రుని దివ్య లోక ప్రాప్తి గూర్చి భావించి ఓదార్పు పొందడం కావ్యం చివర కానవస్తుంది. సాకాంక్షితమైన అమృతపురి గూర్చి చను కుమారుడు మళ్ళీ తిరిగి వస్తాడేమో అనే భ్రాంతి అప్పటికీ కవిని వీడదు. చివరి పది పదిహేను ఖండాలు 'కన్నీరు నీకోసము యింక తొలగింపగా రాదురా మాకు' అని దుఃఖ పారవశ్యం నుండి తేరుకొని అతని ఆధ్యాత్మిక పరిణతిని భావించి ఆత్మ పరిపాకాన్ని వర్ణించి నారాయణుడు అతనికి శాంతి సమకూర్చవలెనని ప్రార్థిస్తూ కావ్యాన్ని పూర్తి చేస్తాడు కవి. కావ్యరూపమైన ఈ సృష్టిని పుత్ర వియోగ దుఃఖితులైన తల్లి దండ్రులకు అంకితం చేశాడు.

తెలుగు స్మృతి కావ్య ఉద్యానవనంలో మాతృగీతాలు ఒక మల్లెతీగయితే విషాదమోహనం ఒక సంపెంగ గుబురు.

తుమ్మపల్లి రామలింగేశ్వరరావు రచించిన పితృ యజ్ఞము (1957) ప్రేయోనువాకము (1987) ముప్పై సంవత్సరాల వారడిలో రచితమైన రెండు

స్మృతి కావ్యాలు. రామలింగేశ్వరరావు పితృదుఃఖాన్ని తన శ్రోతకర్మనిష్ట చేత నిత్య జపసాధనాదులచేత దివ్యమయం చేస్తాడు. ఆయన దుఃఖం భూమి మీదనే ప్రారంభమైనా వెంటనే పక్షిలా ఎగిరి అలౌకిక తాత్త్విక సీమల్లో విహరిస్తాడు. రామలింగేశ్వరావు స్మృతి కావ్యాల్లో భౌతిక జీవన యథార్థాల కంటె పుణ్యసాధనానుభవాలు ప్రబలంగా గోచరిస్తాయి. అర్చిరాది మార్గంలో ప్రయాణించే తన తండ్రిని లోకానికి పిలిచి కష్టపెట్టను అంటాడు.

తండ్రి! నిన్నుదలచి తల్లిదలచినట్లె
తల్లికిని నీవట యుపాస్య దైవతంబు
అందరకు తల్లియైన గాయత్రినిచ్చి
ద్విజునిగా నన్ను నీవె కల్పించినావు

తండ్రిలో తల్లిని లీనం చేసి భావించడం ఒక అరుదైన ఊహ. రామలింగేశ్వరరావు స్మృతి కావ్యాల్లో ఒక వైలక్షణ్యం పూర్వగాథా స్మరణము. అయోధ్య కాండలోని రామ భరత సమాగమంలో పితృమరణ వార్త విన్న శ్రీరాముని దుఃఖాన్ని వర్ణించే కథను విస్తరించి చెప్పి ఆ దుఃఖాపనోదనానికి వశిష్టులు జ్ఞానోపదేశం చేయడం చేర్చి తాను దుఃఖాన్ని తరించిన విధానాన్ని సూచిస్తున్నాడు కవి. సుమంతుడు ఆ దుఃఖవార్త చెప్పేటప్పుడు శిథిల దేవాలయము వోలె ఉన్నాడట. శ్రీరాముడు దుఃఖం నుండి తేరుకున్న పద్ధతిని కవి ఇలా వర్ణిస్తాడు:

తెల్ల తెల్లగ వెలుతురు తెప్పరిల్లి
ఊపిరిని పోసికొన్నట్టు, లురకపాల
విభుడు రామచంద్రుడె తెప్పిరిలెనంత.

ఈ కవి సతీస్మృతిగా వ్రాసిన ప్రేయోనువాకము తొలిభాగం అనుషంగము సంయోగ శృంగార సౌందర్యాన్ని వర్ణించేది. తర్వాత కుసుంభ, నీలి, మాంజిష్ట భాగాలలో తమ దాంపత్యాన్ని దేవహూతీ కర్దములతో, సీతారాములతో నలదమయంతులతో అభిన్నంగా భావిస్తూ, వారి దాంపత్య గాథలను విస్తరించడం కనిపిస్తుంది. చివరి భాగం 'నిర్గమనం' భార్యా వియోగాన్ని

వర్ణించేది. నిజానికి స్మృతి కావ్య విభాగము చివరిదే అయినా పూర్వభాగాలన్నీ అనురాగ గాఢత్వాన్ని పరస్పర సంభావనా లక్షణాన్ని వ్యాఖ్యానిస్తవి.

ఎందుకు ఉదయించె నీనాడు సూర్యుడం
చనిపించలేదు - ఏ దినము మున్ను
ఎంత దుష్టంబైన దీకాల గమనమం
చనిపించలేదు - ఏ దినము మున్ను
ఎంత పైశాచికం బీ గంటసేపు - అం
చనిపించలేదు - ఏ దినము మున్ను
ఏ మిట్ట మధ్యాహ్నమింత నిప్పులు గ్రక్కె-
ననిపించలేదు - ఏ దినము మున్ను
ఒక మహా దుఃఖ పాథోధి యొడ్డు నిలిచి
మీద కురికి ముంచెత్తను లేదు మున్ను
పరమదుష్ట కాలాగ్ని విద్వరము రగిలి
ప్రళయ మనిపించె నీదు నిష్క్రమణవేళ

ఇంతగా చెప్పిన కవి అనుభూతిలో దుఃఖమన్నదే పంచకోశముల వరకు 'నీవు పంచకోశాతీతవు- నీ తోడి అనుభవంచే మిగిలినది నేడు' అని వివరిస్తాడు. నీ బంధువులు నీ తనూజలు నీ కుమారుడు క్షేమముగ ఉన్నారు. వారికి నీ స్మృతి అక్కరలేదు. నేను విరాగిని అని స్మృతి బంధాన్ని సుకుమారంగా త్రెంచివేస్తాడు. 'మోహమే ఎంతయో నిల్చిపోయెగాన అమిత చింతన నీతికో గమనవేళ దాని నుండి సత్యప్రబోధము గలిగె మోహమును లేదు సుఖదుఃఖ ములును లేవు. ప్రియావియోగమును తన సాధనకు ఇంతగా ప్రత్యక్షమార్గంగా ఎన్నుకోవడం ఈ కవి వైశిష్ట్యం. తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు స్మృతి కావ్యాలు నిర్మాణంలోని కౌశలం చేత స్పష్టమైన ప్రత్యేకతను సంతరించు కొన్నవి.

కుందుర్తి ఆంజనేయులు 1982 లో ఆయన భార్య సుందరమ్మ మరణించినపుడు రచించిన కావ్యము 'హంస ఎగిరిపోయింది' వచన కవిత్వంలో వచ్చిన స్మృతికావ్యం. దీనిలో 12 భాగాలున్నవి. కావ్య నామమే కవికి సంప్రదాయంతో ఉన్న గాఢానుబంధాన్ని వ్యక్తం చేస్తుంది.

కుందుర్తి ఆంజనేయులు ఈ కావ్యంలో ప్రత్యక్షంగా జీవితంలోని అనుభవాలను స్మరించడం అంతగా చేయలేదు. వ్యక్తి తన జీవితాన్ని సతీ వియోగంతో ఒంటరియైపోయి తనలోకి తాను కుంచించుకొని పోవడం ఈ కావ్యంలో ప్రధాన వస్తువు. ప్రత్యక్షమైన భౌతిక సన్నివేశాలు, దృశ్యాలు అరుదుకావడంవల్ల ఈ కావ్యం మనోమయలోకానికే పరిమితమై భావనామాత్ర గమ్యమాన మవుతుంది. ఈ సంవిధానంవల్ల ఈ కావ్యం హృదయంకన్నా బుద్ధికి నన్నిహితంగా ఉంటుంది.

> బ్రతుకులో ఉన్న పాలన్నీ గటగటా తను త్రాగేసి
> మిగిలిన నీళ్ళు నా పాలుగా భాగంపంచి
> హంస ఎగిరిపోయింది.
> అది నా కీర్తికి తోడుగా
> వెన్నెల నీడలో ఆడుకోవడానికి
> మా పెద్దలిచ్చి పోయిన పెంపుడు పక్షి.

కావ్యారంభం ఈ విధంగా జరిగింది. ఈ హంస ఆయన భార్య. ఆమె పెద్దలచే అతనికి ఇవ్వబడిన పెంపుడు పక్షి. రామాయణంలో రాముడు సీతను అధికంగా ప్రేమించడానికి కారణం 'దారాః పితృకృతా యితి' అని వాల్మీకి వర్ణిస్తాడు. విశ్వనాథ, తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారలు తమ తమ సతులను పితృదత్తలుగానే వర్ణిస్తారు.

> 'తోడులేని ఒంటరిగాణ్ణి
> తొంగి చూస్తే భయంగా ఉంది
> బైట ఏముంటే ఎందుకు?
> నా లోపలే నేను కూచుంటాను'

నా లోపలే నేను కూచుంటాననడం ఏకాంతంలోకి ప్రయాణం చేయడం లేదా విశ్వాత్మలో అభిన్నత్వాన్ని పొందడం కావచ్చు. అక్కడక్కడా స్మరించిన కర్మకాండ అంశాలు అవిశ్వాసానికి విశ్వాసానికి నడుమ ఊగుతున్న

కవికి వాటిని ఆర్ద్రంగా ప్రతిపాదించడం సాధ్యంకాలేదు తన దుఃఖాన్ని వర్ణించడంలో కవి చిత్రించిన భావ చిత్రాలు కొన్నిచోట్ల అతి తీవ్రంగా కని పిస్తవి.

'నింగి వాలినట్లు
నేల కూలినట్లు
చెట్లాకులు శిశిరంలో రాలినట్లు
కింద పెట్టిన గుండెకుంపట్లో అవి కాలినట్లు.'

వచన కవితలో కుందుర్తి స్మృతి కావ్యం ఆ ప్రక్రియకే నూతనదిశను చూపిస్తున్నది.

(తెలుగు విశ్వవిద్యాలయం అధ్వర్యాన శ్రీ నాయని సుబ్బారావు స్మారకోపన్యాసం (మూడవది) 26-10-1990)

# ఆధునిక కవితలో సమన్వయం కోసం, పరిపూర్ణత కోసం అన్వేషణ

ఆధునికాంధ్ర కవిత్వంలో ఈ శతాబ్దారంభం నుంచీ 1930 దాకా, 1955 దాకా, ఇప్పటిదాకా అని మూడు దశలు విభజించుకోవడం సౌలభ్యం కోసమే. తొలి రెండు దశల్లో కాల్పనికోద్యమం, ప్రగతివాద నవ్య సంప్రదాయాలు ప్రాచుర్యం వహించాయనీ మూడవ దశలో సమగ్రత కోసం, సమన్వయం కోసం అన్వేషణ కొనసాగిందనీ భావించవచ్చు. ఈ అన్వేషణ మానవుడి అంతరాంతరాలలోనుంచి ఉబికి వచ్చింది. దీనికి అతని చైతన్యానికీ సృష్టి చైతన్యానికీ నడుమ ఉన్న ఒక సంబంధం లయాన్వితంగా నిలిపే, ప్రయత్నం పరిమితమైన మానవుడి వ్యష్టిచేతన అవచేతననూ సమష్టి అవచేతననూ దాని ద్వారా విశ్వ చైతన్యాన్ని స్పృశించేందుకు చేసిన ప్రయత్నం ఇది. ఆధునిక యుగంలో ఈ ప్రయత్నం ఇటు వైజ్ఞానిక రంగంలో అటు ఆధ్యాత్మిక రంగంలోనూ జరుగుతూ వచ్చింది. ఈ రెంటి కలయికలో సమన్వయం సాధ్యం కావడమే ఈనాడు సృష్టివేదిక మీద జరుగుతూ వున్న ఒక అద్భుతం.

ఈ దశ ఆరంభంలో తెలుగు కవితను గూర్చి అబ్బూరి రామకృష్ణారావు 'కవితా పురంధ్రి మరపుతెరల మాటుమణగి మాయమైనదనీ, భయద మహాప్రస్థానం పయనమైన పదినాళ్ళకె దారితప్పిపోయావా నా నేస్తం?, పొరపాటీ తిరుగుబాటు' అని ప్రగతివాద ధోరణి ఎలా దారి తప్పిందో స్పష్టంగా చెప్పడం జరిగింది. అదే మళ్ళీ 1983 లో నిరసన కవులు విశాఖపట్టణంనుంచి 'వేసుకున్న రంగులకిందా పట్టుకున్న జండాలకిందా దాక్కునే కళాభీరువుల్ని నిరసిస్తున్నాం' అని తరువాతి కాలంలో ప్రగతివాద ధోరణి వేరే పేర్లతో ప్రకటించుకునే అంశాన్ని స్పష్టంగా నిరసించడం జరిగింది.

కృష్ణశాస్త్రి 1956 తరువాతి కాలంలో ఒక జాతీయ కవి సమ్మేళనంలో స్నేహక్షీరము అనే రచన చదివాడు. నాల్గు దిక్కుల భూ భవనమంత లవలేశ మును వదలకయె తిరిగి ప్రతి గేహ దేహళి పదమాగి ప్రతిహృదయ ద్వార తోరణమట్టె త్రోసి లోనికి జొచ్చి నాలోని స్నేహక్షీర మొక్కింత ఒక్కింత ఒలకబోసి సాగిపోవలెననే.

ఈనాడీభువి బానిసీడు మరిలేనేలేడు ఒక్కొక్క పా
లానన్ పావక నేత్రమున్నది పగల్ కాల్పంగ ఒక్కొక్కడెం
దానన్ క్షీర సముద్రమున్న దవధుల్ దాటంగ - ఈ మానవుం
దే నిర్మాత విధాత నేత మరి తానేభోక్త లోకమ్ము నన్

అని పగలు కాల్చిన, స్నేహక్షీరసిక్తమైన మహా మానవ జీవన దృక్ప థాన్ని వ్యక్తం చేయడం జరిగింది.

అప్పటికే కాల్పనిక యుగం నుంచీ తన కవితా యాత్రను అనుస్యూ తంగా కొనసాగిస్తూ వస్తూ వున్న విశ్వనాథ రామాయణ కల్పవృక్షంలో సగం పైగా రచన పూర్తి చేయడం జరిగింది. కాల్పనికోద్యమ కాలం నాటి వస్తువుల కంటే ముందుకు సాగి సర్వజీవ హృదయాంతర వర్తియైన 'జీవుని వేదన' ఆయన కావ్య వస్తువయింది. సృష్టిలో నిత్యమైన దైవాసుర శక్తుల సంఘర్ష ణలో దైవశక్తుల విజయాన్ని కల్పవృక్షంలో ప్రధాన వస్తువుగా స్వీకరించడం జరిగింది. అంతర బాహ్య జగత్తుల సమన్వయ బిందువైన ధర్మాన్ని సాహి త్యానికి కేంద్ర బిందువుగా స్వీకరించడం జరిగింది.

డార్విన్ పరిణామవాదం సృష్టిలో అర్హతగలదే నిలచి వుంటుందనే సిద్ధాంతం ద్వారా పరిణామంలోని సంఘర్షణ లక్షణానికి పట్టాభిషేకం చేసింది. గతి తార్కిక వాదము కూడా పరస్పరం సంఘర్షించిన శక్తులలో చరిత్ర పుట్టిం దని వ్యాఖ్యానించింది. ఈ రెండూ గత శతాబ్దపు సిద్ధాంతాలు.

ఆధునిక భౌతిక శాస్త్ర వికాసం ఇంకా ముందుకుపోయింది. క్రమంగా ప్రాచ్య దేశాలలోని రహస్యవాద అనుభవాలు, విజ్ఞాన శాస్త్రం బోధించే అంశాలు అతి సన్నిహితం కాజొచ్చినయ్.

In the words of OPPENHEIMER—

If we ask, for instance, whether the portion of the electron remains the same, we must say 'no'; if we ask the electron portion changes with the time we must say no; if we ask whether the electron is at rest we must say no; if we ask whether it is in motion we must say 'no'—

The reality of automic physicist, like the reality of the eastern mystic, transcends the narrow frame work of opposite concepts Oppenheimer's words thus seem to echo the words of the upanishads.

> It moves it moves not
> It is far and it is near
> It is within all this
> And it is outside of all this.

Force and matter, particle and , motion and rest, existence and non existence - there are some of the opposite and contradictory concepts which are transcended in modern physics

The Tao of physics – Frijz Copra (P. 166-67)

పైన పేర్కొన్న అంశాన్ని బట్టి విరుద్ధాలుగా పైకి కనిపించే అంశాలు ఉన్నత దశలో వైరుధ్యాన్ని అతిక్రమించి వుంటవి. ప్రాతిభాసికమైన దశలో ఉన్న వైరుధ్యం సత్యదశలో సమైక్యాన్ని భజిస్తూ వున్నది. అందుకే 'తదేజతితన్నైజతి' ఇత్యాది ఉపనిషద్వాక్యాలు ఏకవస్తువునే విరుద్ధ ధోరణిలో వర్ణిస్తూ వున్నవి. అందుకే అది పరిపూర్ణము. దానినుండి పూర్ణము ఉద్భవిస్తూ వున్నది. ఈ వ్యష్టిలోని సృష్టిలోని పూర్ణతా లక్షణాన్ని అనుభవంలోకి తెచ్చుకోవడం యోగం. ఈ అనుభవం పొందిన వ్యక్తి చైతన్యం విశ్వమునే ఆవరిస్తుంది. అతనికి విశ్వమే శరీర మౌతుంది. తన భౌతిక శరీరం కేవలం విశ్వ చైతన్యం యొక్క ఆవిష్కార రూపమే అవుతున్నది.

భౌతిక శాస్త్రము, మనస్తత్వ శాస్త్రము, యోగశాస్త్రము మూడు సమన్వయం పొందటం వల్ల ప్రాచ్య రహస్యవాదాంశాలు కేవలోహలు కాకుండా పరిపూర్ణ సత్యాలుగా ఆధునిక కాలం నిరూపించింది. గడచిన శతాబ్దం హేతు వాద యుగం కాగా. అద్యతనశతాబ్దం మనోలోకపు రహస్య ద్వారాలను తెరచే యుగంగా రూపొందింది. రాబోయేకాలం ఇంకా ఎన్నో అలౌకికాంశాలను ఆవిష్కారం చేయబోతున్నది.

భారత పునరుజ్జీవనోద్యమంలో పునరుత్థితాలైన మూల్యాలు సనాతనమైన ఈ జాతి చైతన్యానికి సంబంధించినవి. వలసవాదం వల్ల కొత్తగా వచ్చిన పారి శ్రామికీకరణవల్ల, గ్రామీణత నశించి పట్టణీకరణం పెరగడం వల్ల అనేక నూతన మూల్యాలు ఏర్పడ్డవి. ఈ రెంటి నడుమ ఒరిపిడి జరుగుతున్నది. రామ మోహనుని నుంచి జిడ్డు కృష్ణమూర్తి దాకా ఈ మూల్యాలను అంచనా వేయడం జరుగుతూనే ఉన్నది.

జగన్మిథ్యా అనీ, యద్దృశ్యం తన్నశ్యం అనీ అపవ్యాఖ్యానింపబడ్డ అద్వైతం ఆధునిక కాలంలో పునః వ్యాఖ్యాతమైంది. శ్రీ అరవిందుల దర్శనం దీనికి స్పష్ట రూపాన్ని ప్రసాదించింది.

ఈ జగత్తు పరమైన సత్యము యొక్క అభివ్యక్తి. పరమమైన సత్యము సచ్చిదానందాత్మకము. ఆ బ్రహ్మయే అసద్రూపంగా - అచిద్రూపంగా - దుఃఖమయంగా కనిపించే ఈ భౌతిక జగత్తును తన అనంత రూపం నుంచి అభివ్యక్తం చేసి దాని అట్టడుగున దాగిఉన్నది. ఆ బ్రహ్మమే పరిణామ క్రమంగా జడమై, ప్రాణమై, మనస్సై పరిణమిస్తున్నది. ఈ మనోమయ దశ నుంచి విజ్ఞానమయ, ఆనందమయ, స్థితులను పొందవలసి ఉన్నది. ఇతర తాత్త్వికులకంటే భిన్నంగా శ్రీ అరవిందులు ఈ పృథ్విపైననే ఈ దివ్య చైతన్య పరిణామము సాధ్యమే అని చెప్పినారు. ఇక్కడ జీవుని అభీప్స చేత ఆరోహణము, ఈశ్వరానుగ్రహం వల్ల అవరోహణమూ జరుగుతవనీ ఈ రెంటి కలయికవల్ల పృథ్విపైననే పరిపూర్ణ మానవుడు అవతరించగలడనీ పృథ్విపైన జీవనం దుఃఖరహితమై, అజ్ఞాన రహితమై పరిపూర్ణమై భాసిల్లగలదనీ చెప్పి నాడు. ఈ పరిణామాన్ని వేగవంతం చేయడంకోసం మానవుని సాధన అవస

రమనీ ఆ సాధన వల్లనే త్వరలో ఈ భూమిపైకి దివ్య మనస్సు దిగివస్తుందనీ ఆయన దర్శించారు. అప్పుడు ప్రాతిభాసికంగా కానవచ్చే వైరుధ్యాలు ఉండవు. ఇది పూర్ణయోగమువల్లనే సాధ్యమనీ ఆయన పేర్కొన్నారు. ఈ పూర్ణయోగం జీవనం నుండి పారిపోవడం కాకుండా దాన్ని సమగ్రమూ, నిర్దుష్టమూ చేయడం కోసం ప్రయత్నం చేస్తూ అహంకార త్యాగం ద్వారా ఊర్ధ్వ దిశనుంచి వచ్చే వెలుగులను స్వీకరించేందుకు తాను సంసిద్ధం కావలెననీ ప్రవచించినారు.

తెలిసియో తెలియకనో చాలమంది ఆధునిక కవులు ఈ తాత్త్విక దర్శనానికి స్పందించినారు.

దీనికి మరో కారణం ఉంది. రెండు ప్రపంచ యుద్ధాల నడుమ పాశ్చాత్య దేశాల్లో మేధావులు మానసికమైన అల్లకల్లోలానికి గురైనారు. యుద్ధ బీభత్సం నుంచి వారు శాంతులు కాలేదు. భ్రాంతులైనారు. మానసిక వైక్లబ్యం యేర్పడింది. సృష్టి ఎటుపోతున్నది? దీని లక్ష్యం ఏమిటి? ఇంత నాగరికత విధ్వంసం కావలసిందేనా? జీవితానికి లక్ష్యం ఏమైనా ఉన్నదా? ఇలాంటి ప్రశ్నలు వేసుకొని తనలోతానే కుంచించుకొని పోయిన పాశ్చాత్య లోకంలో వైయక్తిక కళావాదాలు రూపొందినయ్. అవచేతన యొక్క విచిత్ర విలాసాలు కళారూపాలను సంతరించుకొన్నవి.

సర్రియలిజం, క్యూబిజం, డాడాయిజం, ఎక్స్‌ప్రెషనిజం ఇటువంటి ధోరణులు మనస్వియైన మానవున్ని ఒంటరినిగాజేసి తనలోని అసంతులిత భావకల్లోలాలను వ్యక్తం చేయడం వస్తువుగా రూపొందినయ్. తననుంచి తానే దూరమైపోయాడు మనిషి.

సృష్టిని వైరుధ్యాల సంపుటిగా, సృష్టిక్రమాన్ని సంఘర్షణ ఆధారంగా భావించడం వల్ల ఈ స్థితి కలిగింది. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత కూడా ఆయుధాల పోటీలు ఆ ధోరణిని కొనసాగిస్తూనే ఉన్నవి. అయితే ఈ కాలంలో విశ్వజనీన దృక్పథం బలం పొందింది. జాతీయ దృష్టినుంచి విస్తరించి అంతర్జాతీయ దృష్టిని మానవుడు అలవరచు కుంటున్నాడు. అంతర్జాతీయ రంగంలో ఒక అవగాహనకోసం, వైరుధ్యాలను తొలగించుకోవడం కోసం ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. మానవైక్యతా ధర్మం ఈనాడు ఆదర్శంకాక ఆచరణీయమైన సాధ్యాంశంగా స్ఫురిస్తున్నది.

మానవైక్యతాదర్శం మన దేశంలో సనాతనమైంది. అంతేకాదు. సర్వ జీవసమైక్యతా భావన మనకు సహజమైంది. శంనో అస్తు ద్విపదే - శంచతుష్పదే అని చెప్పినా ద్యౌశ్శాంతిరన్న మంత్రంలో పృథ్వికి జలాలకు ఓషధులకు అంతరిక్షానికి లోకానికి ఇత్యాదిగా సర్వ సృష్టిలో అంశాల పరమ శాంతిని అభిలషించినా సర్వసృష్టినీ ఏకాత్మ భావంతో దర్శించడం వల్లనే సాధ్యమయింది.

స్వాతంత్ర్యప్రాప్తికి పూర్వం రామమోహనులు, రామకృష్ణులు, దయానందులు, వివేకానందులు, తిలక్, గాంధీ ప్రభృతుల ప్రభావం సాగివచ్చింది. శ్రీ అరవిందుల దర్శనంకాకుండా మానవేంద్రనాథ్‌రాయ్, జిడ్డు కృష్ణమూర్తి - వీళ్ళిద్దరూ ఆధునిక చైతన్యాన్ని ఎంతగానో ప్రభావితం చేసినవాళ్ళు.

మానవేంద్రనాథ్‌రాయ్ ఆలోచన మార్క్సిస్టు తత్వంకన్నా ముందుకు సాగింది. మార్క్సిస్టు లక్ష్యాలైన చలనంలేని సమాజం (Stagnant Society) నిత్యమైన నియంతృత్వాన్ని గూర్చిన వాస్తవమూ ఈ రెంటినీ దాటి ఆయన స్వేచ్ఛనుంచి ప్రేరణ పొందటం జరిగింది. కార్ల్‌మార్క్స్ మానవతావాదియే. అయితే ఆయన అనుయాయులు మానవకోటికి మానవుడే మూలమన్న సంగతి మరచిపోయారు. సమాజం మనిషి సృష్టించిందే. మనుషులు వ్యక్తులుగా పుడతారు. మనిషికంటే ముందు సమాజం లేదు. ఈ సమాజం ప్రతి వ్యక్తిలో నిహితమైన శక్తులన్నింటినీ అభివ్యక్తం చేసేందుకు ఉపకరణం కావాలి. తర్కతీర్థ లక్ష్మణశాస్త్రి రాయ్‌ని గూర్చి మాట్లాడుతూ విజ్ఞాన శాస్త్రంలోని మౌలికాంశాలనూ, మానవుని నైతికానుభవాలనూ మేళనం చేసిన తొలి భారతీయ తత్త్వవేత్తగా అభివర్ణించారు.

రాయ్ తత్వం ఒకవైపు ప్రవర్తిస్తుండగా - దివ్యజ్ఞాన సమాజం సంకెళ్ళ నుండి విడివడిన జిడ్డు కృష్ణమూర్తి వ్యవస్థీకృతమైన ఏ అంశమూ పరిక్షీణం కాక తప్పదనీ మానవుడే తనకు తాను మార్గదర్శకుడు కావలెననీ చెప్పాడు. ఆయన ప్రధానంగా ప్రబోధించిన అంశం ఏమిటంటే - మతముగానీ, రాజకీయ వ్యవస్థగానీ మానవుణ్ణి ఆనంద లక్ష్యం వైపుగా తీసుకొనిపోలేవనీ, అతనిలో సహజమైన ఎరుక (Awareness) ఉండవలెననీ, మనిషి దృష్టి పూర్వ నిశ్చితాలైన అభిప్రాయాలకూ, నిశ్చయాలకూ అతీతంగా ఉండాలి

అనిబద్ధంగా చైతన్యం విస్తరిస్తూ పోవాలి. దేనిలోనూ గురువు అవసరం లేదు. తన అంతశ్చైతన్యమే తనకు మార్గదర్శనం చేస్తుంది. తాను పరిమితమైన మనఃకోణం నుండి విముక్తుడు కాగలిగితే ఈ ఎరుకవల్ల గతం నుండి విముక్తుడై నవంనవంగా ఉండే స్థితి కలుగుతుంది. ప్రేమ, దయ, త్యాగము మొదలైన దైవీగుణాల ప్రాధాన్యము జీవనంలో కలుగుతుంది. ధ్యానం అప్రయత్నసిద్ధం కావాలి. దానివల్ల ఒక అతీతమైంది (beyond) ఆవరిస్తుంది. ప్రశాంతి సంభవిస్తుంది.

రాయ్, కృష్ణమూర్తి - పీళ్ళిద్దరి దర్శనములు శ్రీ అరవిందుల దర్శనం లాగా ఆస్తికములు కాకపోయినా విశ్వ చైతన్యాభిముఖంగా మానవ జీవన వికాసాన్ని ప్రతిపాదించినవే అయినవి. అంతేకాక కృష్ణమూర్తి దర్శనం మానవుడికి సర్వతోముఖమైన స్వేచ్ఛను ప్రతిపాదిస్తున్నది.

విశ్వనాథ ప్రతిపాదించిన జీవుని వేదన జీవుని అభీప్సను ప్రతిపాదిస్తున్నది. సర్వజీవులు తమ మనోభూమికల్లో ఎక్కడో ఒకచోట ఈశ్వరునినుండి విడివడ్డ తాము మళ్ళీ ఆస్థితిని పొందవలెననీ కోరుతూ వుంటారు. అందువల్ల సర్వుల ప్రవృత్తీ ఆనంద సాధనాభి ముఖంగా సాగుతూ వుంటుంది. కల్ప వృక్షంలో అన్ని పాత్రలూ ఈశ్వర విరహాన్ని అనుభవించేవే. చైతన్యంలోని వివిధ స్థాయిలలో శ్రీరామచంద్రుని ఈశ్వర తత్త్వము నెరిగినవే. అయితే వాటి ప్రవృత్తిలో వాక్కులో ఈ అవచేతనలోని ఎరుకవల్ల ఆ లక్షణం తొంగి చూస్తూ వుంటుంది. ఇది రాక్షస పాత్రల్లో మానుష పాత్రల్లో అన్నింటా సహజంగా కనిపించే లక్షణం. వీరందరిలో నిగూఢంగా ఉన్న భావం బావిలో రాయిని చీల్చుకుని వచ్చే నీటి ఊట వంటి లక్షణం.

అట్లాగే దైవాసుర సంఘర్షణ. దేహనిష్ఠులైనవారు అసురభావావృతులైతే భావనిష్ఠులు దేవభావావృతులు. ఈ దైవాసుర సంపద అందరిలోనిది. అయితే ఏ ప్రవృత్తి వారిలో ప్రధానమౌతుందో వారిని దేవాసురులుగా చెప్పుకోవడం జరుగుతుంది. కల్పవృక్షంలో—

జనకజాత శరీర నిష్ఠంబొనర్ప
కదక వ్యవసాయి యగు పంక్తి కంధరుండు
రావణుని బోధ దేవ భావావృతునిగ
జేతకు గడంగు పూత ధాత్రీతనూజ.

ఈ సంఘర్షణకు ప్రతీకగా ఆధునిక కాలంలో ఈ రచన కొనసాగింది. ఈ సంఘర్షణలోనుంచి దైత్యభావం క్రమంగా విలులితమై దైవభావం బలం పొందినప్పుడు ఈ పరిణామం సాధ్యమౌతుంది. ఈ సంఘర్షణ మనో భూమిక లోనిదే.

1967 లో విశ్వనాథ రచించిన శ్రీకృష్ణ సంగీతములో సృష్టి అంతా గోపికయై పరమేశ్వరుని చేరబోవడం నూట యెనిమిది గోపికల వేదనలలో వైవిధ్యంగల గీతమాలికగా రూపొందింది.

జీవితంలో అనాసక్తంగా ఉంటూ సాక్షీభూతంగా నిలవడం గురించి పొట్లపల్లి రామారావు – చుక్కలు (1974) లో ఇలా అంటాడు:

–మనము నిర్వహించేది ఎంత ప్రముఖ పాత్రయైనా
స్వీయ ప్రాచుర్యం కోసం యక్షగానంలోని వేషధారులవలె రావడం
దురదృష్టకరమైన విషయం.

అంతకన్న ఎక్కడో మూల నిశ్శబ్దంగా కూర్చొని
ఈ జగన్నాటకాన్ని రసైక చిత్తంతో తిలకించడం
ఎన్నోరెట్లు ప్రమోదదాయకం. (పే. 2)

రేవటి మనిషిని గూర్చిన గోపాల చక్రవర్తి ఊహ ఇది:

భవిష్యత్తులో మానవుడి తలపై
బాధల ముళ్ళకిరీటం ఉండదు.

ఈ ముళ్ళకిరీటం పునరుజ్జీవనానికి ముందరిది. పునరుజ్జీవితుడైన ఈశ్వర పుత్రుడు ఆనందమయుడు

రణదాహం, సంఘర్షణలు మానవుడి పురోగమనానికి విరుద్ధమైన అంశాలు. 'రణదాహ ఘోరతాపమున బీడైయున్న / మనిషి మేధా భూమి మరల పండింతును / మనిషి మనసుకు శాంతి మధువు రుచిచూపించి / యుద్ధ

విషపాత్రికను బ్రద్దలొనరింతును' అని లోకాన్ని లంకగా కాక కైలాసమ్ముగా జగము రాణించునటు పునారచన చేతమ్మొ రమ్మ అని ఆహ్వానిస్తున్నాడు. ఈ పునారచన చేయవలసింది మానవుడే.

ఈ పరిణామం ఎలా సాధ్యం? దివ్యమైన పరిణామం వల్ల వైరుధ్యాలు సమసిపోతవి. వైరుధ్యా లున్నంతవరకు ఉన్నత సమాజం నిర్మాణం కావడం సాధ్యం కాదు. మాదిరాజు రంగారావు ఆ పరిణామాన్ని వర్ణిస్తున్నాడు:

భగవంతుడు విడిది చేసిన లిప్తలో—

ఆకాశంనుండి భూమివరకు నిశ్శబ్దం నిలిచిఉంది స్తంభంవలె....
అలసిసొలసి ఇంతసేపు విశ్రమించిన ఫాలనేత్ర కపోలాధరాలు
వెలుగువేళ్ళు సాచి స్పృశిస్తూ పరవశింపజేస్తున్న అమృతమూర్తి....
కాని సుగమ సుందరంగా అవతరించింది మరో సృష్టి

ఇంతకూ ఎవరి మౌనదీపం? భగవంతుడు విడిది చేసిన లిప్త యిది.

మోహన్‌ప్రసాద్, శ్రీకాంతశర్మ, సత్యశ్రీమన్నారాయణ ఇత్యాదులైన కవుల్లో ఒక అంతర అనుభవ అభివ్యక్తికి ప్రయత్నం ఉన్నది. ఈ వ్యక్తి అయా పేరుగల వ్యక్తి కాదు. పైపై పరివేషాలు తొలగిన సాధారణీకరణం పొందిన వ్యక్తి. ఆ వ్యక్తి అనుభవం అంతర్ముఖులైనవారిలో ఎవరిదైనా కావచ్చు. అందువల్ల వ్యక్తి వాదమంటే అదేదో స్వంత (private) విషయం లాగా భావించడం సరియైన ధోరణి కాదు.

అంతర్ముఖమైన ఈ ధోరణి వల్ల తన చుట్టూవున్న విశ్వం ఎంత విశాలమైనదో తనలో లోతుల్లో ఉన్న మనోలోకం కూడా అంత సంక్లిష్టమూ, సంశ్లిష్టమూ అనే అంశం తెలియవస్తుంది.

సత్య శ్రీమన్నారాయణ ఒకచోట ఇలా రాస్తాడు :

చీకటి కాకి/చుక్కలగుడ్లని/రాత్రల్లా పొదుగుతుంది.
ఒకే ఒకటి/సూర్యకోకిలం అవుతుంది.
మిగిలినవన్నీ/కాకిపిల్లలై /చీకటి కాకితో/ఎగిరిపోతాయి.

ఇది ఒక విధమైన సూర్యోదయ వర్ణన. కాని వ్యంజకమైన అనుభవం అంచెలంచెలుగా విశ్లేషిస్తూపోతే ఒక జీవితమంత వ్యాఖ్యానం సాధ్యమౌతుంది.

ఆత్మ ప్రత్యయంగల వ్యక్తిత్వం ఎలా ఎదుగుతూ ఎదుగుతూ ఒక దేశానికే ప్రాతినిధ్యం వహించగలదో శేషేంద్ర ఇలా వ్యాఖ్యానిస్తాడు:

'నేనింతా ఒక పిడికెడు మట్టే కావచ్చు
కానీ కలమెత్తితే నాకు
ఒక దేశపు జండాకున్నంత పొగరుంది'

వ్యక్తి తన్ను తాను విస్తరిస్తూ తానే దేశంగా, దేశమే తానుగా పరిణమించడం మహాపురుషుల జీవితాలలో చూడవచ్చు.

అనంతమైన వ్యక్తి వికాస భావన మాదిరాజు రంగారావు కావ్యాల్లో వ్యక్తీకరింపబడి, మానవజాతికేకాక సమస్త సృష్టికీ మూలాధారమైన తేజశ్శక్తిని అభివర్ణించడం అమృత లిప్తలలో సూక్ష్మతరంగా దృశ్యమానమవుతున్నది:

నిలిచింది సత్యం
వెలుగు దుస్తులు ధరించి
నా ముఖంలో మౌనం
వహించిం దఖండ ధైర్యం-
....................
స్మృతుల పరంపరలో
విరిసాయి పద్మాలు
వివిధ వర్ణరాగంతో
పరిమళ మధుభావంతో (పుటలు 80-81)

వ్యక్త చైతన్యానికి మూలమైన అంతఃస్ఫూర్తిని అందుకునే ఈ ప్రయత్నం లోని 'వివిధ వర్ణరాగం' అనేక విభాగాలుగా దర్శనమిచ్చే సత్యం యొక్క ప్రాపంచి కావిష్కరణములే. ఈ విధంగా తెలుగు కవిత్వంలో కనిపించే ధోరణి ఒక విధంగా తనలోకి తాను చూచుకోవడంగా ఆవిష్కరించుకోవడంగా

తన చూట్టూ ఆవరించుకున్న వరాయీకరణ భావంనుంచి తప్పించుకోవడంగా భావించవచ్చు, రష్యా సాహిత్యవేత్త డోస్టోయేవ్‌స్కీ ఎపుడో ప్రపంచ చైతన్యాన్ని బహిర్ముఖత్వం నుంచి అంతర్ముఖత్వం వైపు మరలించమని ప్రబోధించాడు.

It would be useful for Russia to forget Peters burg for some time and to turn her soul towards the east. ఈ తత్వవివేచన పాశ్చాత్య దేశాల్లోని మేధావులలో చాలాకాలం క్రిందటే ప్రవేశించి మన సాహిత్యంలో కొన్ని ధోరణులు పాండిత్య ప్రకర్షతో ఇంద్రియవాదంతో సంకుచిత జాతీయ లక్షణంతో ఈ శతాబ్దపు ఆరంభంలో ప్రకటితమైనవి. తరువాత ప్రయోజన రహితమైనవి, ద్వేషాన్ని ప్రేరేపించేవి, జుగుప్సను, లాలసను ప్రకటించేవి, మనసుయొక్క అవ్యవస్థను చిత్రించేవి అయిన అనేక ధోరణులు అట్టహాసంతో ప్రచార ఘీంకారాలతో సాహిత్యరంగంలో విశృంఖలంగా ప్రవేశించాయి, కాని అల్టస్ హక్స్లీ ఎప్పుడో ఈ క్రింది మాటలు నిశ్శబ్ద ప్రాధాన్యాన్ని గూర్చి చర్చిస్తూ చెప్పాడు :

"Words inspired by malice and uncharitableness towards our neighbours, words inspired by greed, sensuality, and self love, words inspired by pure imbecility and uttered without rhyme or reason, but merely for the sake of making a distracting noise .... And if the unspoken words of our minds endless, idiot monologue are counted, the majority of idleness becomes, for most of us, over whelmingly large. All these idle words, the silly no less than the self regarding and the uncharitable are impediments in the way of the unitive knowledge of the divine ground, a dance of dust and flies obscuring the inward and the outward light" (The perennial philosophy).

మానవుడు తన లోతుల్లోకి పోయినప్పుడు సామాన్య మానసిక స్థాయి నతిక్రమించి ఒక జీవన తత్త్వాన్ని స్వాయత్తం చేసుకుంటాడు. జీవితం జీవించడం కోసమే కాక సత్యం కోసం సౌందర్యం కోసం ధర్మం కోసం నీతి న్యాయాల కోసం ఏర్పడుతుంది. ఈనాటి తెలుగు కవుల్లో ప్రతి తరంలోనూ ఆత్మ చైతన్యాన్ని స్పృశించే ప్రయత్నం కానవస్తూనే ఉంది. జీవితం ఎదిగే నైరంతర్యం స్థిరమైన బిందువు కాదు, నిరంతరం రూపొందడం.

అందుకే ఆధునిక తెలుగు కవి జీవితాన్ని అంటే భౌతిక మానసిక ఆధ్యాత్మిక భూమికల త్రిపుటిని తన పతాకంగా భావిస్తున్నాడు. తన పరిమితు లన్నీ విచ్ఛేదం చేసి చైతన్యం ప్రకాశించే ప్రతి అంశాన్ని తనతో ఆత్మీయంగా భావిస్తున్నాడు. బ్రతుకును విభాగించే అడ్డుగోడలు ఏవీ అతని దృష్టిలో ఉండవు. మనస్సు గీచిన లక్ష్మణ రేఖను దాటి విశాల భావనా లోకంలోకి ప్రవేశిస్తున్నాడు. అతని దర్శనం పరిపూర్ణతను సమగ్రత్వాన్ని సాక్షాత్కరింప జేస్తుంది. అతనికి జీవితం అనంతమైన పవిత్ర గ్రంథం.

(నవంబరు 1987 లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు శాఖ వారి యుజిసి విద్వద్గోష్ఠిలో చదివిన వ్యాసం)

# తెలుగులో తులనాత్మక పరిశోధన

పరిశోధన యొక్క తత్త్వం మూలతః వస్తు సమగ్రతత్త్వావిష్కారం. ఈ తత్త్వావిష్కారానికి మూడు పార్శ్వాలు. వస్తు స్వరూప వివేచనము, ఆంతర్య నిరూపణము, తులనాత్మక అధ్యయనము. ఈ మూటి నడుమ విభాజనరేఖ గీయడం అంత సులభం కాదు.

సాహిత్య రంగంలో పరిశోధనలో ఆ సాహిత్య సంప్రదాయంలో ఆ కావ్యము - రచయిత వైశిష్ట్యాన్ని నిరూపించే అంశంలో తులనాత్మక అధ్యయనం ప్రారంభమవుతుంది. శాస్త్రాంశాలే అయితే ఆ శాస్త్ర సంప్రదాయానుగుణంగా దాన్ని పరిశీలించవలసి ఉంటుంది. ఒక దేశపు సాంస్కృతిక నేపథ్యంలో అనేక భాషలు - కళారూపాలు వికసించే పద్ధతిలో ఆయా భాషలలో ఆయా కళారూపాలలో ఒక సామ్యం - ఒక ఏక సూత్రం అంతర్నిహితంగా మనకు గోచరిస్తుంది. ఈ కళారూపాలను గూర్చిన అవగాహనకూడా సామ్య లక్షణం కలిగి వుంటుంది.

భారతదేశంలో ప్రచురమైన సంస్కృతీ ప్రవాహం ఆధారంగానే మన కళారూపాలన్నీ వికసించాయి. సాహిత్యం, సంగీతం, చిత్రకళలూ, కళారూపాలు ఇతర శాస్త్రాంశాలు అన్నీ అందరికీ సమానమే. ఇటీవలి కాలంలో మనం ఆలోచిస్తున్నట్లుగా ప్రాంతీయ భిన్నతలు రెండు వందల సంవత్సరాలకు పూర్వం మన దేశ జనులలో స్పష్టంగా కనిపించడం లేదు. వాల్మీకి నుంచి రాజశేఖరుడి దాకా అందరూ భారతీయ సాహిత్య ప్రతినిధులే. పదో శతాబ్దం దగ్గరనుంచీ వేరువేరు భాషలలో వెలువడుతున్న సాహిత్యంలో కూడా ఒక సామ్యం - సమానోద్యమస్ఫూర్తి, భావలక్షణం గోచరిస్తూ వున్నవి.

ఒక ప్రాంతంలో ఒక స్వరం వినబడితే - దాన్ననుసరించి వేరొక ప్రాంతంలో మరొక స్వరం వినబడుతూనే ఉన్నది. ఈ దృష్టితో నడిమి యుగాలనుంచీ భారతీయ సాహిత్యం అనే అంశాన్ని మనం స్పష్టంగా రూపొం

దించుకోవలసి ఉన్నది. చిన్న చిన్న సాహిత్యాల నాప్మీకరణాలనించి దాటి ఈ సాంస్కృతిక సంపద అందరిదీ అవుతుంది.

మధ్యయుగాలలో భారతదేశాన్ని కదిలించిన ఉద్యమాలలో భక్తి ఉద్యమం ప్రధానమైంది. భగవద్రామానుజుల శిష్యుడు రామానందులద్వారా ఉత్తర దేశంలో భక్తి ఉద్యమరూపం ప్రాబల్యాన్ని పొందింది. భాగవత సంప్రదాయాన్ని వల్లభాచార్యులు దక్షిణదేశంనుంచి గుజరాత్ దాకా తీసుకువెళ్ళారు. వల్లభుల శిష్యుడు సూరదాసు దశమస్కంధానువాదం అక్కడ భాగవత రసానుభవాన్ని సర్వులకూ అందించింది. పురందరదాసు అన్నమయ్యను దర్శించినట్లు చరిత్ర చెప్తున్నది. అన్నమయ్య ప్రేరణ హరిదాసోద్యమంలో ఎంత ఉన్నదో జాగ్రత్తగా అధ్యయనం చేయవలసి ఉన్నది. అన్నమయ్య రచనల వెనుక ఆళ్వారుల ఐకాంకిత భక్తి భావం పునాదిగా ఉంది. ఆంధ్ర కర్ణాటకాలలోని ఈ భక్తి ఉద్యమస్రోతస్సుకూ మహారాష్ట్రలోని సాధు సంత సంప్రదాయానికి ఎంత సాన్నిహిత్యం ఉన్నదో మనం పరిశీలించవలసి ఉన్నది. మధ్య యుగాలలో అనేక భారతీయ భాషలలో రామాయణ రచన జరిగింది. 'బద్ధ నిరూపితార్థాన్ని ఆయా భాషలలో చెప్పడమే లక్ష్యమా లేక ఒక రచన వెనుకాల ఇంకొక రచన ప్రేరణ ఉంటూ వచ్చిందా' అనేది విచారణ చేయవలసిన అంశం. —భాస్కర రంగనాథులు - తులసీదాసు, కృత్తివాసుడు, ఎజుత్తన్ పరంపర చెప్పుతూ పోవచ్చును. వీటన్నింటిలోనూ అంతో ఇంతో అవాల్మీక గాథా పరంపర ప్రతిఫలిస్తూనే ఉన్నది.

తిరుక్కురళ్, బసవని వచనాలు సాహిత్యంలో కాల్పనిక లక్షణం నుంచీ, కథాంశాల వివరణల లక్షణం నుంచీ దూరంగా భావనాత్మక ధోరణిని ప్రవేశపెడితే వేమన, సర్వజ్ఞుల రచనలో అవి స్వతంత్రంగా వికసించడం కబీరు రచనలలో స్ఫుటంకావడం మనకు గోచరిస్తుంది.

భిన్న లక్ష్యాలలో రచనలు ప్రారంభమైనా వస్తు సామ్యంవల్ల సృజనలో సామ్యం ఏర్పడుతూంది. పంప భారతం, నన్నయ భారతం ఈ రెంటి అనుశీలనలో ఈ సమాన లక్షణం కానవస్తున్నది.

భారతీయ భాషలన్నింటిలోనూ ఆధునికయుగావిష్కారం ఒకేసారి వచ్చింది. అన్ని భాషలలోనూ సమాన వస్తుప్రభావాలు ఉద్యమాలు దాదాపుగా కనిపిస్తున్నవి. ఆధునిక ప్రక్రియా వికాసం, గద్య వాఙ్మయ విస్ఫోటం అన్నింటికి సమానమే.

ఈ దృష్టితో పరిశీలన చేయగలిగితే భారతీయ భాషా వాఙ్మయాలలో ఉండే ఏకసూత్రం మనకు సులభంగా గోచరిస్తుంది. సామాజిక ధార్మిక రాజకీయ ఉద్యమాలు ప్రభావితం చేసిన సమలక్షణం ఇక్కడ ప్రస్ఫుటంగా గోచరిస్తుంది.

ప్రపంచ వ్యాప్తంగా తులనాత్మక అధ్యయనం క్రమక్రమంగా వృద్ధి పొందుతూ వున్నది. తులనాత్మక మతాధ్యయనం, కళాధ్యయనం, జానపద కళల అధ్యయనం, భాషాధ్యయనం, సమాజధర్మ అధ్యయనం – ఇలా వైవిధ్య పూరితమైన అధ్యయనం కొనసాగుతున్నది. అయితే సాహిత్య రంగంలో తులనాత్మక అధ్యయనం గూర్చిన ప్రయత్నాలు సాగుతున్నా ప్రపంచ పరిధిలో అది స్పష్టమైన రూపం అందుకోలేదనే చెప్పాలి.

ఈ ప్రయత్నం ఏ ప్రాంతాని కాప్రాంతంగా కొనసాగించవలసి ఉన్నది. విభిన్న భాషా సారస్వతాలు ఉన్న మన దేశం ఒక చక్కని ప్రయోగ క్షేత్రం.

గడచిన నలభై సంవత్సరాలలో ఈ కృషి కొంతలో కొంత ప్రారంభ మైంది. సాహిత్య అకాడమీ, నేషనల్ బుక్ ట్రస్టు, భారతీయ జ్ఞానపీఠ్, రైటర్స్ వర్క్‌షాప్ (కలకత్తా) వంటి సంస్థలు ఈ దిశలో చెప్పుకోదగిన కృషి చేశాయి. అనువాదాలద్వారా తులనాత్మక అధ్యయనానికి అవకాశం లభిస్తున్నది. ఒకప్రాంతంలోని రచయితలకు, ఉన్నతస్థాయి పాఠకులకు ఇతర ప్రాంతాల రచయితల పేర్లతోనైనా కనీసం పరిచయం ఏర్పడుతున్నది. తులనాత్మక పరిశోధనకు కొంతలోకొంత భూమిక ఏర్పడుతున్నది.

అయితే ఇప్పుడున్న పరిస్థితులలో ఈ తులనాత్మక అధ్యయనం ఒకటి కన్న ఎక్కువ భాషా సాహిత్యాలతో సాన్నిహిత్యం ఉన్న పరిశోధకులు చేస్తూ

ఉన్నారు. ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మ తెలుగు తమిళ సాహిత్యాలనూ, డా॥ ఆర్వీయస్ సుందరం, డా॥ తంగిరాల వెంకట సుబ్బారావులు తెలుగు కన్నడాల గురించీ పరిశోధనలు చేస్తూ ఉన్నారు. ఇప్పటికే ఆచార్య గంధం అప్పారావు వేమన-సర్వజ్ఞుడు, డా॥ బయ్యా రత్నావళి పంప-నన్నయల భారతాలు. డా॥ సర్వోత్తమన్ దాక్షిణాత్య భాషల్లోని ఛందోగీతులు, డా॥ ఆర్వీయస్ సుందరం తెలుగు - కన్నడ జానపద గేయాలను గూర్చి పరిశోధనలు చేశారు.

పంప-నన్నయ భారతాలమీద పుట్టపర్తి నారాయణాచార్యులు దాదాపు 35 సంవత్సరాల పూర్వమే అలంపురం సభలలో ప్రసంగించారు. అట్లానే జగన్నాథ విజయానికీ పారిజాతాపహరణానికీ నడిమి సంబంధంగూర్చి కూడా వారే ఒకమారు సూచించారు.

ఈ తులనాత్మక అధ్యయనం ఆంధ్రప్రదేశ్‌లోని విశ్వవిద్యాలయాలలో హిందీ శాఖలలో ఎక్కువగా జరుగుతున్నది సాధారణంగా విద్యార్థులు ఎక్కువ మంది అధ్యాపకులు తెలుగువారు కావడంవలన అధ్యయనాంశం తెలుగు హిందీ సాహిత్యాల నడిమి అంశంగా ఉండటంలో ఆశ్చర్యంలేదు. హిందీ శాఖలో ఈ దిశలో జరిగిన పరిశోధనలు దాదాపు నూరు దాకానే ఉన్నయ్యేమో. ఈ అంశాలలో ముఖ్యమైనవి ఇవి : 1. హిందీ తెలుగు భాషల్లో మధ్యకాలంలో రామకథా సాహిత్యం. 2. హిందీ తెలుగు భాషల్లో వైష్ణవభక్తి సాహిత్యం 3. హిందీ తెలుగు భాషల్లో కృష్ణభక్తి కావ్యాలు. 4. సూరదాసు పోతన్న 5. సూరదాసు-పోతన్నల వాత్సల్య రసం. 6. హిందీ తెలుగు భాషల్లోని చాయావాద (Imagism) కావ్యాలు 7 హిందీ తెలుగు సాహిత్యాలలో రూపక సాహిత్యం 8. హిందీ తెలుగు భాషల్లో సమకాలీన కవిత. 9. సాకేత-రామాయణ కల్పవృక్షము. 10. పంత్-కృష్ణశాస్త్రి 11 హిందీ తెలుగు భాషలలో సామాజిక నవలలు. 12. హిందీ తెలుగు భాషలలో ప్రగతివాద కావ్యధార. ఇలా ఎన్నో విషయాలపై హిందీ విభాగాలలో పరిశోధనలు జరుగుతూవచ్చాయి. ఇంకా కొనసాగుతున్నవి.

ఈ ఉభయ భాషా సాహిత్య ధోరణుల తులనాత్మక అధ్యయనం తెలుగు హిందీ సాహిత్యాల నడుమ జరుగుతూ వున్నంత ఎక్కువగా, తెలుగులో మరొక భాషా సాహిత్యాలను పోల్చి జరగటం లేదు

ఈ పరిశోధనలో మౌలికంగా కొన్ని లోపాలు కనిపిస్తున్నాయి. స్థూలంగా దేనికి దానికిగా పరిశీలిస్తూ - చివరకు పోలికలు చెప్పే అధ్యయనం చిన్నది చివరకు చేరుస్తున్నారు. ఈ పరిశోధకులలో చాలా మందికి తెలుగు సాహిత్యంలో పరిచయం మాత్రమే కాని ప్రావీణ్యంగానీ అధికారంగానీ లేవు. పరిశోధన చేయించే పర్యవేక్షకుల పరిస్థితీ అరుదైనచోట్ల తప్ప అంత మాత్రమే. అందువల్ల ఈ పరిశోధనలన్నీ ఉపరిశోధనలుగానే ఉండి పోతున్నవి గాని మౌలికాంశాల జోలికి పోవడంలేదు.

ఈ తులనాత్మక పరిశోధనలో సాఫల్యం పొందిన భాగం లేకపోలేదు. అది ప్రధానంగా సంస్కృతాంధ్రాల మధ్య పరిశోధన జరిగినప్పుడు. ఇక్కడి పరిశోధనలో ఒక అంశం అది సమాన స్థాయిలో ఉండే రచనల మధ్య కాక ఆధార, ఆధేయాల మధ్య జరగడం. సంస్కృతాంధ్రాలలో రామాయణ భారత భాగవతాలు పురాణాలు అధ్యయనం చేసే సన్నివేశంలో మూలమునకు ఎంత వరకు విధేయమో ఎంత విడిగా సాగిందో చెప్పడమే జరుగుతున్నది. ఆ విడి పోకకు సహేతుకంగా సమర్థన చెప్పడం కూడా జరగవచ్చును. ఆచార్య దివాకర్ల వేంకటావధాని నన్నయ భారతములో ఈ పరిశీలన విస్తృతంగానే చేశారు. అయితే తత్పూర్వము ఈ విషయం పైన ఎందరో పరిశోధకులు కృషి చేశారు. నన్నయ భారతంలో దీనికి ఒక సమరసమైన పరిష్కారం లభించింది. వ్యాస భారతము - నన్నయ పరిష్కారము కూడా ఈ త్రోవలో సాగిన మరొక పరిశోధన. ఈ ధోరణిలోనే భాగవతమును గూర్చి ప్రసాదరాయ కులపతి రచన కూడా కొంత పరిశీలన చేసింది. సంస్కృతాంధ్ర నైషధముల మీద కూడా ఒక గ్రంథం వచ్చింది.

తులనాత్మక పరిశోధన రెండు భాషల నడుమనే పరిమితం కానక్కర లేదు. ఒకే భాషలోని రెండు రచనల గూర్చి కూడా పోల్చి చూడవచ్చు. అలా వచ్చిన ఒక రచన పెన్నేటి రామచంద్రరావు 'మను-వసు ప్రకాశిక'. ఈ రచన మను చరిత్రనూ, వసు చరిత్రనూ తులనాత్మకంగా అధ్యయనం చేసింది. ఈ మధ్య ఇదే విషయం మీద ముదిగంటి సుజాతా రెడ్డి పరిశోధన చేసి గ్రంథాన్ని ప్రకటించింది.

భాషాశాస్త్ర రంగంలో తులనాత్మక పరిశోధనలు చెప్పుకోదగ్గ పద్ధతిలో జరిగాయి. ఈ విషయంలో ఎక్కువ కృషి ద్రావిడ భాషల మధ్య జరిగింది. ప్రాకృతాలకూ తెలుగుకూ మధ్యకూడా ఈ కృషి ఎక్కువగా జరగవలసిఉంది.

## డాక్టర్ సుప్రసన్నగారి కొన్ని రచనలు :

1. తేజశ్చక్రము : దుఃఖయోగిని (1958).
2. అధునా (1964).
3. ఋతుంభర (1974).
4. పాండిచ్చేరీ గీతాలు పన్నెండు (1976)
5. పాంచాలరాయ శతకము (1977)
6. సాహిత్య వివేచన (1971)
7. సహృదయ చక్రము (1983)
8. హృద్గీత (సంపత్కుమారతో కలిసి రాసింది)
9. ఆనందలహరి (1977) ( ,, )
10. చేతనావర్తం (సంపాదకత్వం) (1967)
11. అగ్నిగర్భ (సంపాదకత్వం) (1974)
12. హిరణ్యగర్భ (సంపాదకత్వం) (1983)
13. విశ్వనాథ మార్గము (1992)
14. భావుక సీమ (1993)

